

# BLUE STAR





CLIMATIZER DELUXE
AIR CONDITIONER

LEONARD REFRIGERATOR.

— STOCKISTS —

# AIR FRIGE

Jonnalagaddavari Street — Trunk Road.

NELLORE-524001.

Specialists in Repairing & Servicing of all Kinds of Refrigerators, Air Conditioners, Bottle Coolers etc.

Service is our Motto

గ్రామ్స్ : ఇండియా సీడ్                                   ఫోన్స్ : 1264, 1602, 1853

రైతుసోదరులకు

# ఉగాది శుభాకాంక్షలు




జొన్న : సి. ఎస్. హెచ్- 1, సి. ఎస్. హెచ్. ౫. సి. ఎస్. హెచ్. 6

సజ్జ : హెచ్. బి. 3, (బి. జె. 104) హెచ్. బి. ౫. పి, హెచ్. బి. 10
పి. హెచ్. బి. 14.

మొక్కజొన్న : గంగ ౫, డక్కన్

ప్రత్తి : వరలక్ష్మి, హైబ్రిడ్ 4

మరియు

అన్నిరకముల కూరగాయల విత్తనములు

—ఉత్పత్తిదారులు—

## ఇండియా సీడ్స్ కార్పొరేషన్

(పుష్కల్ బ్రాండ్ విత్తనోత్పత్తిదారులు)

పోస్టుబాక్సు : 62

అరవిందనగర్ – నెల్లూరు - 524003.

## అధికోత్పత్తికి ప్రధానం
## సస్యరక్షణ

మన నెల్లూరులో తయారుచేయబడుచున్న

అన్నపూర్ణా ఇన్‌సెక్టిసైడ్స్ ఇండస్ట్రీస్‌వారి

లయన్  బ్రాండ్


# బి. హెచ్. సి. 10%

వాడి పైర్లకువచ్చు తెగుళ్ళు, పైర్లను నాశనంచేసే క్రిములనుండి పైర్లను కాపాడుకోండి: అధిక దిగుబడులను పొందండి.

— అన్ని ఎరువుల అంగళ్లలోను దొరకును —

# అన్నపూర్ణా ఇన్సెక్టిసైడ్స్ ఇండస్ట్రీస్

ఇండస్ట్రియల్ ఎస్టేట్ - నెల్లూరు-524 004.



శేష్‌మహల్

ఆనాటి

'పాతాళభైరవి' నుండి

ఈనాటి

'దాన వీర శూర కర్ణ' వరకు

మిమ్మలను ప్రత్యేకతతో

ఆదరించిన

నెల్లూరు సినీ ప్రేక్షకులకు

# శేష్‌మహల్ - రంగమహల్

## ఉగాది శుభాకాంక్షలు

తప్పక చూడండి

ఆలుమగలు (కలర్)

రాబోవు రంగుల చిత్రాలు

జీవిత నౌక

చాణక్య-చంద్రగుప్త

అనార్కలి

శ్రీరామ పట్టాభిషేకం



రంగమహల్




స్థాపితము: 1930.

స్థాపకులు : నెల్లూరు వెంకటరామానాయుడు

సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

# పింగళ ఉగాది: 20-3-1977

## విషయసూచిక

# ప్రకటనల క్రమసూచిక

# మా మాట

'పింగళ' ఉగాది సంచికను మీ ముందర పెడుతూ, ఒక్కమాట...

నలభయ్యేడేళ్ళ 'జమీన్ రైతు' పుట్టిందీ పెరిగిందీ విస్తరిల్లిందీ ఈ జిల్లాలో. ఇది ప్రధానంగా జిల్లా పత్రిక. నెల్లూరు జిల్లా నాల్గు గెమిళ్ళే దీని పరిధి, పరమావధీ. నెల్లూరు జిల్లా జన జీవితమే ఈ పత్రిక ఊపిరి. ఈ జిల్లా ప్రజల కష్టసుఖాలు, చీకటివెలుగులు, సామాజిక రాజకీయ ఆర్థిక స్థితిగతులు, సారస్వత సాంస్కృతిక నిమ్నోన్నతాలు, చారిత్రిక సన్నివేశాలు, వారి దైనందిన సమస్యలూ సంఘటనలూ... ఇవే 'జమీన్ రైతు' జీవనాడులు. ఆ స్పృహతోనే, ఆ స్పందనతోనే 'జమీన్ రైతు' జీవిస్తూ, నెల్లూరుజిల్లా ప్రజాజీవితంతో తాదాత్మ్యం చెందింది. ఇది స్వోత్కర్ష కాదు. మా పరిధి, మా లక్ష్యం, మా కర్తవ్యం ఇది.

ఇన్నాళ్ళుగా ఇన్నేళ్ళుగా మేము ఏ మానాలో వున్నామో, దాన్నే ఇప్పుడూ అనుసరించదలచాము; ఆ పునాదిపైన్నే ఈ ఉగాది సంచికను రూపొందించాము.

'జమీన్ రైతు' అనూచానంగా ఉగాదికి ప్రత్యేక సంచిక ప్రచురిస్తుంది. ఐతే ఇటీవల, 'సాధారణ' తర్వాత ఆ సంప్రదాయానికి విఘ్నం కల్గింది. ప్రతియేడూ ప్రయత్నమైతే చేస్తున్నాము కానీ, ఏవో అవాంతరాలు, ఏవేవో ఇబ్బందులు. వాటిని అధిగమించలేక, ఉగాది సంచికను విరమించుకోవడం అనివార్యమవుతూ వచ్చింది.

ఈసారి 'పింగళ' సంచికను వెలువరించాలని సంకల్పించి, ఏ ప్రాంతీయపరిధి అయితే మాకు ఇన్నాళ్ళు మౌలికమైన ప్రాతిపదికగా వుందో, దానినే ఇందులో మా అనుసరించాలని నిర్ణయించాము. ఆవిధంగా ఈ ఉగాది సంచిక నెల్లూరుజిల్లాకు సంబంధించిన ఒక 'ప్రత్యేక సంచిక'గా రూపొందించడానికి ప్రయత్నించాము.

నెల్లూరు జిల్లా సాంఘిక రాజకీయ సాంస్కృతిక రంగాల పుట్టుపూర్వోత్తరాలను స్థూలంగానైనా దిఙ్మాత్రంగానైనా పరిశీలించే చారిత్రక వ్యాసాలను మాత్రమే ఈ సంచికలో అందివ్వాలని మా అభిప్రాయం. కానీ అది సంపూర్ణంగా సమగ్రంగా నెరవేరిందని మేమనుకోవడంలేదు.

స్థానిక చరిత్రను సర్వంకషంగా రూపొందించవలసిన అవసరం మునుపటికన్నా ఇప్పుడు జాస్తిగా గుర్తించబడ్తూంది. స్థానిక చరిత్ర పునాదులపైన్నే జాతిచరిత్ర, దేశచరిత్ర నిర్మించబడాలని; అట్లా తయారైందే ప్రామాణికమైన చరిత్ర కాగలదనీ భావించబడ్తూంది. కానీ ఆ ధోరణిలో నెల్లూరు జిల్లా చరిత్రను రూపొందించే ప్రయత్నం యేదీ ఇంతదాకా జరగలేదు.

నిజానికి ఇతరజిల్లాలతో పోల్చుకుంటే ఈ విషయంలో మనం చాలా వెనకబడివున్నాము. నెల్లూరుజిల్లాకు ఏ ఇతర ప్రాంతానికీ తీసిపోని చరిత్ర అయితేవుందికానీ, దాన్ని గ్రంథస్తం చేసే దిక్కే లేదు. చరిత్రేకాదు; చరిత్రకారులకూ ఈ జిల్లా ప్రసిద్ధిచెందిందే! ఐనా ఎందువల్లనో ఈ జిల్లాకు సంబంధించిన వివిధరంగాల, వివిధ దశల చరిత్ర అక్షరరూపాన్ని సంతరించుకోలేకపోతూంది. పరిశోధించవలసిందీ, వెలుగులోకి తీసుకరావల్సిందీ ఎంతోవున్నా, ఒకక్రమ పద్ధతిలో, సుశిక్షణతో, సంయమనంతో కృషి చేసినవారు చాలాతక్కువగా కన్పిస్తున్నారు.

ఐతే ఈ ఒక్క ప్రత్యేకసంచికద్వారా మేము ఆ బృహత్ప్రయత్నానికి పూనుకోదలచుకోలేదు; అది దుస్సాధ్యంకూడా. ఒక సాధారణ జిల్లాపత్రిక, ఆర్థికంగానేకాదు, ఇతరేతర సౌకర్యాలు వసతులదృష్ట్యాకూడా అనేకానేక పరిమితులకు పరిస్థితులలోనై పనిచేసే వారపత్రిక, జిల్లా చరిత్రను అతిస్వల్ప వ్యవధిలో సమగ్రంగా రూపొందించగలదని భావించకూడదు, ఆశించనూకూడదు. ఐతే మా పరిమిత పరిధిలోనే, వార్తాపత్రికా వ్యాసంగంలోనే అయినా, స్థానిక చరిత్రకొక రూపం కల్పించాలనే భావిపథకానికి నాందిప్రస్తావన కాగలదనే ఆశతో ఈ ప్రయత్నానికి పూనుకొన్నాము.

ఇందులో ఎన్నోలోపాలున్నాయి; లోటుపాట్లున్నాయి. మేము ఆశించినంతటి సమగ్ర సుందరంగా ఈ సంచిక రూపొందలేదు. ఇంకా పూరించని గడులు ఎన్నోవున్నాయి; స్పృశించని రంగాలూ చాలావున్నాయి. విద్య, వైద్యం, ఆరోగ్యం, క్రీడలు, పరిశ్రమలు, లలితకళలు వగైరా రంగాల చరిత్రనుగూర్చి ఈ సంచిక ఏమీ తెలియచేయడంలేదు. అట్లాగే జిల్లాలోని పుణ్యస్థలాలు, చారిత్రక ప్రదేశాలు, సాంస్కృతిక కేంద్రాలు... ఇవన్నీ ఈ సంచికలో కనబడవు. అట్లా విశ్లేషించి చూస్తూపోతే, మేము చేసినదానికన్నా చేయవలసిందెంతో.... ఇంకెంతో... ఉందని స్పష్టమవుతుంది.

ఉదాహరణకు— భారతదేశచరిత్రలో ఒక మహోజ్జ్వల ఘట్టమైన స్వాతంత్ర్యోద్యమం ఈజిల్లాపై కల్గించిన ప్రభావం. దాని ప్రతిధ్వనులు; హెచ్చుతక్కువ ఈ జిల్లానంతట్నీ కదిలించివేసిన జమీందారీ వ్యతిరేకోద్యమం, దాని స్వరూప స్వభావాలు— వీటినిగూర్చి ఒక ప్రత్యేకసంచిక కాదుగదా, ఒక బృహద్గ్రంథం వ్రాసినా చాలదేమో! అట్లాగే మన వ్యవసాయం, మన పరిశ్రమలు, మన సామాజిక పరిస్థితులు, సామాన్యుని స్థితిగతులు... ఎన్నో లేవు పరిశోధించవలసినవీ, చరిత్ర పుటలలో కెక్కవలసినవీ! రేపు జరగబోయే ఆ సమగ్ర పరిశోధనాకృషికి ఈ ప్రత్యేక సంచిక కొంతయినా ఉత్తేజం కల్గిస్తే— అదేచాలు!

ఈ సంచికకు ముఖచిత్రంగా తిక్కన చిత్రాన్ని ఎన్నుకొన్నాము. తిక్కన నెల్లూరికి శాశ్వత కీర్తిపతాక గనుక, ఆయన ఊహాచిత్రంతో ఈ సంచికను అలంకరించడంకంటే సముచితం మరొకటి వుండదని మా భావం.

1933 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు తిక్కన ఊహాచిత్రలేఖనంలో పోటీ నిర్వహించారు. కేతన దశకుమారచరిత్రంలోని తిక్కన వర్ణననుసరించి బొమ్మ వెయ్యాలని నిబంధన. ఆ పోటీలో గుర్రం మల్లయ్యగారి చిత్రానికి బహు

మతి లభించింది. ఆ చిత్రాన్ని అనుసరించి, వెంకటగిరివాసి జి. కృష్ణమరాజు మరొకచిత్రం రూపొందించారు. అది ముమ్మూర్తులా గుర్రం మల్లయ్యగారు వేసిన చిత్రంమాదిర్నే వుందని పించుకొన్నది. కృష్ణమరాజుగారు ఆచిత్రాన్ని వర్తమాన సమాజానికి బహూకరించారు. ఆ చిత్రమే ఈ సంచిక ముఖచిత్రం.

ఈ సంచికలో తొలివ్యాసం వ్రాసిన సుప్రసిద్ధ చరిత్రకారులు నేలటూరు వేంకటరమణయ్యగారు ఇటీవలనే స్వర్గస్థులయ్యారు. విజయనగర చరిత్రమీదనేకాదు; ఏ చారిత్రకాంశం మీదనైనా ఆయనది తుదితీర్పుగావుండేది. ఆయన వ్రాసిన చిట్టచివరి వ్యాసాన్ని ఈ సంచికద్వారా అందివ్వగల్గుతున్నందుకు ఎంతో సంతోషంగావుంది. తిక్కన జక్కన రచనల లోనిచారిత్రకాంశాలనుగూర్చి ఆయన స్థూలంగా వర్ణించారు; ఇప్పటిదాకా చరిత్రకారులు నమ్మిన కొన్ని అంశాలను ఆయన ఖండించారు.

చరిత్రకు సంబంధించిన వ్యాసాలలో డాక్టర్ సి. వి. రామచంద్రరావు శాసనాలు, కావ్యాల నాధారం చేసుకొని నెల్లూరు పుట్టుపూర్వోత్తరాలను పరిశోధించారు. ఆంగ్లేయులు ఈ సీరాన స్థావరం ఏర్పరచుకొన్ననాటి జిల్లా పరిస్థితులను మలిరెడ్డి పట్టాభిరామరెడ్డి వివరించారు. తర్వాత డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారిది పరిశోధనాత్మకవ్యాసం కాదుగానీ, పరిశోధనకొక ముడిసరుకు. జిల్లాలో స్వాతంత్ర్యోద్యమంతో సన్నిహిత సంబంధంకల్గిన రాజకీయ నాయకుడుగా ఆయన తన జ్ఞాపకాలను తెలియజేశారు.

కావలి వెంకటరామస్వామి ప్రచురించిన 1826 నాటి గ్రంథాన్నుంచి ఆసక్తిదాయకమైన 'నెల్లూరు కథను' బంగోరె చెప్పారు. ఆకథకు చారిత్రకాధారాలు లేకపోయినా, ఆనాటి నెల్లూరి వర్ణన, వ్యాపారాలు కొంతవరకు అందుతున్నాయి. ఈస్టిండియా కంపెనీ కాలంలో ఒక జిల్లా కలెక్టరు పరిపాలన, అతడు నెల్లూరికి చేసిన ఉపకారాలను 'వర్తమాన తరంగిణి' పత్రికలోని ఒక జాబు, వెలుగులోకి రాలేక పోయిన ఒక శాసనం ఆధారంగా పి. గోపాలకృష్ణ వివరించారు. ఈశతాబ్దిలో నెల్లూరి సీమ సాహిత్య సాంస్కృతిక విలసనాగ్ని వికసనాన్ని గూర్చి కె. వి. రమణారెడ్డి విమర్శనాత్మకంగా పరిశోధించారు.

సాహిత్యానికి సంబంధించి సంపూర్ణ పరిశోధనకు ఇందులో తావులేకపోయింది. కొద్ది వ్యాసాలే ప్రచురించగల్గాము. ఐతే అవి ప్రామాణిక స్థాయిలో వుండడంవల్ల ఆకొరత కొంతవరకు తీరిందనవచ్చు. వేదం వారి ప్రతాపరుద్రీయ నాటకానికి ఆధారభూతమైన మెకంజీకైఫియతును ఎన్. ఎస్. కృష్ణమూర్తి అందించారు. పుస్తక ప్రచురణారంగంలో నెల్లూరికి ఎనలేని ఖ్యాతి సంతరించిన వావిళ్ళవారి సారస్వత సేవనుగూర్చి మరుపూరు కోదండ రామరెడ్డి విశదీకరించారు. నాటికి నేటికి అమూల్య సారస్వత పత్రికగా నిల్చిపోయిన 'అముద్రిత గ్రంథ చింతామణి'నిగూర్చి, దానిసంపాదకుడు పూండ్ల రామకృష్ణయ్య సాహిత్యసేవనుగురించి డాక్టరు కాళిదాసు పురుషోత్తం విపులీకరించారు. ఆంధ్ర భాషకు కట్టిన గుడులు — నెల్లూరు మడులు, నానుడులను సోదాహరణంగా, సశాస్త్రీయంగా తెలియజేశారు బండి నాగరాజు.

నెల్లూరును పట్టి పీడించిన కరువు కాటకాలను, సామాన్య ప్రజల బ్రతుకులమీద వాటి ప్రభావాన్నిగూర్చి ఎం. అద్విరెడ్డి ఎంతో విపులంగా చెప్పారు. నాటి, నేటి నెల్లూరు వ్యవసాయాన్ని గూర్చి డి.వి.ఎస్. రాఘవేంద్రరావు, పి. వెంకటరావు వ్రాసిన వ్యాసం పరిశోధనా పరిధిలోకి రాకపోయినా, ఈనాటి వ్యావసాయిక స్థితిగతులను, ప్రగతిని ప్రతిబింబిస్తుంది. అట్లాగేజిల్లాలో పారిశ్రామికావకాశాలను వివరిస్తూ పి. ఓబులరెడ్డి లఘువ్యాసం వ్రాశారు. అది పరిశోధన కాకపోయినా, పారిశ్రామికంగా నెల్లూరికివున్న వనరులను తెలియజేస్తుంది.

జిల్లాలోని చారిత్రక ప్రదేశాలు, శిల్ప సంపదను గూర్చి ఇంగువ కార్తికేయశర్మ వ్రాస్తూ, ఇంకా అనేక ప్రాంతాలలో పరిశోధనలు జరగాల్సి వుందని, అనేక చారిత్రక సత్యాలను గవేషించాల్సి వుందని అన్నారు. ఆయన అన్నది పురాతన చరిత్ర విషయమే అయినా, ఆ సూచన జిల్లా చరిత్ర కూలంకష పరిశోధనకూ అన్వయిస్తుంది.

ఏమైనా, ఇదొక తొలిప్రయత్నం. దీని బాగోగులు నిర్ణయించవలసింది పాఠకులు. వారికి ఉగాది శుభాకాంక్షలు తెలియజేస్తూ, ఈ ప్రత్యేక సంచికను సమర్పించుకొంటున్నాము.





## మా ఆదర్శ పాఠకుడు

### శ్రీ దేవాభక్తుని కోటీశ్వరరావు, వేములపల్లి, కృష్ణాజిల్లా

ప్రస్తుతనివాసము: వడ్లమూడి, గుంటూరుజిలా

వీరు 26-8-43 నుండి 'జమీన్ రైతు' చందాదారు. ఇప్పటివరకు, అనగా ఈ 35 ఏండ్లుగా, వీరికి చందాకొరకు కనీసం ఒక కార్డు వ్రాయవలసిన అవసరంకూడా కలుగలేదు. చందా సంవత్సర ప్రారంభంలో నే తనంతతానుగా పంపివేస్తారు. మాకు ఎంతహాయి! పత్రికకు ఎంత సహకారం! శ్రీ కోటీశ్వరరావుగారికి సర్వేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యోన్నతులు ప్రసాదించాలని ఈ ఉగాది సందర్భంలో ప్రార్థిస్తున్నాము. — మేనేజరు జమీన్ రైతు.

# పింగళ పంచాంగం

శ్రీ నిమ్మగడ్డ వెంకటేశ్వరశాస్త్రి

## పింగళ లక్షణం

న్యాయాధిక్యం - అన్యాయాల్పం - శుభములు ఎక్కువ - అశుభములు తక్కువ - సకాలవృష్టి కనుకూలవర్షం — సకలపంటలు సమృద్ధి - ధాన్యము లన్నియూ దండి- ధరలు హెచ్చుతగ్గు సమానం- రాజకీయ కల్లలు సర్దుబాటు - పరేంగితపాలన- స్వదేశీయ, విదేశీయ అన్యోన్య సహకారము- పరిశ్రమ, వాణిజ్య విహారము- వివిధవిధ నవనాగరిక పరికరములు ఉత్పత్తి సర్వత్రా వ్యాప్తము- సర్వులు, సుఖ, సుభిక్ష ప్రశాంతి దాయకము- ఎండలు తీవ్రం-అగ్నిభీతి-ఇదీ పింగళ స్థూలరూపం.

## సముదాయ సూక్ష్మరూపం

ఈ పింగళ సంవత్సరమునకు, అగ్రస్థానాధిపత్యం రవి, ప్రధానామాత్యాధిపత్యం బుధుడు. రవి మండల గ్రహం. ప్రభావ, శక్తి, సాత్విక తత్వం బుధుడు, తారాగ్రహం. ప్రజ్ఞ, విజ్ఞాన, రాజసతత్వం. ఈ ఇరువురు సమత్వ మిత్రత్వ సమాన ఏకత్రా సంచారంవలన దేశీయ సకల సమస్యలు- సమగ్ర ఉన్నత పరస్పర, సహచర సుముఖప్రియభాషిత- నీతిమార్గ- న్యాయాన్యాయ విచారణ, పరేంగిత జ్ఞానము- యుక్తాయుక్త విచక్షణ- యుక్తప్రయుక్త- హుందాతన- సాధకబాధక వివరణ- ధర్మప్రవర్తన-సదాచారము, ఆధ్యాత్మిక, ఆధిదైవిక - ఆధిభౌతిక - కర్తవ్య నిర్వహణ, శక్తి సామర్థ్యము- ఇదీ సూక్ష్మరూపం.

## కేంద్రపాలన

జగల్లగ్నేశ శుక్రతులాలగ్నాత్ షష్ఠ ఉపచయ స్థానమున మీనరాశి ఉచ్ఛ స్థితి. సప్తమకేంద్ర మేషరాశియందు రవి ఉచ్ఛ. బుధయుత పంచమ కోణ లక్ష్మీస్థానమున చంద్ర మంగళయోగము. ఆరూఢలగ్నము సింహాంతదీశ రవి దీప్తావస్థ. ఇందు లగ్నం కన్య ఉచ్ఛ శుక్రవీక్షణ. ఆరూఢ లగ్నాత్, ఇందు లగ్నాత్ రాజ్యేశులు, బుధ శుక్రులు. శుభత్వస్థితి. తులాలగ్నాత్ రాజ్యస్థానమున శని, లగ్నం రాహుగ్రస్తం, రవి బుధులు కేతుగ్రస్తం ఇట్లు శుభాధిపత్యం అధికం, పాపాధిపత్యం అల్పం గాన కేంద్రపాలిత మంచి మార్పు వచ్చి భయ, భక్తి, శ్రద్ధలతో పాలించవలసియున్నది. సహచర సభ్యులతో సంప్రదించి పాలనాయంత్రాంగం తొట్రుపాటు లేకుండా సాఫీగా నడుపవలసిన ధీశక్తి సమానత్వము సరసభాషణము సమగ్రత కలిగి కేంద్రాంతరాష్ట్రీయులు కేంద్రము వివాదరహితులై చక్కని సత్పరిపాలనకు హేతువై యున్నది.

## సంయుక్త ఆంధ్రపాలన

లగ్నేశ కుజ అష్టమ, పంచమకోణ, నీచ బుధ, షష్ఠశుక్ర కేతుగ్రస్త వ్యయరాహు, లగ్న గురువీక్షణ. ఇందు లగ్నం లగ్నపాపత్వ ఆరూఢ లగ్నం శుభత్వ. త్రివిధలగ్నాత్ రాజ్యస్థానములు పాపత్వమే. వృశ్చికలగ్నము శుభ గురువీక్షణ, ఇట్లు పాపాధిపత్యం అధికం, శుభాధిపత్యం తక్కువ. ఆంధ్రపాలనములో చిక్కులు ఇక్కట్లు సూచితము కాగలవు. సభ్యులందరు అంతః కలహాలై నిరర్థకులు కాగలరు. పాలనాముఖ్యేశ కృత్రిమ కుతంత్రులై ఇబ్బందికి గురికాగలడు. 77 ఏప్రెల్ 13 తేది పైగా ఆంధ్రపాలనములో దైవికంగా మార్పువచ్చి సభ్యులకు ఇతోధికమైన మార్గాన్వేషణము కలిగి పక్షపాతములేకుండా సంయుక్త ఆంధ్రపాలన పాలించవలసిన లగ్న గురుదృష్టిచే చెప్పవలసియున్నది.

## పర్యవసానం

ఈ పింగళ సంవత్సరం ఆమూలాగ్రముగ పరిశీలన చేయగా, నిరయన, చాంద్రవర్షేశ, రవి—సాయన— సౌరవర్షేశ బుధ యిరువురు న్యాయ పద్ధతిగల గ్రహములు. అగ్రస్థానాధిపత్యం, ప్రధానామాత్యాధిపత్యంవచ్చినందున యావద్దేశమంతటా కుట్ర, కుతంత్ర, కృత్రిమ ప్రకోపాదులు లేకుండా, న్యాయపద్ధతులు సమగ్రముగా సరిదిద్దుతూ ఆదర్శవంతమైన ఉత్తమోత్తమ సుహేతువుకు ఆస్పదమైయున్నది.

## జగల్లగ్న వర్షలగ్న విచారణ

జగల్లగ్నాత్ కర్కాటక జలరాశి దశమం శని. ఇది ప్రబల దోషము వర్షలగ్నం, వృశ్చికం, అగ్నితత్వ జలరాశి, కర్కాటక జలరాశి, నవమం ప్రబలారిష్టం—యీద్వయము వ్యగ్రదోషములుగాన స్వదేశ విదేశములయందు జలప్రళయ, భూకంపం సూచించినమా, రవి, బుధ, గురు త్రయమూ సంరక్షించవలసిన సుబలము యున్నది. సమరమునకు అంత ప్రాధాన్యత లేదు. మంచి చెడ్డలలో మంచి జాస్తి, చెడ్డ స్వల్పం. సర్వత్రా శ్రేయమునకే ప్రాధాన్యత యున్నది.

## నవనాయకులు

రాజు రవి, మంత్రి బుధుడు, సస్యాధిపతి శని, అర్ఘాధిపతి కుజుడు, సేనాధిపతి బుధుడు, మేఘాధిపతి బుధుడు. ధాన్యాధిపతి గురు, రసాధిపతి చంద్రుడు, నీరసాధిపతి శని.

## వర్షవిచారణ

1977 మే 24 తేదీ ప్రాంతమున తొలకరివర్షం; జులై 6 తేదీ ప్రాంతమున స్వాభావికవర్షం, 20 తేది ప్రాంతమున మందివర్షం; ఆగస్టు 16 తేదీ ప్రాంతమున వర్షం, 30 తేదీప్రాంతమున సువృష్టి; సెప్టెంబరు 13 తేదీప్రాంతమున మందివర్షం, చిత్ర వృష్టి; అక్టోబరు 10 తేదీప్రాంతమున వర్షాధికం.

వర్ష విచారణలో ఋతుకాల ప్రథమభాగము లోనే వర్షారంభమై కృషికనుకూలం, సకాలంలో పైర్లు వేసుకునేటట్లుగా వర్షం కురియవలసియున్నది. జీమూత వర్షం అనగా భూమికి తగినంతవర్షం కురియును.

## పంటలు

పంటలు ప్రాముఖ్యముగా విచారణచేయగా మెట్ట మాగాణి పైర్లు సమానముగా ఫలించే సన్నివేశములు సరసముగాయున్నవి. సకలవిధ ధాన్యములు బుధ, గురు బలీయముచే దండిగా యుండవలసిన మంచిహేతువైయున్నది. పైర్లు పెరిగేదానికి

# ది రాపూరు సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు లిమిటెడ్ నెం. ఎల్. ఎఫ్. 4

## రాపూరు – నెల్లూరుజిల్లా.

**ప్రారంభము 11-7-1964 "ఏ" క్లాసు సభ్యులు 3700**

**వాటా ధనము: రూ. 5,70,000**

**సభ్యులకు బట్వాడాచేసిన ఋణములు: 67,00,000**

ఈ బ్యాంకులో బావులు త్రవ్వుకొనుటకు, పంపుసెట్లు అమర్చుకొనుటకు; పాతబావుల మరామత్తులకు - ట్రాక్టర్లకు, నిమ్మతోటలు పెంచుకొనుటకు, గొర్రెల పెంపకమునకు విరివిగా ఋణములు యిచ్చుచున్నాము. రాపూరు తాలూకా మెట్టప్రాంత ముగావున్న రైతుసోదరలు ఈ అవకాశమునుపయోగించుకొని, బావులుత్రవ్వి – పంపుసెట్లు అమర్చి, నిమ్మతోటలుపెంచి లాభ పడుదురని ఆశించుచున్నాము. సన్నకారు రైతుల అభివృద్ధిసంస్థద్వారా 25%—33 1/3% సబ్సిడీ రేటుతో చిన్నకారు, సన్నకారు రైతులకు విరివిగా ఋణములు యివ్వగలుగుచున్నాము. మరియు జిల్లాకలెక్టరుగారి కృషిఫలితముగా సమష్టి సహకార వ్యవసాయక్షేత్రములకు పైతెల్పిన అన్నిపనులకు మా బ్యాంకునుండి విరివిగా రుణములు మంజూరు చేయగలందులకు సంతసించుచున్నాము

ఈ బ్యాంకులో ఆకర్షణీయమగు వడ్డీ $8\frac{1}{4}$% రేటుతో డిపాజిట్లను సేకరించుచున్నాము. మరియు మార్చి 31 తేది లోపుగా వాయిదాలు చెల్లించిన సభ్యులకు 2% రిబేటు యిచ్చుచున్నాము. కాబట్టి రైతుసోదరులు మాతో సహకరించి వారి వ్యవసాయాభివృద్ధికి పై అవకాశములను వుపయోగించుకొనవలసిందిగా కోరుచున్నాము.

— ఇట్లు —

**చిలకా రాఘవరెడ్డి** B. A, H. D. C.
సెక్రటరి.

**పాపకన్ను రాజశేఖర రెడ్డి**
ఛైర్మన్.

శనిదోషమున్ననూ వెంటనే సమింది ఆరోగ్యముగా పైర్లు పెరిగి అధికపంట పండును. ధాన్యములు పుష్కలముగా యుండగలవు. బుధ, గురు బలము బాగాయున్నది. 16 వీసములలో 11 వీసములు పంట అధికముగా యుండగలదు.

## ధరలు

ధరలకు అధిపతి అంగారకుడు అగుటవలన ధరలు దారుణముగా, అధికముగా యుండును.

## యావద్దేశాల అలజడి

శని కటక జలరాశి శత్రుక్షేత్రవర్తియై దుఃఖావస్థను పొందియున్నాడుగాన, 77 ఆగస్టువరకు ప్రపంచమంతటనూ అన్నివిధాల అలజడికి హేతువుకాగలదు. తదుపరి సింహరాశి ప్రవేశను పొందును. తదాది సరససరళికి రాగలదు.

## గురుచార ప్రత్యేక గమనార్హం

త్రిలోకేశదేవగురు, మేషాది ద్వాదశరాసులలో 12 రాసులు; ఒకరాశియందు ఒక సంవత్సరకాల సంచారము చేయును. ఇప్పుడు 77 ఫిబ్రవరి 4 వ వారం మొదలు జులై 3 వారం వరకు 5 మాసములు తక్కువ సంచారము. యీ లుప్త వ్యవధి ప్రత్యేకంగా గమనించతగిన ప్రధాన కారణము.

## రవ్యాది గ్రహాధిపత్యం

రాహుకేతువులుకాక, రవ్యాదిసప్త గ్రహాధిపత్యమందు 5 శుభాధిపత్యం, 4 పాపాధిపత్యం; మంచి 5 పాళ్ళు, చెడ్డ 4 పాళ్ళు.

## నాయక ఫలం

### రాజు రవి

మేఘములు సమవృష్టి. ప్రజాపాలక భయ భక్తి శ్రద్ధ.

### మంత్రి బుధుడు

ప్రజలు, పాలకులు యుక్తిప్రయుక్తులుగుదురు.

### సేనాధిపతి బుధుడు

తటస్థ వర్షం, పూర్ణపంట.

### సస్యాధిపతి శని

నల్లధాన్యములు నల్లనేలయందు బాగా ఫలించును.

### ధాన్యాధిపతి గురువు

సర్వదేశమునందు మంచి వర్షము కురిసి సర్వ సస్య సమృద్ధిగా యుండును; అవలు బాగా పాలు యిచ్చును.

### అర్ఘాధిపతి కుజుడు

గాలితోకూడిన వర్షం, ధాన్యసమృద్ధి, జనక్షేమం.

### మేఘాధిపతి బుధుడు

మేఘములు, ఉరుములతోను, వడగళ్ళతోను, పిడుగులతోను, గాలితోనుచేరి వర్షించును. మధ్య దేశమందు బాగా వర్షించును.

### రసాధిపతి చంద్రుడు

ధాన్యాదులు, వస్త్రాలు, ధరలు హెచ్చు తగ్గులుగా యుండును.

### నీరసాధిపతి శని

బంగారు, వెండి మొదలుగాగల పంచలోహాల వెలలు తగ్గును.

## మాసవారి కాలమానం

### చైత్రం

శుక్రోదయం వర్షయోగం, ఉష్ణాధిక్యత, ధాన్యం ధరలు సమము

### వైశాఖం

కుజచలనం వర్షహేతువు. ఎండలు గాడ్పులు అగ్నిబాధలు

### జ్యేష్ఠం

గురు అస్తమయం. ఉష్ణప్రకోపవర్షం, గాలి దుమారం, అన్నిటికీ ధరలు హెచ్చు.

### అధిక ఆషాఢం

కర్షకానుకూలమైన వర్షముకురిసి పైరులు వేసుకొనుటకు అనుకూలత కలుగును. ధాన్యం ధరలు మందం.

### నిజాషాఢం

కుజచలనం శన్యస్తమయం రవి, బుధ, శనులు జలనాడీ సంచారం, వర్షాధికం, పైరులన్నియూ చక్కగా యుండగలవు; ధాన్యం ధరలు హెచ్చు.

### శ్రావణం

శన్యుదయం శని చలనం గురుచంద్ర ఏకనాడీ సంచారము వర్షయోగమేగాన జీమూతవర్షం కురిసి కృష్ణా గోదావరీ మొదలుగాగల నదులన్నియూ బాగుగా ప్రవహించును; ధాన్యంధరలు కొద్దిగా పెరుగును.

### భాద్రపదం

మాసాదియందు అనావృష్టియోగం మాసాంతమున సింహరాశియందు శని, శుక్ర, చంద్ర సంబంధమువలన, కావేరీ గోదావరి మధ్య దేశమందు విపరీత వర్షం కలుగును. ధాన్యం ధరలు నిలకడ.

### ఆశ్వయుజం

మాసాదియందు కుజచలనం, శుక్రుడు సూర్య నాడీ సంచారం. మాసాదిలో గాలిలేని వర్షం, మాసాంతమందు రవి, బుధులు వాయునాడీ సంచారమువలన గాలితోకూడిన వర్షం, ధాన్యం ధరలు తగ్గుదల.

### కార్తీకం

వర్షయోగంలేదు. కొన్నిచోట్ల కొద్దిపాటి వర్షం కురిసి పైర్లకు నష్టము కలుగును. వర్షాభావము కూడా యుండును. ధాన్యం ధరలు హెచ్చు.

### మార్గశిరం

మేఘావృతమై యుండినను, అల్ప వర్ష సూచితమే. ధరలు సరసం. అన్ని వస్తువులు సులభముగా లభ్యమగును.

### పుష్యం

రవి బుధ, శుక్రులు, ఏకనాడీసంచారము వలన అప్పటప్పట వర్షం కురియు సూచనలు కలవు. కర్షకులు జాగరూకులై యుండవలెను. ధరలు పెరుగు సూచనలున్నవి.

### మాఘం

కుజచలనం శుక్రోదయం. రవి, బుధ, శుక్రులు, జలనాడీసంచారం. ఈ త్రయం విపరీత వర్ష యోగాధికమేకాని, ఆకాశం మేఘావృతమై వర్షభీతి యున్ననూ, అల్పవర్షంతో తేలిపోవును. ధరలు నిలకడ

### ఫాల్గుణం

కుజచలనం. చాలా అనావృష్టియోగము, వర్షములు లేవనిచెప్పవలెను. ధాన్యంధరలు సమము.

## దేశ, కాల, పాత్రత

జగల్లగ్నం, రాహుగ్రస్తం, వర్షలగ్నం దేవగురుదృష్టి యీ ద్వయస్థితి ఉదాత్తాగ్రాధికము గాన దేశ, కాల, పాత్రత విచ్చలవిడి స్వార్థ అహం, మమత, వ్యాఘ్రప్రవృత్తులేక, సింహావలోక న్యాయపద్ధతినే యుండవలసి యున్నది.

## మేష సంక్రాంతి

13-4-77 తేది సాయంత్రం 6-48 గంటలకు రవి మేష ప్రవేశం-మంచివర్షం, సౌభాగ్యం.

### ఆర్ద్రా ప్రవేశం

21-6-77 తేది రాత్రి 3-55 గంటలకు ఆర్ద్రా ప్రవేశం– మందివర్షం, సస్యాభివృద్ధి, సుఖ సౌఖ్యం.

### మకర సంక్రాంతి

13-1-78 తేది తెల్లవారుజామున 4-58 గంటలకు రవి మకర ప్రవేశం. సంక్రాంతి పురుష లక్షణం: మూడు శిరస్సులు, రెండుముఖములు, నాలుగునోళ్ళు, మూడునేత్రములు, చాటచెవులు, పొడవుముక్కు, రక్తదంతములు, ఎనిమిదిచేతులు రెండుపాదములు, నల్లని శరీరము, నూరు యోజనముల ఎత్తు, పన్నెండుయోజనములుపొడవు, వంది వాహనము. సంక్రాంతి పురుషుని విచారణచేయగా శుభాశుభములు మిశ్రమముగా యున్నది.

### సూర్య, చంద్ర గ్రహణములు

18-4-1977 తేది చైత్ర బహుళ అమావాస్య సోమవారము సాయంత్రం 5-1 గంటకు సూర్య గ్రహణము పట్టును. రాత్రి 6-45 గంటలకు విడుచును. కేతుగ్రస్త సూర్యోపరాగము, గ్రస్తాస్తమయ గ్రహణము.

24-3-1978 తేది ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ శుక్ర వారము, రాత్రి 8-02 గంటలకు చంద్రగ్రహణము పట్టును. 11-42 గంటలకు విడుచును. రాహుగ్రస్త సోమోపరాగము.

### నిజ కర్తరీ

11-5-77 తేది మొదలు 28-5-77 తేది వరకు నిజకర్తరీ.

### మౌఢ్యములు

2-4-77 తేది చైత్ర శుద్ధ త్రయోదశి శని వారం మొదలు, 6-4-77 తేది బహుళ విదియ బుధవారం వరకు పశ్చాదస్త శుక్రమౌఢ్యములు.

22-5-1977 తేది జ్యేష్ఠశుద్ధ దవిితి ఆదివారం మొదలు 18-6-77 తేది అధిక అషాఢ శుద్ధ శని వారం వరకు ప్రాగస్త గురుమౌఢ్యము

24-12-1977 తేది మార్గశిర శుద్ధ చతుర్దశి శనివారం మొదలు, 16-2-1978 తేది మాఘ శుద్ధ నవమి శుక్రవారం వరకు ప్రాగస్త శుక్ర మౌఢ్యము.

### పుష్కరణి

18-7-1977 తేది నిజాషాఢ శుద్ధ విదియ సోమవారం సార్ధ త్రికోటితీర్థ రాజసహిత సరస్వతీ పుష్కరారంభము, గురు మిథున ప్రవేశం.

### అధిక మాసము

అధిక ఆషాఢము.

### చాంద్ర వర్షము

20-3-1977 తేది నిరయన సంవత్సరాది.

### సౌర వర్షము

13-4-1977 తేది సాయన సంవత్సరాది.



# తిక్కన-జక్కన రచనలలోని చారిత్రకాంశాలు

డాక్టర్ నేలటూరు వెంకటరమణయ్య ఎం. ఎ. పిహెచ్ డి.

## తిరుకాళత్తి దేవుడు

"శైశవలీలనాడు పటు
శౌర్యధురంధర బాహుడైన పృ
థ్వీశ నరేంద్రు మస్తకము నే
డ్తెర గందుక కేళి సల్పరే!"

తిక్కన: ని. ఉ. రా. I 32/2.

పృథ్వీశుడు వెలనాటి ప్రభువు. ఇతని శాసనాలు క్రీ. శ. 1186 మొదలు 1206 వరకు కనబడుతున్నవి. అవి ఇతనికి పూర్వపు రాజుల శాసనాల వలె, ఈ వంశము వారికి రాజధానియైన ధనదుప్రోలు ప్రాంతమునగాక విశాఖపట్టణ మండలమునను ఆ ప్రాంతములను గనబడుటచేత పృథ్వీశ్వర దేవ మహారాజుల కాలమునగాని, అతనికి పూర్వుల కాలమునగాని, పరరాజాక్రమణము వల్ల వీరికి వెలనాటి రాజ్యము దక్షిణమున సంపూర్తిగా గాకపోయినను, కొంతవరకైన పోయియుండునని, అందువల్లనే ఈ వంశమువారి శాసనాలు గోదావరినదికెగువ దేశమున గనపడ దము తటస్థించెననిన్నీ, ఊహింపవలసి ఉంటుంది. (మల్లంపల్లి సోమశేఖరశర్మ–భారతి ప్రభవ ఆశ్వ) పృథ్వీశ్వరుడు తిక్కరాజుచే క్రీ. శ. 1206 నకు పిమ్మట వధింపబడి యుండవలయును. అప్పటికాతడు (తిక్కరాజు) శైశవదశయందుండెను.

లకుమయ గురుములారికి నెత్తివచ్చిన
గొనడె యాహవమున ఘోటకముల
దర్పదుర్దయులగు దాయాదనృపతుల
ననిలోన బలుపడే యాగ్రహమున
శంభురాజాది ప్రశస్తారి మండలి
కము జెప్ప యేలడే కంచిపురముఁ
జేదిమండలము గాసిగజేసి కాళన
పతి నియ్యకొలుపడే పలచమునకు

ఇందు గురుమలారికి నెత్తివచ్చిన 'లకుమయ' యెవ్వరైనదియు తెలియదు. దాయాద నృపతులు విక్రమ సింహపుర రాజ్యమునకై పోరుసల్పిరి. వీరే మనుమసిద్ధి కాలమున నాతని రాజ్యపదచ్యుతిం జేసిరి. శంభురాజు సాంబువరాయలు, కాడవపతి కొప్పరంజింగడు; ఈతడు అళగియ నామధారి యగు పెదకొప్పెరుంజింగడు. ఏలన తిక్కరాజు క్రీ. శ. 1233–4 సంవత్సరమప్పటికే కంచిని

రాయగండ గోపాలునరాతిభయద
రాయ పెండార బిరుదాభిరామునుభయ
రాయ గండాంకు ఖండియరాయుదిక్క
ధరణి విభుఁబోల రాజుల కటిపింగాదె!

తిక్కన ని. ఉ. రా: I 33.

కమలాప్త ప్రతిమానమూర్తియగు నా
కర్ణాట సోమేశు దు
ర్దమదోర్గర్వము రూపుమాపి నిజ ద
ర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిం జోళుని భూమిపై నిలిపి చో
ళ స్థాపనాచార్య నా
మము దక్కంగొని తిక్క భూవిభుడు సా
మర్థ్యంబు చెల్లింపడే.

తిక్కన: ని. ఉ. రా: I 34.

స్వాధీనపరచుకొని, చోళరాజు (మూడవ రాజరాజు)ను రాజ్యమునందు నిలిపినట్లు తెలియుచున్నది. తిరువెండీపుర శాసనము క్రీ.శ. 1232-3 లో అళగియ కొప్పెరుంజింగని పరాజితునిజేసి, చోళరాజును హొయసళరాజు రెండవ వీర నరసింహుడు చెరనుండి విముక్తునిచేసి రాజ్యమునందు నిలిపెనని తెల్పుచున్నది. కావున తిక్కరాజుచే పరాజయము నందినవాడు మొదటి కొప్పెరుంజింగడనుట స్పష్టము. ఇక కర్ణాట సోమేశ్వరుని గర్వము రూపుమాపి చోళుని భూమిపై నిల్పెననుటకు అర్థమేమి? రెండవ నరసింహుడు క్రీ. శ. 1233 లో కాలమునొందెను. వీరసోమేశ్వరుడా సంవత్సరముననే కర్ణాటరాజ్యమున కభిషిక్తుడై యుండవలయును. పట్టాభిషిక్తుడైన వెనుక.

మూడవ రాజరాజునకు విరోధముగ వర్తించి యుండవలయును. తిక్కన్న తిక్కరాజు కర్ణాట సోమేశ్వరుని దర్పమడచి, చోళుని భూమిపైనిలుపుటకు గతమెయ్యది? సోమేశ్వరుడు చోళసామంతులగలసి రాజరాజుపై నడ్డుదిరిగెననుటకు గొంతసాక్ష్యమున్నది. తిక్కన్న "కర్ణాట సోమేశు సర్వము దోర్గర్వము రూపుమాపి" చోళుని భూమిపై నిలిపె అనగా, కేతన "ద్రవిడ మాండలికు లందఱ దక్కగెలిచి చోడని నిజరాజ్య పీఠమున నిలిపె" నన్నారు. కావున కర్ణాటసోమేశుడు ద్రవిడ మండలికుడు. చోడుని నిజపదచ్యుతుని జేయసమకొనన తిక్కరాజు వారిని మర్దించి చోడని నిజరాజ పీఠమున నిలిపెనని తలచుట సమంజసముగనున్నది. ద్రవిడమండలికులెవ్వరనగా—

### శంభురాజు

"శంభురాజాది ప్రశస్తారి మండలికముజెర్చి
యేలదే కంచిపురము."

తిక్కన: ని. ఉ. రా. I 38.

### కాడవరాజు

"చేడిమండలముగాసిగజేసి కాళవపతిరియ్యు
కొలువడె వలచమునకు"

తిక్కన: ని. ఉ. రా. I 38.

"కాళవ విభు (గర్ణాట విభు) నహంకారంబు
మాన్పించె"

దశకుమారచరిత్ర. I 16.

### పాండ్యరాజు

"పాండ్యునిచేత గప్పంబుగొనియె"

ద. కు. చ. I 16.

జటావర్మ సుందరపాండ్యుడు వీరగండగోపాలుని కాలమున నెల్లూరవీరాభిషేకమొనర్చుకొన్నందుకు కారణమిది. శంభురాజు, కాడవరాజు, పాండ్యరాజు, కర్ణాటక సోమేశ్వరుడు వీరందరు కలసి చోళరాజు కెదురుదిరుగ నాంధ్రచోళుడగు తిక్కరాజు చోళనికి బాసటయై నిలచి యాతని నిజరాజ్యమున నిలిపెను. ఈ మార్పులవల్ల స్వస్వాతంత్ర్య సంస్థాపన యందు నిరంతర దీక్షబూనియున్న కాడవరాజు నెల్లూరాంధ్ర చోళరాజునకు 'పలచము' నిచ్చుకొనవలసి వచ్చెను. సాంబవరాయునికిగూడ నదియే యవస్థ సంప్రాప్తమాయెను.

కర్ణాట సోమేశుడు సాంబువరాయాదులను గూడెననుటకు సాంబువరాయని రాజ్యములోని, చంపాపురమున తిక్కరాజాతనితో యుద్ధము సేయుట గొంతవఱకు సాక్ష్యమిచ్చుచున్నది.

అజిగియశేయ కెప్పెరుం జింగడు స్వతంత్రేచ్ఛను త్యజింపలేదు. తిక్కరాజు కుమారుడగు మనుమసిద్ధితో అతడు మరల పోరినట్లున్నది. నిర్వచనోత్తర రామాయణములోని ఈ క్రింది పద్య మీవిషయమును సూచించుచున్నది.

ద్రవిడోర్వీపతి గర్వముం దునిమి,
శౌర్యంబొప్ప గర్ణాట ద
ర్ప విఘాతంబునొనర్చి, వైరిమనుజేంద్ర
శ్రేణికిం గొంగనా
నవనిం బేర్కొనియున్న యట్టి,
విజయస్వామ్యాధీశ్వరుం, గాసిగా
నవిచెం జోళన మన్మసిద్ధియుని
ప్రాయేటన్ బ్రగాఢోద్ధతిన్॥

తిక్కన: ని. ఉ. రా. I 39.

అజిగియశీయుకోని 'శీయు' 'జీయ' శాసనాంతరముల యందు పరిణామమంది యీ పైపద్యమున విజయ శబ్దముగ మారినది. పటిపూరు అనునది యొకటి కుంభకోణ ప్రాంతము నందున్నది. కొప్పెరుంజింగని రాజ్యమున్నంతవఱకు వ్యాపించియుండెననుటకాధారములు కలవు. మనుమసిద్ధి విజయస్వామ్యాధీశ్వరునోడించిన ప్రాయేట 'ఈపతియూరగ' నుండునేమో!

క్రి. శ. 1240 సంవత్సర చోళరాజ్యమున నంతఃకలహములు మరలనారంభమాయెను. రాజేంద్రచోళుడనువాడు మూడవ రాజరాజుపై తిరుగబడి యుద్ధముసేయదొడగెను. ఈ యుద్ధమున వీర సోమేశ్వరుడు మొదట మూడవ రాజరాజునకు బాసటయై నిలచి, పిమ్మట నాతని మరణానంతరముననేమో రాజేంద్రునకనుకూలుడై యాతని పట్టాభిషేకమునకు సాయమొనర్చెను. ఈ యుద్ధమున కొప్పెరుంజింగడే పక్షమున యుద్ధముజేసెనో తెలియదు. క్రీ. శ. 1243 నకు పూర్వము అజిగియశీయ కొప్పెరుంజింగడు మృతినందియుండవలయును. ఏలన అతని కుమారుడు మహారాజ



డాక్టరు వెంకటరమణయ్య

కొప్పెరుంజింగడా సంవత్సరమున రాజ్యాభిషిక్తుడాయెను ఇట్లితడు స్వతంత్రుండై రాజ్యాభిషేకమునొనర్చుకొనగలుగుటజూచ. చోళరాజ్యములో సంభమునందు సంభవ రాజ్య విప్లవము కాడవ మహీపతి యుద్యమమునకు గడు సహాయకారియైనట్లు దోచెడిని.

ఈ స్వాతంత్ర్యము నాతడు చిరకాలమనుభవింపలేదు. అచిరకాలముననే కాకతీయ ప్రతాపవాహిని కంచివరకు ప్రవహించి చోళరాజ్యమునుండి వేర్పడి, స్వతంత్రులైన రాజులను ముంచివేసినది. నెల్లూరులోని యాంధ్రచోళ రాజ్యమున నంతఃకలహములు బొడసూపెను. మనుమసిద్ధి దాయాదులచే నెల్లూరు నుండి దరుమగొట్టబడగా తిక్కన సోమయాజి కాకతీయగణపతిని దర్శించి, ఆ సార్వభౌముని సహాయమును బడసి, తనస్వామి శత్రువులను బారదోలి, యాతనిమరల సింహాసనాసీనుని జేసెనని యొకగాథకలదు. దీని నాశ్రయించుకొని, పండితులు మనుమసిద్ధికి సాయముజేయనరుదెంచిన గణపతి యట్లేకంచికిపోయి దానిని క్రీ. శ. 1249 న స్వాధీనపరచుకొనెనని యభిప్రాయ పడుచున్నారు. ఇది విచారణీయము.

క్రి. శ. 1251 (?) లోనో తత్పూర్వమో గణపతి కంచిని స్వాధీనపరచుకొన్నది నిజము. కాని మనుమసిద్ధి కొరకై నెల్లూరిని జయించి, యాతనికిచ్చి, యట్లే కంచికి పోయెననుట నిజముగాదు. ఏలన క్రి. శ. 1251 (?)లో నందలూరు లో వేయించిన దనశాసనములో మనుమసిద్ధి,తాను గణపతితోడి మైత్రి నాచరింప నిచ్చగించు చున్నాడనని చెప్పుకొనియున్నాడు. క్రీ. శ. 1251 (?)లో

మైత్రి గుదురకున్న తత్పూర్వమే అనగా 1249లో మైత్రి గుదిరియుండుట యసంభవముగదా? కావున గణపతిరాజ దక్షిణయాత్రకును, మనుమసిద్ధికిని నేలాటి సంబంధమున్నట్లు గాన్పించదు. క్రీ. శ. 1249 ముందే మనుమసిద్ధి దాయాదనృపులచేత నెల్లూరునుండి దరుమబడియుండవలయును. వీరికిని అమలూరుదగ్గిర తిక్కరాజుచే నోడింపబడిన దాయాదనృపతులకు నేదోసంబంధమున్నట్లున్నది. గణపతి తన శాసనములయందాంధ్ర చోడులను జయించినట్లు చెప్పుకొని యున్నాడు. వారు మన్మసిద్ధి దాయాదులేమో! గణపతిదేవునితో మనుమసిద్ధికి తుదకు సఖ్యముకుదిరినది. అందులకు నిర్వచనోత్తర రామాయణములోని యీ క్రిందిపద్యము సాక్షి.

"రంగదుదారకీర్తియగు
రక్కెస గంగను దెంజలంబుమ్మి
తంగమొనర్చి మన్మజన
పాలకు బిక్కటి నాదికొన్న రా
జ్యాంగము తెల్ల నిచ్చిత
యాశ్రిత వత్సల వృత్తి యేర్పడన్
గంగయ సాహిణింబదము
గైకొనజంచె జగత్ర మోన్నతిన్"

తిక్కన: ని. ఉ. రా. I 41.

క్రీ. శ. 1249–50లో గణపతికి రక్కెస దామోదర అనువారితో పోట్లాటగలిగెను. గణపతి యొక్క కాయస్థ సామంతుడు పోనుంగల్లు, మార్జవాడి సీమలపై ప్రభుత్వము సేయువాడు. గంగయ సాహిణి వీరిని జయించినట్లు చెప్పబడి యున్నది. పై పద్యమువల్ల గంగయసాహిణికి మనుమసిద్ధి సాయముచే రక్కెసగంగని నిర్జించుట తెల్లమగుచున్నది. కాకతిరాజుతో సఖ్యముగుదుర కున్న మనుమసిద్ధి యేల అతని సామంతునికి తోడై నిలచి యుద్ధము సేయును?

ఇక మహారాజసింహ కొప్పెరుంజింగని చరిత్ర వర్ణనకు మరలుదము. ఈతడుగూడ గణపతిచే నిర్జితుడాయెను అతని సామంతుడై కప్పము కట్టెను. ఈ వాక్యములెంత విరుద్ధముగ గాన్పించినను వాస్తవార్థమును సూచించుచున్నది.

మహారాజసింహ కొప్పెరుంజింగడు తన శాసనముల యందనేకములలో పాండ్య చోళ కర్ణాటాంధ్ర రాజులను జయించితినని చెప్పుకొనుట చేతను, జతనకుమారుడు ఉత్తరముననే నశించునట్లు తెలుంగువారిని వుత్తరమునకు వెడలగొట్టితిని అని ప్రగల్భములు పలుకుటచేతను, భ్రమపడి పరిశోధకులు ద్రాక్షారామములోని శాసనములను ఆంధ్రదేశముపై నీతని విజయసూచకములుగా గొనుచున్నారు. ఇది పొరబాటు; ఈ ద్రాక్షారామ శాసనములను బరిశీలించి చూచిన వాస్తవము తెలియగలదు.

'కాకతి...దారవింద్ద మధుకరాయ మానమాన సేన' అని మహారాజసింహుడు తన్నుగూర్చి చెప్పుకొన్నాడు. ఈ వాక్యములో శిథిలమైన భాగము ఇట్టుండిన నుండవచ్చు. "కాకతి గణపతి పాదారవింద్ద మధుకరాయ మాన మానసేన". మఱియు శాసనాంతమున "గణపతి మహారాజ స్యాజ్ఞాం ప్రవర్త యితావరాం సుచరితని" అని యునది. ఇందు మహారాజసింహుడు గణపతి నాశ్రయించిన సామంతుడనుట స్పష్టము.

## జటావర్మసుందర పాండ్యుడు

చంద్రవంశ భూషణుడు, మధురా మాధవుడు, కేరళ వంశచ్ఛేదకుడు, లంకను దోచుకొన్న రెండవ రాముడు చోళకుల ధరణీధర విదారణ పవి, కర్ణాటక రాజును తరుమగొట్టినవాడు. 'కాకతి నృపుడను' ఏనుగకు జ్వరమువంటివాడు. వీరగండ గోపాల (వన) దవానలుడు. కంచిప్రభువు, గణపతి యను లేడికి సింగమువంటివాడు. విక్రమసింహపురమున వీరాభిషేకమును జేసుకొన్నవాడు కర్ణాట సోముని కడనుండి శ్రీరంగమును లాగికొనెను. ఇంకొక శాసనము.

యుద్ధములో చేరరాజునుససైన్యముగ హతము చేసెను. చోళునికడ కప్పముగొనియెను. పొన్ని ప్రవహించెడు దేశమున స్వబాహుబలముచే హోయసళరాజును పరాజితుని గావించెను.

---

# ఉగాది ఉలుకు

"రసిక"

ఉగాది ఉగాదికి
ఉలికి ఉలికి పడుతుంది మనస్సు;
ఉగాది ఉగాదికి
కరిగి తరిగిపోతుంది ఆయుస్సు;
చదరంగపు బల్లలా
నలుపుతెలుపులు చెరిసగం పంచుకొన్న
అరనెరిసిన శిరస్సు;
అంతకంతకూ అంతరిస్తూన్న
యౌవన రోచిస్సు;
అడుగిడుతూంది
పిల్లిలా మెల్లిగా నడివయస్సు -

, , ,

మళ్ళీ మరో ఉగాది
మళ్ళీ, అదుగో, ఆ కోకిలమ్మ
కుహూ మంటున్నాది
ఆ కోకిలకూత
ఆమనికి సంకేతం.
ఇంకెక్కడి ఆమని?!
ఆమని వెళ్ళి
గ్రీష్మం వెళ్లి
ఇదుగో, నడుస్తున్నదిపుడు 'వర్ష'
పడుతున్నదిపుడు నెత్తిపై
కడగళ్ళ వడగళ్ళవాన
ఈ వాన నిలుస్తుందని
శరత్తు వెలుస్తుందని
ఆశలోపల వెలుగుతున్నా
అల్లదుగో
ఆ హేమంత శిశిరాలు
ముందున్న ముసళ్ళ పండుగలు
పాంచభౌతిక జీవన్నాటకానికి
పంచమ షష్ఠాంకాలు
వాటిని తలచుకుంటేచాలు
వణికిముడుచుకపోతున్నాయి చేతనాప్రపంచాలు

, , ,

అదుగో, అక్కడ,
అనూచానంగా
ఉగాది పంచాంగ శ్రవణం
విప్పిచెబుతున్నాడు విప్రుడు
వింటున్న శ్రోతలకు సంవత్సరఫలం
అడుగుతూంది అంతరాత్మ నన్ను
"ఇన్నేళ్ళ నీజీవితం సాధించినదేమిఫలం?
ఈ జీవితానికసలున్నదా ఒక నిర్దిష్టఫలం?"

, , ,

ఇదుగో, ఇల్లాలి చేతిమీదుగా
ప్రీతితో పుచ్చుకున్న వేపచేదు
కొద్దికొద్దిగా గొంతుక దిగజారుతూన్న వేళ
కదిపిన తుట్టెనుండి ఝమ్మనిలేచిన తేనెటీగల్లా
ఎన్నెన్ని స్మృతులు!
ఎన్ని తీయని స్మృతులు!
ఎంత చేదు స్మృతులు!
అబ్బా! అప్పుడే
ఎంత దూరం నడచివచ్చాను!
ఎంత తిరిగాను, ఎంత పెరిగాను, ఎంత విరిగాను!
క్రొత్తగా ఈ రోజున
ఇదేమిటో
ఈ అలుపు, ఈ ఆయాసం
అందుకేనేమో
ఈ ఉలికిపాటు
అయినా,
నేనెందుకు చెందాలి నిర్వేదం?
వాల్మీకి వేసిన బాటలో
వ్యాసుడు చూపిన త్రోవలో
నన్నయాదులేర్పరచిన తెన్నులో
నడుస్తున్నవాణ్ణి,
జగత్కళ్యాణ కారకమైన
కవితాభాగీరథీ ప్రవాహంలో
అనునిత్యమూ అఘమర్షణస్నాన
మాచరిస్తున్నవాణ్ణి
నేనెందుకుగాదివేళ
నిట్టూర్చాలి, నిర్వేదమందాలి

, , ,

కనుక
కలవరపాటుకు స్వస్తిచెప్పి
కవితానీరాజనంతో
పలుకుతున్నానుగాదికి
సుస్వాగతమని;
అడుగుతున్నాను పింగళను
కవులపాలిటి జయమంగళవు కమ్మని;
కవిగళంలోనూ, కవికలంలోనూ
అమృతాన్ని రంగరించి పోయమని;
ఆశిస్తున్నాను
ఆ అమృతంలో అవని తలమునకలై
అమరభూమికావాలని.



శాసనాలలో
కావ్యాలలో

# నిదురించిన నెల్లూరు చరిత్ర

డాక్టర్ సి. వి. రామచంద్రరావు ఎం. ఏ., పిహెచ్. డి.

విక్రమ సింహపురమనే పేరుగల నెల్లూరును తొలుత ఎవరు ఎప్పుడు నిర్మించారో ఇదమిత్థమని చెప్పడానికి చారిత్రక ఆధారాలు లేవు. దీనిని మొదటగా నిర్మించినవారు పల్లవులై వుండవచ్చు. బహుశా బృహత్పల్లవులలో మొదటివాడుగా ఎంచబడుతున్న సింహవిష్ణువు (క్రీ. శ. 575–600), 'అవనిసింహ' బిరుదాంకితుడు, తన పేర విక్రమ సింహపురాన్ని నెలకొల్పాడని చెప్పడం సత్యదూరం కాకపోవచ్చు. క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలో సముద్రగుప్త చక్రవర్తి తన దక్షిణ దిగ్విజయ యాత్రలో జయించిన రాజన్యులలో పాలక్కడ రాజు ఉగ్రసేనుడు, కంచిరాజు విష్ణుగోపుడు పేర్కొనబడ్డారు. ఈ పాలక్కడను ప్రళయకావేరి అనబడే పులికాట్‌గా పండితులు గుర్తించారు. సముద్రగుప్తుడు దక్షిణాంధ్రంలో జయించిన రాజ్యాల్లో, ఆ రాజ్య రాజధానుల్లో, నెల్లూరు కాని విక్రమసింహపురం కాని పేర్కొనబడలేదు. కాబట్టి, నాటికి (నాల్గోశతాబ్దానికి) నెల్లూరు లేదనే చెప్పుకోవాలి. సముద్రగుప్తుని దిగ్విజయానంతరం, కళభ్రులనే అటవికజాతి దాడులఫలితంగా, దక్షిణదేశ రాజకీయ పరిస్థితులు అల్లకల్లోలమైపోయినాయి; పల్లవ, చోళ, పాండ్యాది ప్రముఖ రాజవంశాల పాలన రెండు శతాబ్దాలకుపైగా అక్కడ అడగారిపోయింది. ఈకాలంలో పల్లవులు కాంచిని వదలి నెల్లూరుప్రాంతాన్నుంచి కృష్ణకు దక్షిణంగా వున్న ఆంధ్రదేశాన్ని పాలించారని కొంతమంది పండితుల అభిప్రాయం (1). నెల్లూరుజిల్లా ఉదయగిరితాలూకా భైరవకోనలోని పల్లవ గుహాలయాలు ఈ అభిప్రాయాన్ని బలపరుస్తాయి (2). దీనిని బట్టి తన విజయములచే పల్లవ సామ్రాజ్య విస్తరణకు పీఠావాహనం గావించిన సింహవిష్ణువు తన పేర విక్రమ సింహపుర నిర్మాణంతో ఈ సామ్రాజ్య విస్తరణ ప్రారంభించినట్లు చెప్పవచ్చు.

## నెల్లూరు మండలం- ముండరాష్ట్రం

నెల్లూరుజిల్లాలో లభించిన పల్లవుల శాసనాల్లో ఎక్కడా నెల్లూరు పేర్కొనబడలేదు. ఈ శాసనాలు, పెన్నకు ఉత్తరంగానున్నదే నెల్లూరు, కోవూరు, ఆత్మకూరు తాలూకాలను కలిపి 'ముండరాష్ట్ర'మని పేర్కొన్నాయి (3). ముండరాష్ట్రం రెండు భాగాలుగా విభజింపబడి వుండేది. నెల్లూరు, కోవూరు తాలూకాలను (దిగువ) ముండరాష్ట్రమని, ఆత్మకూరు తాలూకాను "మేల్ముండరాష్ట్రం" లేక (ఎగువ) ముండరాష్ట్రమని ఈ పల్లవ శాసనాలు సూచిస్తాయి. 12, 13 శతాబ్దాల నాటి చోళ, పాండ్యశాసనాల్లోకూడా ఈప్రాంతం ముండరాష్ట్రమనే పేర్కొనబడింది. ఈ శాసనాల్లో ముండరాష్ట్రంలోనివిగా కోవూరు తాలూకా గ్రామాలైన ఇడవలూరు, మోడేగుంట, గండవరం, కొడవలూరు, దామరమడుగు, ఉలవపాళ్ళ, వేగూరు; ఆత్మకూరు తాలూకా గ్రామాలైన కొండమీనకోడూరు, రేవూరు; నెల్లూరుతాలూకా గ్రామాలైన గొల్లకందుకూరు, కనుపూరు చెప్పబడ్డాయి. ముండులనేజాతివారు ఈ ప్రాంతాల్లో నివసించుటచే, ఈ ప్రాంతానికి ముండరాష్ట్రమనేపేరు ఏర్పడ్డదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు అభిప్రాయపడ్డారు

## పెన్న - సుప్రయోగ

పల్లవరాజు విష్ణుగోపుని ఉరువపల్లె లేక ఉరువపాళ్ల శాసనంలో, ఆ గ్రామ సరిహద్దుకు దక్షిణంగా కొంతదూరంలో సుప్రయోగానది కలదని చెప్పబడ్డది. ఈ సుప్రయోగానదే మన పెన్నానది అని మల్లంపల్లివారు నిరూపణచేశారు (4). రేనాటి చోళుడైన పుణ్యకుమారుని మాలెపాడు శాసనంలో కూడ సుప్రయోగ పేర్కొనబడింది (5). సంస్కృత వాయు, బ్రహ్మాండ పురాణాల్లో, సంస్కృత భారత భీష్మ, అరణ్యపర్వాల్లో, పడమటికనుమలలో పుట్టిన ఈనది సుప్రయోగ అనే చెప్పబడ్డది (6). మారన తన తెలుగుమార్కండేయపురాణంలో సంస్కృతంలో వున్నట్లే సుప్రయోగ అనివాడాడు. కాని నెల్లూరువారైన తిక్కన ప్రాంతీయాభిమానంతో, సంస్కృత భారతంలో "సుప్రయోగ" అన చోట్లల్లా "పెన్న" అని తెలుగు చేశాడు. (చూడు, తిక్కన భారతము, భీష్మపర్వం, ప్రథమాశ్వాసం, 38; అరణ్యపర్వం, ద్వితీయాశ్వాసం, 278). తనకు ఆ నదిపైగల అభిమానంతో, ఆ నదిలో మునిగితే బొందితో కైలాసానికి విమానం

---

1. History and Culture of the Indian People, I, PP-264-267
2. దా॥ రాయప్రోలు సుబ్రహ్మణ్యం "నెల్లూరు మండలము–భైరవకోన", విక్రమమండల సర్వస్వము పు. 27 మొ॥
3. సింహవర్మ పికిరశాసనం Epigraphia Indica, VIII, P. 159 రెండవ సింహవర్మ బుచ్చిరెడ్డిపాళెం శాసనం, Epigraphia Indica XXIV. No. 48; ఉరువపల్లి శా॥ Indian Antiquary, 1876, V, Feb; నరసింహవర్మ తామ్ర శా॥ Journal of Sri Venkateswara Oriental Institute, VIII. 2; నెల్లూరు జిల్లా శాసనాలు, నెల్లూరు తాలూకా; సంఖ్య 19,31,72,61; రాపూరు 8.
4. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1940 "సుప్రయోగ".
5. Epigraphia Indica, XI, 337-346
6. వాయుపురాణం, అధ్యా. 45 శ్లో. 104; మార్కండేయపురాణం, అధ్యా. 54 శ్లో. 26; అరణ్యపర్వం, అధ్యా. 222, శ్లో. 24; భీష్మపర్వం, అధ్యా. 9, శ్లో. 19.

మీద పోవచ్చునన్నారు ("పెన్న యను మహానదినాడిన మయూరహంస విమానగతులగుదురు") పుణ్యకుమారుని మాలెపాడు శాసనంలో, చిరువనవాళ (చిరమన, ఆత్మకూరు తాలూకా) వాసియైన కేశవశర్మ అనువానికి, హిరణ్యరాష్ట్రం (నెల్లూరు జిల్లా పశ్చిమోత్తర భాగాలు)లో, సుప్రయోగానది దక్షిణ తీరానగల బీరపాటు (బిల్లుపాడు) గ్రామం దానం చేయబడ్డది. హిరణ్యరాష్ట్రానికి ఆ పేరు హిరణ్యాకులను ఒకజాతి అక్కడ నివసించుటచే వచ్చిందని ఒక ఊహ (7).

## వేంగి చాళుక్యులు

తూర్పు చాళుక్యుడైన గుణగ (మూడవ) విజయాదిత్యుడు క్రీ. శ. 849 లో సింహాసనానికివచ్చి, 44 ఏండ్లు పరిపాలించాడు. ఇతని కాలానికి నెల్లూరు, శక విక్రమ సింహపురం. చక్కని రూపురేఖలు దిద్దుకొని నాటి మేటి నగరాల్లో ఒకటిగా పేరుకొచ్చినట్లుంది. అప్పట్లో, పల్లవరాజ్యంలో భాగంగావున్న నెల్లూరు మండల పశ్చిమ ప్రాంతాలను 'బోయ'అనబడే జాతులకు చేరిన వీరులు పరిపాలిస్తూ వుండేవారు. వీరు పరిపాలించే ప్రాంతాలను 'బోయకొట్టాలు' అనేవారు. ఇవి పన్నెండు ఉండెవి. ఈ బోయ కొట్టాలు నెల్లూరుమండల, విజయనగర శాసనాల్లో ఇట్లా వివరింపబడ్డాయి.

"ఉదయగిరి రాజ్యమందుల బోయ విహారదేశం లోపలను పెన్న కటకతీరమందున అనంత సాగరానకు పడమటను గుడకుట్టు అనెటి బహాదురిపురము" (8)

"బోయవీళ్ల కొలచినగుంమళ్లపాటిపాలెం"(9)

"ఉదయగిరి స్థల బోయవిండ్లలో... మణువుపాడు" (10)

"ఉదయగిరి రాజ్యమందు బోయవీడి లోపలకు కుడిచలపాటు" (11)

"మా నాయంకరానకుం జెల్లివుండే గిరిజావివెలి బోయవీళలోని పహిమలూరను." (12).

గుణగ (మూడవ) విజయాదిత్యునికి చాలాకాలం ముందునుండి, బహుశా వేంగి చాళుక్యుల మూలపురుషుడైన కుబ్జ (మొదటి) విష్ణువర్ధనుని (క్రీ. శ. 624-641) కాలంలోనే, ఈ బోయ కొట్టాలను జయించి, బోయవీరులను తమ సామంతులుగా చేసుకొన్నట్లు పశ్చిమ చాళుక్య రెండవ పులకేశి (కుబ్జ విష్ణువర్ధనుని అన్న) కొప్పారం శాసనం సూచిస్తుంది.(13) చాళుక్య మూడవ విష్ణువర్ధనుని (క్రీ. శ. 719-55) కాలంలో అతని సామంతుడైన పృథ్వీ వ్యాఘ్రుడనే నిషాద బోయరాజు, ప్రసిద్ధుడైన పల్లవ సేనాపతి ఉదయచంద్రునితో నెల్లూరు వద్ద తలపడి ఓడిపోయాడు. ఉదయచంద్రుడు చాలా ఏనుగులను, మిక్కిలి కొల్లధనాన్ని, మూడవ విష్ణువర్ధనుని అధీనంలోవున్న నెల్లూరు జిల్లాలోని పశ్చిమోత్తర ప్రాంతాలను తనస్వామియైన పల్లవరాజు రెండవ నందివర్మకు సమర్పించి విష్ణురాజు దేశాన్ని పల్లవరాజ్యం కావించాడని పల్లవ శాసనం చెప్తుంది(14). గుణగ (మూడవ) విజయాదిత్యుని కాలంలో, అతడు సింహాసనం ఎక్కిన సంవత్సరంలోనే ఏ కారణం చేతనో, బహుశా వయసున చిన్నవాడని, నెల్లూరు మండలంలోని బోయరాజులు చాళుక్యుల అధికారాన్ని కాదని తమ స్వాతంత్ర్యం ప్రకటించుకొన్నారు.

## పండ్రంగుడు

సత్య సమన్వితుడైన గుణగుడు ఈ తిరుగుబాటును సహించలేదు. కడెయరాజు పుత్రుడు, సైన్యాధ్యక్షుడు అయిన పండ్రంగుని, బోయలను శిక్షించి, బోయకొట్టాలను లోగొనమని పంపించినాడు. పండ్రెండు బోయ కొట్టాలలో కందుకూరు, నెల్లూరు ముఖ్యపట్టణాలు. కట్టెపు దుర్గమనే బలమైన కోట ఈ బోయరాజ్యానికి అయియున్నట్లు. సామంత పడువతో బయలుదేరిన పండ్రంగుని సైన్యాలను ఎదుర్కొనడానికి బోయ దొరలు తమ సైన్యాలను కట్టెపుదుర్గం, నెల్లూరుల



డాక్టర్ రామచంద్రరావు

వద్ద సమీకరించినట్లున్నారు. పండ్రంగుడు కట్టెపు దుర్గాన్ని నేలమట్టం గావించాడు; నెల్లూరుపురాన్ని తగులబెట్టినాడు. బోయ దొరలను నిర్జించి వారి పండ్రెండు కొట్టాకల దేశాన్ని ఆక్రమించినాడు. నెల్లూరునుండి తొండమండలం సరిహద్దులలో, పులికాట్టు (ప్రళయకావేరి) సరస్సువరకు తన సైన్యాన్ని నడపి, దాని ఒడ్డున తనపేర పండరంగ మాహేశ్వరుని ప్రతిష్ఠించి, పండ్రంగమనే ఊరు నిర్మింపచేశాడు. 13వ శతాబ్దంలో ఈ పండ్రంగేశ్వరుడికి చోళరాజులు చేసిన దానధర్మాలు తెలిపే తమిళ శాసనాలు ఉన్నాయి. ఈ శాసనాల్లో పండ్రంగం "జయకొండ చోళ లేక రాజేంద్ర చోళ మండలంలోని, పవిత్ర కొట్టానికి చెందిన పేరూరునాడులోని పండ్రంగం" అని "కడల్ కొండ పవిత్తిరి కొట్టంలోని కాకండిపుర" మని పేర్కొనబడింది. (15) పండ్రంగుని విజయంతో అంతవరకు పల్లవులకు సామంతమండలంగావున్న నెల్లూరు మండలం చాళుక్య రాజ్యాంతర్భాగమయింది. పండ్రంగుడు చాళుక్యుల ప్రతినిధిగా, కందుకూరు రాజధానిగా తాను జయించిన భూమిని పాలించసాగాడు; 'కందుకూరు'ను వైభవంలో

7. Para 7 of Madras Epigraphical Report, 1035-36.
8. Nellore District Inscriptions Atmakur (30)
9. ,, Kanigiri ( 4)
10. Nellore District Incriptions Kanigiri (10)
11. ,, Udayagiri (46)
12. ,, Atmakur (37)
13. Epigraphia Indica, XVIII, 257.8
14. South Indian Inscriptions, II, 368
15. Nellore District Inscriptions, Gudur, 86-105

చాళుక్యుల రాజధానియైన 'బెజవాడ'గా మార్చానని చెప్పుకొన్నాడు (16). ఈ సంగతులనుబట్టి చాళుక్యుల కాలానికి నెల్లూరు ప్రసిద్ధి చెందిన నగరాల్లో ఒకటై, వంద్రంగునిచేత పరశురామ ప్రీతి కావింపబడే గౌరవాన్ని, యోగ్యతను సంపాదించుకొంది.

## చోళులు - తెలుగు చోడులు

చాళుక్యుల తర్వాత నెల్లూరును పాలించినవారు చోళులుగా కనపడతారు వంద్రంగుని కాలంలో జయింపబడ్డ నెల్లూరు మండలంలో, పెన్నకు దక్షిణ భాగాన్ని ఆటుతర్వాత ఎప్పుడో పల్లవులు మరల స్వాధీనం చేసుకొన్నారు. చోళ సామ్రాజ్యానికి పునాదులు వేసిన మొదటి పరాంతక చోళుడు (క్రీ. శ. 907-953) నాటికి మిగిలిన పల్లవుల ప్రాభవాన్ని అస్తమింపచేసి, కంచిమొదలు నెల్లూరు దాకావున్న పల్లవరాజ్యాన్ని ఆక్రమించాడు (17). చోళులకు సామంతులుగా 12వ శతాబ్ద ప్రథమార్థం నుంచి కంచినుండి నెల్లూరు మండలం దాకా గల దేశాన్ని తెలుగుచోడులు పరిపాలించసాగారు. వీరిలో నల్లసిద్ధి 12 వ శతాబ్ద ప్రథమార్థంలో నెల్లూరు, కడప, చెంగల్పట్టు జిల్లాలతో పొందికగా వున్న రాజ్యాన్ని. కంచి, విక్రమ సింహపురమనే నెల్లూరు మారు రాజధానులుగా పాలన చేశాడు. చోళ చక్రవర్తి రెండవ రాజాధిరాజు (క్రీ. శ. 1163-79) బలహీనత వీలుగా, నల్లసిద్ధి తరువాత తెలుగు చోడాధిపులైన మొదటి బేత, ఎఱ్ఱసిద్ధి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నారు. వీరి కాలం చరిత్ర సరిగా తెలియదు.

## మొదటి మనుమసిద్ధి

ఎఱ్ఱసిద్ధికి ముగ్గురు కుమారులు- మొదటిమనుమసిద్ధి. రెండవ బేత, తమ్ముసిద్ధి. ఎఱ్ఱసిద్ధి తర్వాత మనుమసిద్ధిరాజ్యానికి వచ్చాడు. మనుమసిద్ధికుమారుడుమొదటి చోడతిక్కడు. మనుమసిద్ధి కాలంలో, చోళ చక్రవర్తి మూడవ కులోత్తుంగుడు (క్రీ. శ. 1178-1216) తెలుగు చోడుల మీదికి దండెత్తివచ్చి కంచి ప్రవేశించి మనుమసిద్ధిని ఓడించి, తిరిగి తెలుగుచోడులమీద చోళాధిపత్యం నెలకొల్పాడు. ఇతని మూడవ పరిపాలనా సంవత్సరమైన క్రీ. శ. 1180 నాటి శాసనాలు, నాడు నెల్లూరు రాజ్యానికి చెందిన కంచి, కాళహస్తి, నందలూర్లలో లభ్యమగుటచే, ఈ చోళ విజయం క్రీ. శ 1180 ప్రాంతంలో జరిగిందని చెప్పవచ్చు (18). "మదురైయుం పాణ్డియన్ ముడిత్తలైయుం కొణ్డరుళియ" (మధురను పాండ్యుని తలను కొన్నవాడు) అని ఇతనికి ఒక బిరుదు వుంది. ఈ బిరుదుతో కూడిన ఇతని శాసనాలు, నెల్లూరు రంగనాయకస్వామి దేవళంలో, నెల్లూరు పట్టణంలో ఒకటి రెండు ఇతరచోట్ల. 9. 10, 20, 26, 31, 35. 36 పరిపాలనా సంవత్సరాల కాలం నాటివి, కాలంతెలియనివిమరికొన్నిలభించాయి(19). ఈ శాసనాలనుబట్టి తెలుగు చోడరాజ్యం పూర్తిగా అతని ఆధీనంలో వుండిందని చెప్పవచ్చు. క్రీ శ. 1180 లో ఇతని విజయఫలితంగా, మొదటి మనుమసిద్ధికి రాజ్యం పోయింది. చోళచక్రవర్తి తెలుగు చోడరాజ్యానికి మనుమసిద్ధి తమ్ముడైన నల్లసిద్ధిని పాలకుడుగానియమించాడు. క్రీ. శ. 1187 నుండి 1204 వరకుగల నల్లసిద్ధి శాసనాలు, నెల్లూరు రాజ్యంలో లభ్యమయినవి అతడు చోళులకు విధేయుడుగా పరిపాలించాడని తెలుపుతాయి (20). ఇతనికి మధురాంతక పొత్తపిచోళుడనికూడ పేరు. కులోత్తుంగుని 9వ 31వ పరిపాలన సంవత్సరాల పేర్కొన్న ఇతని శాసనాలు నెల్లూరు పెద్దమసీదు వీధిలో, రంగనాయకుల దేవళంలో లభ్యమయ్యాయి (21). ఇతనితర్వాత ఇతని తమ్ముడు తమ్ముసిద్ధి సింహాసనాన్ని ఆక్రమించి క్రీ.శ. 1204 నుండి 1208 వరకు కులోత్తుంగచోళునికి విధేయుడుగా పాలించినట్లు తెలుస్తుంది. కులోత్తుంగుని 29-వ పాలనా సంవత్సరంనాటి ఇతనిశాసనం రంగనాయకుల దేవళంలోవుంది. వీరి కాలంలో నెల్లూరు నగరపరిస్థితులను క్రింద విడిగా చర్చించుకొందాం.

## తెలుగు చోడులు- కాకతీయులు

మొదట మనుమసిద్ధి కొడుకు తిక్కడు, తాను తెలుగు చోడరాజ్యానికి నిజమైన వారసునిగా భావించి, నాటికి ప్రాభవంలో వున్న కాకతి గణపతి దేవచక్రవర్తి సహాయం అర్థించి, అతని సహాయంతో తమ్ముసిద్ధిని అతని సహాయులను ఓడించి, 1208 లో రాజ్యానికి వచ్చాడు. ఇంతకు ముందు కొద్దికాలం క్రిందటనే, తిక్కడు, గణపతితో చేరి. ద్రాక్షారామం, శ్రీకూర్మం మధ్య తీరాంధ్ర దేశాన్ని పరిపాలిస్తున్న వెలనాటి పృథ్వీశ్వరుణ్ణి యుద్ధనిహతుణ్ణి చేయడంలో. గణపతికి తోడ్పడ్డాడు. తిక్కన సోమయాజి తన నిర్వచనోత్తర రామాయణంలో. కేతన తన దశకుమార చరిత్రలో (23) ఈవిషయాన్ని పేర్కొన్నారు. ఈ సహాయానికి ప్రతిఫలంగా, గణపతి తిక్కరాజును నెల్లూరు సింహాసనంమీద కూర్చోపెట్టినాడు ఈ విషయాన్ను కాకతీయ సైన్యాధ్యక్షుడైన జాయ సేనాపతి తన క్రీ. శ. 1213 నాటి చేబ్రోలు శాసనంలో చెప్పివున్నాడు (24).

తిక్కరాజు గణపతి సహాయంపొందినా, తన సరిహద్దులలోవున్న శత్రువులనుండి తన్ను రక్షించుకోడానికి తన రాజ్య సమగ్రత కాపాడుకోడానికి మూడవ కులోత్తుంగుని ఆధిపత్యం మన్నించక తప్పలేదు. కులోత్తుంగుని 36 పాలనా సంవత్సరంనాటి ఇతని శాసనం రాపూరుతాలూకా చీకవోలులో ఉంది (25). కులోత్తుంగుని 35, 36

16. అద్దంకి శాసనం, Epigraphia Indica, XIX, 275

"పట్టంబుగట్టిన ప్రథమంబు నేడు-
బెంగ్యమొప్పగ బైశేది సేన
పట్టంబుగట్టించి ప్రభు బండరంగు-
బంచిన సామంత పదువతో బోయ
కొట్టమ్ములేండ్రెండు గొని వేంగినాంటి-
గొఱల్చియ త్రిభువనాంకుశ బాణనిల్చి
కట్టెపు దుర్గంబు గడుబయల్సేసి-
కందుకూర్బెజవాడ గావించె మెచ్చి"

17. See History and Culture of the Indian People IV, P. 154.

18. Annual Report on Epigraphy, 403 of I919, 195 of 1892, 586 of 1907.

19. Nellore District Inscriptions. Nellore Nos. 83, 63, 64, 85, 69, 57, 72, 67, 70, 65, 87.

20. Nellore District Inscriptions, Nellore, 40, 85: Annual Report on Epigraphy, 317 of 1929, 198 of 1892, 601 of 1907,197 of 1894, 578 of 1907.

21. Nellore District Inscriptions Nellore, Nos. 85, 67.

22 అదే, నెం. 72

23. నిర్వచనోత్తర రామాయణం, I-32; దశకుమారచరిత్ర, I-16.

24 Epigraphia Indica, V. P. 149

25. Nellore District Inscriptions, Rapur (8)

పాలనా వత్సరాల శాసనాలు నెల్లూరులో వున్నాయి. (26). ఇతనికాలంలో సేఉణ – యాదవరాజులు ఇతని రాజ్యంమీద దండెత్తారు; ఫలితంగా తిక్కడు కంచితో పాటు చెంగల్పట్టు ఉత్తరఆర్కాటుజిల్లాల లోని తన రాజ్యాన్ని కోల్పోయినాడు. మూడవ కులోత్తుంగుడు ఇతనికేలాటి సహాయాన్ని చేయ లేకపోయినాడు. 1215 నుండి 1228 దాకా తిక్కడి శాసనాలు కానరాకపోవుటచే ఈకాలంలో ఇతడు రాజ్యభ్రష్టుడై, తిరిగి కాకతీయ గణపతి సహాయంతో రాజ్యం సంపాదించుకొన్నట్లుంది. నిర్వచనోత్తర రామాయణం, తెలుగుచోడ శాసనాలు తిక్కడు ఇతరుల సహాయంలేకుండా, స్వశక్తితో కడపజిల్లాలోని కురుమలూరువద్ద శత్రువులను నిర్జించినాడని చెప్పినా (27), వరంగల్లుజిల్లాలోని క్రీ.శ. 1228 నాటి గణపతి మట్టెవాడశాసనం(28), జాయసేనాపతి క్రీ.శ. 1231 గణపేశ్వరం శాసనం (29), గణపతి చోళ, సేఉణ, కర్ణాట సైన్యాలను నిర్జించి, తిక్కడికి మరల నెల్లూరు, కాంచీనగరాలు అప్పచెప్పాడని సూచిస్తాయి. దీనికి కృతజ్ఞతా సూచకంగానే, తిక్కడు గణపతి సామంతులలో ఒకడైన ఇంబదేవని బావమరదిని, గంగయ సాహిణిని ఎరువ పాకనాటికి పాలకుడుగా నియమించాడు తిక్కడి కష్టాలు ఇంతటితో తీరలేదు. అతడు తర్వాత చోళరాజు మూడవ రాజరాజు (1216—1246) పక్షం వహించి, 1239 లో జంపై వద్ద కర్ణాటకరాజు హొయసల రెండవ నరసింహుణ్ణి యుద్ధ నిహతుణ్ణి గావించి, మనుసంవత్సరం అతని కుమారుడు సోమేశ్వరుణ్ణి నిర్జించి, 'చోళస్థాపనాచార్య' బిరుదం వహించాడు (30). ఈ యుద్ధాలలోకూడా గణపతి తిక్కరాజుకు సహాయపడ్డాడని చెప్పడానికి అవకాశముంది అట్టి సహాయం లేకుండా తిక్కడిలాంటి చిన్నరాజు హొయసలులను గెలిచివుండలేడు.

## రెండవ మనుమసిద్ధి

తిక్కరాజు 1248 లో చనిపోయాడు. అతని తర్వాత నెల్లూరు తెలుగు చోళరాజ్యం అల్లకల్లోలమైంది. తిక్కడి తర్వాత తెలుగుచోడ సింహాసనానికి తిక్కడి కుమారుడు రెండవ మనుమసిద్ధి, అతని దాయాదులలో ఒకడైన విజయగండ గోపాలుడనేవారుతగాదాపడ్డారు. విజయగండ గోపాలుడు నెల్లూరు రాజ్యంలో వున్న చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాటు జిల్లాల నాక్రమించి, కంచి రాజధానిగా పరిపాలించసాగాడు. మనుమసిద్ధికి నెల్లూరు, కడప జిల్లాలు మాత్రం మిగిలాయి. తనకు సహాయంగా గండగోపాలుడు చోళచక్రవర్తి మూడవ రాజేంద్రుని (1246-1279) తో, కర్ణాటక సోమేశ్వరుని (1234-1260) లో సఖ్యం ఏర్పరచుకొన్నాడు; వారి సహాయంతో నెల్లూరు మండలాన్ని ఆక్రమించ ప్రయత్నించాడు. సూళ్ళూరుపేట నాగేశ్వరస్వామి దేవళంలో విజయగండ గోపాలుడి రెండవ పరిపాలనాసంవత్సరంనాటి తమిళశాసనం వుంది (31). పంద్రంగంలో 75; పాలనాసంవత్సరంనాటి శాసనం వుంది (32). అదే సమయంలో, పడిహారులైన బయ్యన తిక్కనలు తిరుగుబాటుచేసి రెండవ మనుమసిద్ధిని నెల్లూరునుంచి పారదోలారు (33). వైదుంబ వంశజుడైన రక్కసగంగడు కడపజిల్లాలోని తెలుగు చోడప్రాంతం మీద దాడిచేసి, తెలుగుచోడుల ప్రతినిధి, సేనాపతి గంగయ సాహిణిని పారదోలి కడప మండలాన్ని ఆక్రమించాడు (34). ఈవిధంగాపరిస్థితులు తనకు ప్రతికూలించగా, మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడై, తమకు ఆప్తుడైన కాకతీయ గణపతి సహాయమర్థించాడు. ఈ సహాయాన్ని అర్థించడానికై తన మంత్రిని తిక్కన సోమయాజిని వరంగల్లు పంపించాడు. అప్పటికే తెలుగునేల నాలుగువెరగులా కవిబ్రహ్మ యశశ్చంద్రికలు వ్యాపించి వున్నాయి. సోమయాజి రాకను గణపతి ఒక మహాగౌరవంగా భావించి, మనుమసిద్ధికి రాజ్యలాభాన్ని చేకూర్చడానికై, సామంతభోజుని నాయకత్వాన ఒక గొప్ప సైన్యాన్ని పంపాడు. గుంటూరు జిల్లాలోని నాయనిపల్లెలోని ఒక శాసనంలో ఈ సైన్యం సాధించిన విజయాలు పేర్కొనబడ్డాయి (35). అది నెల్లూరును ముట్టడిగావించి, పడిహారి బయ్యన తిక్కనల, వారి సహాయుల తలలతోటి చెండాట ఆడి, ద్రావిడమండలం ప్రవేశించి, కులోత్తుంగ మూడవ రాజేంద్రుని చేజిక్కించుకొని, నెల్లూరు పాలకునిచే ఏనుగలను కానుకగా పడసింది. మనుమసిద్ధి ఈ యుద్ధాలలో పాల్గొన్నాడు; తంజావురు జిల్లాలోని పెన్నయేరు తీర పాలైయూరువద్ద, గండగోపాలుని సైన్యాలను అతనికి సాయంవచ్చిన ద్రావిడ, కర్ణాటరాజుల సైన్యాలను ఓడించాడు (36). తిక్కన ఈ విజయాన్నంతా మనుమసిద్ధే సాధించాడనిచెప్పుటం అతిశయోక్తిమాత్రమే (36). అతని వెనుకగల కాకతీయబలమే అతని విజయాలకు కారణం. పాలైయూరు యుద్ధం తర్వాత, సామంతభోజుడు సైన్యాలను కంచివైపు నడపి ఆ నగరాన్ని సులభంగా స్వాధీనం చేసుకొన్నాడు. (క్రీ. శ. 1250). కాని ఈ పాలైయూరు యుద్ధం మనుమసిద్ధికి గట్టి మేలు చేకూర్చినట్టులేదు. గండగోపాలుడి శాసనాలనుబట్టి అతడు తిరిగి త్వరలో కంచిని స్వాధీనంచేసికొని, ఆ ప్రాంతాన్ని 1282 వరకు పాలించినట్లు కనపడుతుంది (37). చివరకు మనుమసిద్ధికి నెల్లూరు మండలంమాత్రం దక్కింది. గండగోపాలుడు కంచిని మరల స్వాధీనంచేసుకోడానికి, కడపజిల్లాలో మనుమసిద్ధి వ్యవహారాలు అవకాశం కల్పించాయి. తెలుగుచోడుల ప్రతినిధిగా ఎరువపాకనాడును పాలిస్తున్న గంగయ సాహిణిని రక్కసగంగడు నిర్జించి, ఆ ప్రాంతాన్ని ఆక్రమించాడని పైన చెప్పాం. ఈ విషయంలో రక్కసగంగుడికి గుత్తిని పాలిస్తున్న తెలుగుచోడపాలకుడు సహాయపడ్డాడు. ఇతడు గంగయసాహిణిని ఓడించి 'గండపెండేర గంగయసాహిణి సర్వస్వాపహార' అని బిరుదును వేసుకొన్నాడు (38). గణ

---

26. అదే, నెల్లూరు (65), (87)
27. నిర్వచనోత్తర రామాయణం, 1 88; Annual Report on Epigraphy, 446 of 1920; Part II, Para 55.
28. Corpus, Inscriptionum Indicarum, 10
29. Epigraphia Indica, III. P.91.
30. నిర్వచనోత్తర రామాయణము, 1.-33: Annual report on Epigraphy 439 of 1937-38
31. Nellore District Inscriptions, Sulurpeta (8)
32. Nellore District Inscriptions, Gudur (91)
33. Annual 769 of 1922
34. నిర్వచనోత్తర రామాయణం 1.41
35. Annual report, 769 of 1922
36. నిర్వచనోత్తర రామాయణం, 1.39
37. Annual report, 137 of I916
38. చూడు, భారతి, 1938, పు. 157

Phone : 1516 P P

నవ్యతకు నాణ్యతకు

వివాహాది శుభకార్యములకు వలయు అన్నిరకముల వస్త్రములు,
లేడీస్ ఫ్యాన్సీ ఆర్నమెంట్సు, ప్రెజంటేషన్ ఆర్టికల్స్ మరియు
పిల్లలకు రెడీమేడ్ దుస్తులు లభించును.

విచ్చేయండి

# పూర్ణా డిపార్టుమెంటల్ స్టోర్సు

వస్త్రముల విభాగము

సుబేదారుపేట .... నెల్లూరు- 1

---

నమ్మకమైన మందులు – సరసమైన ధరలు
'పింగళ' జనాళికి ఆరోగ్యభాగ్యం ప్రసాదించాలని
మా ప్రగాఢ వాంఛ

# నెల్లూరు ఫార్మశీ

తిప్పరాజువారిసత్రం

ట్రంకురోడ్డు — నెల్లూరు

ఆనం పెంచలురెడ్డి మేనేజరు.

పతి, మనుమసిద్ధి సైన్యాలు ద్రావిడ మండలంలో విజయాలు సాధించి అక్కడనుండి కాళహస్తి మీదుగా గుత్తిమీదికి దండెత్తినాయి. అపుడు జరిగిన యుద్ధంలో రక్కసగంగడు ఓడి, గంగయసాహిణి పాలిస్తున్న ఎరువపాకనాడు ప్రాంతాన్ని అతనికి తిరిగి ఇచ్చివేసినాడు. అయితే ఈ విజయం మనుమ సిద్ధికి రాజ్యపరంగా లాభించలేదు; గణపతి గంగయసాహిణిని బాహత్తర నియోగాధిపతిగా (72 నియోగాలమీద అధిపతిగా) నియమించి, ఈ ఎరువపాకనాటిని అతనికి దత్తం చేసినాడు; మనుమసిద్ధి కాదనలేకపోయినాడు; తిక్కన ఈ విషయాన్ని ఔచిత్యంతో, మనుమసిద్ధే గంగయ సాహిణి సేవకు మెచ్చి ఈ ప్రాంతాన్ని అతనికి దత్తంచేశాడని చెప్పారు (39).

## పాండ్యులు

13వ శతాబ్దం ఉత్తరార్థానికి ద్రావిడ దేశంలో చోళుల ప్రాభవం తగ్గి, పాండ్యులు విజృంభించారు. 1263లో మొదట జటావర్మ సుందర పాండ్యుడు (1251-1268) నెల్లూరు మీదికి దండెత్తివచ్చాడు. సుందర పాండ్యుడు 1251-57ల మధ్య దక్షిణ భారతాన్నంతా లోగొని, చోళులను అణచి, వారి సామంతులుగా మెలగుచున్న తెలుగు చోడుల రాజ్యాన్ని తన అధీనంలోనికి తీసుకోడానికి ఉద్యుక్తుడైనాడు. మొదట, 1260 నాటికి గండ గోపాలుడిని జయించి, కంచిని స్వాధీనం చేసుకొన్నాడు. ('కాంచీపురం కొండన్' అని సుందర పాండ్యుని బిరుదు) (40). అటుతర్వాత 'వీర గండగోపాల' బిరుదాంకితుడైన రెండవ మనుమ సిద్ధిమీద పడ్డాడు. మనుమసిద్ధి సులభంగా లొంగ లేదు. యథాప్రకారం కాకతీయగణపతిని, సేఉణ, బాణరాజులను సహాయ మర్థించాడు. కాకతీయ సైన్యాల దృష్టిని మరలించడానికిగా పాండ్యులు కొంత సైన్యాన్ని తమ సామంతులుగా వున్న మూడవ రాజేంద్రచోళ, కొప్పెరుంజింగ, విజయ గండ గోపాలుల నాయకత్వంక్రింద త్రిపురాంతకం మీదికి పంపి (41), ముఖ్యబలాన్ని నడుపుకొని మొదట జటావర్మ సుందర పాండ్యుడు, ధునైక వీర విక్రమపాండ్యుడు, జటావర్మ వీరపాండ్యుడు తిరువెంబడి నెల్లూరువైపు నడచి, ముత్తుకూరు (నెల్లూరుకు తూర్పుగా 14 మైళ్ళు) చేరారు. ఇచ్చట 1263లో జరిగిన తుముల సంగ్రామంలో వీరగండ గోపాల బిరుదాంకితుడైన రెండవ మనుమసిద్ధి ప్రాణాలు కోల్పోయినాడు; కాకతీయసైన్యాలు కృష్ణానది వైపుగా తరుమబడి, అపారనష్టాన్ని పొందాయి. నెల్లూరు తెలుగు చోడరాజ్యం పాండ్య సామ్రాజ్యంలో అంతర్భాగమయ్యింది. ఈ ఘన విజయాలకు సూచకంగా, జటావర్మ సుందర పాండ్యుడు నెల్లూరులో, కంచిలో, వీరాభిషేకం జరుపుకొని, తులాభారాలు చేశాడు (42). సుందర పాండ్యుడు, మనుమసిద్ధి సోదరులను నెల్లూరు నందు సామంత పాలకులుగా నియమించి తిరిగి పోయినాడు.

## మనుమసిద్ధి తర్వాత...

మనుమసిద్ధి తర్వాత నెల్లూరు తెలుగు చోడుల చరిత్ర తెలియరాదు. జటావర్మ సుందరపాండ్యుడు తిరిగిపోయిన తర్వాత, చోళచక్రవర్తి, త్రిభువన చక్రవర్తిన్ వీరరాజేంద్ర చోళుడనబడే మూడవ రాజేంద్రుడు, నెల్లూరు రాజ్యాన్ని లోగొని, పాండ్యుల సామంతుడుగా 1262-1268 దాకా పాలించినట్లు శాసనాలు సూచిస్తాయి. చోడతిక్కడు అతని కుమారుడు రెండవ మనుమసిద్ధి ఇతని సామంతులుగావున్నట్లు కృష్ణాపట్నం, పుంజులూరు పాడు, పంద్రంగం, నెల్లూరు, ఉదయగిరి తాలూకా బిలకపాడులలో గల ఇతని శాసనాలు సూచిస్తాయి (43). ఈమూడవ రాజేంద్రచోళున్ని నిర్జించి, రుద్రమదేవి సామంతుడైన మహామండ లేశ్వర నాగదేవ మహారాజు నెల్లూరు రాజ్యాన్ని 1271-1275 వరకు పాలించినట్లు శాసనాలు చెప్తాయి. ఇతని శాసనాలు ఆత్మకూరు తాలూకా పెరమన, కావలితాలూకా పెద్దకొండూరు, నెల్లూరు తాలూకా ఈదూర్లలో ఉన్నాయి (44). నాగదేవ మహారాజు తర్వాత త్రిభువన చక్రవర్తి ఇరుమడి కాంత్రి దేవుడు, లేక రెండవ కాంత్రి దేవుడు, మనుమసిద్ధి మొదటి కొడుకు, నెల్లూరురాజ్యాన్ని పాలించసాగాడు. ఇతని రెండవపాలనా సంవత్సరం (క్రీ. శ. 1279) నాటి శాసనం నెల్లూరుకు దక్షిణంగా ఇరవైమైళ్ళలోవున్న మడమనూరులో లభ్యమయింది (45). ఇతను ఎట్లా కాకతీయుల సామంతుడైన నాగదేవ మహారాజును త్రోసిరాజని నెల్లూరు సింహాసనాన్ని ఆక్రమించాడో తెలియరాదు. ఇతడు క్రీ. శ. 1279-1282వరకు పాలించి నట్లు కనవడుతుంది. అటుతర్వాత మనుమ గండ గోపాలుడు రాజ్యానికివచ్చాడు. ఈ మనుమ గండ గోపాలుడికి ఇరుమడి కాలత్తి దేవుడికిగల సంబంధం తెలియదు. కడప ప్రాంతాన్ని వల్లూరుపట్టణం రాజధానిగా కాకతీయ సామంతుడుగా పరిపాలిస్తూ రుద్రాంబ అధికారాన్ని కాదన్న అంబదేవుడు, క్రీ. శ. 1290నాటి తన త్రిపురాంతకం శాసనంలో, అనుచరులతో రాజ్యభ్రష్టుడు గావింపబడిన మనుమ గండగోపాలుణ్ణి తిరిగి విక్రమసింహపుర సింహాసనంమీద కూర్చోపెట్టానని చెప్పుకొన్నాడు (46). ఈ సంఘటన క్రీ. శ. 1282 ప్రాంతంలో జరిగివుండవచ్చు. కొడవలూరు నందలి మనుమ గోపాలుడి శాసనం క్రీ. శ. 1284ను అతని మూడవ పాలనా సంవత్సరంగా పేర్కొంటుంది (47).

అంబదేవుణ్ణి శిక్షించడానికి క్రీ. శ. 1291లో రుద్రాంబ సైన్యాలు త్రిపురాంతకం మీదికి నడచాయి. ఈ సంఘటనకు ముందే, అంబదేవుడికి మిత్రుడైన నెల్లూరు మనుమ గండగోపాలుడు అంబదేవుడికి సహాయపడకుండా, కుమార (యువ రాజు) (ప్రతాప) రుద్రదేవుడు 'సకలసేనాధిపతి' 'దక్షిణ భుజాదండ'ము అయిన అడిదంమల్లు, తిరువెంబడి నెల్లూరుమీదికి సైన్యాలు నడిపించాడు. మనుమ గండగోపాలుడు యుద్ధంలో నిహతు

39. నిర్వచనోత్తర రామాయణం, 1-41

40. Annual Report, 483 of 1919

41. Annual Report, 201, 197, 198 and 272 of 1905

42. South Indian Inscriptions, IV No. 865; Annual Report on Epigraphy, 1914, part II para 18

43. Nellore District Inscriptions, Gudur, 39, 85, 90; Udayagiri 48; Nellore 89

44. Nellore District Atmakur 51, Kavali 48, Nellore 21

45. Nellore District, Gudur 45

46. South Indian Inscriptions 465, 599

47. Nellore District Inscriptions, Nellore 31.

చేయ్యాడు. తనవిజయానికి సూచకంగా అసిదం వల్ల 'మనుమగండ గోపాల శిలాబంధన' అనే బిరుదు వహించాడు (48). కాకతీయులకు మనుమగండగోపాలుడికి యుద్ధం ఎప్పుడు జరిగిందో ఖచ్చితంగా తెలియదు. మనుమగండ గోపాలుడి తర్వాత 'రాజగండ గోపాల' బిరుదాంకితుడైన మధురాంతక పొత్తపిచోడ రంగనాథుడనేవాడు నెల్లూరు రాజ్యాన్ని క్రీ. శ. 1290 నుండి పాలించినట్లు శాసనాలు సూచిస్తాయి. ఇతడు మనుమసిద్ధికి మనుమడుగా కనపడ్తాడు. ఇతని 6, 9 12, 25 పరిపాలనా సంవత్సరాలనాటి శాసనాలు రంగనాయకస్వామి దేవళంలో ఉన్నాయి (49) అందువల్ల పై చెప్పిన యుద్ధం క్రీ. శ. 1290 ప్రాంతంలో జరిగిందని చెప్పవలసివున్నది.

ఏ పరిస్థితుల్లో రాజగండగోపాలుడు నెల్లూరు సింహాసనాన్ని అధిష్టించాడో తెలియదు. బహుశా పై యుద్ధంలో కాకతీయుల పక్షం వహించి, ప్రతిఫలంగా, వారి సహాయంతో నెల్లూరు పాలకుడై వుండవచ్చు. కాని అతడు కొద్దికాలంలోనే, కాకతీయుల శత్రువులైన పాండ్యులతో చేరాడు. ఫలితంగా కాకతీయులు మరోసారి నెల్లూరుమీదికి దండెత్తి రాజగండగోపాలుడితో, అతనికిసాయం వచ్చిన పాండ్యులతో పోరాడవలసి వచ్చింది. కాకతీయ సైన్యాలు గుంటూరుజిల్లా నరసారావుపేట ప్రాంతాన్ని పాలిస్తూవున్న కాకతీయుల సామంతుడు తెలుగుచోళుడు అయిన మనుమగండ గోపాలుని (పైన చెప్పిన వానికంటె భిన్నుడు) నాయకత్వంలో నెల్లూరుమీద దాడిచేశాయి; రాజగండగోపాలుడు, పాండ్యులు వారిని గట్టిగా ఎదుర్కొన్నారు. మనుమగండగోపాలుడు తన నరసారావుపేట శాసనంలో వహించిన 'ద్రావిడబలవార్ధి పరిమథన బడబానల' 'రాజగండగోపాల విహితాహిత మానభంగ' బిరుదాలు, రాజగండగోపాలుడి ఓటమిని సూచిస్తాయి (50).

1310 లో అల్లాఉద్దీన్ ఖాల్జీసైన్యాలు, మాలిక్ కాఫర్ నాయకత్వాన వరంగల్లుమీద పడి ప్రతాపరుద్రుణ్ణి ఓడించాయి. ఇదే వీలుగా, నెల్లూరు పాలకుడు రంగనాథుడు తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొన్నాడు. ముస్లిం సైన్యాలు మరలిన తర్వాత తిరుగుబాటు చేసిన గండికోట పాలకుడు కాయస్థ మల్లిదేవుణ్ణి, నెల్లూరు చోడ రంగనాథుణ్ణి శిక్షించడానికి ప్రతాపరుద్రుడు జుట్టయలెంక గొంకయరెడ్డి నాయకత్వాన సైన్యాలను పంపించాడు. గొంకయరెడ్డి గండికోటను ఆక్రమించి, నెల్లూరువైపు సైన్యాలను నడపడానికి ఉద్యుక్తపడుతుండగా, అతడు సైన్యాలను, ఢిల్లీసుల్తాన్ సైన్యాలతో, సుందర పాండ్యునికి సహాయంగా, పాండ్యుల రాజ్యాన్ని ఆక్రమించిన కేరళరాజు రవివర్మను ఎదిరించడానికి నడపవలసిందిగా 1311 లో ఢిల్లీనుంచి ఆదేశం వచ్చింది. ప్రతాపరుద్రుడు ఈ ఆదేశంతో స్వామికార్యం స్వకార్యం సాధించవచ్చునను కొన్నాడు. సుల్తాన్ సైన్యాలతో చేరిన తనసైన్యాలు, ద్రావిడమండలానికి సాగిపోయేముందు, దారిలో నెల్లూరు చోడ రంగనాథుణ్ణి శిక్షించ వలసిందిగా, సైన్యాధిపతి ముప్పిడి నాయకుణ్ణి ఆదేశించాడు. ముప్పిడి నాయకుడి కొడుకు పెద్దరుద్రుడి క్రింద కాకతీయ సైన్యాలు నెల్లూరికి నడచి రంగనాథుణ్ణి ఓడించి, పారద్రోలాయి. నెల్లూరు రాజ్యాన్ని ప్రతాపరుద్రుడు ముప్పిడి నాయకుడికి దత్తం చేశాడు. ఇంతటితో నెల్లూరు చోళరాజ్యం అస్తమించిపోయింది. ముప్పిడి నాయకుడి శాసనాలు, నెల్లూరు పట్టణంలో, కందుకూరు తాలూకా వేంపాడులో, ఆత్మకూరుతాలూకా శ్రీకొలనులోను లభ్యమయినాయి (51).

నెల్లూరు తెలుగు చోడుల పాలనాక్రమాన్ని తెల్పే చాటు వొకటుంది.

"ధీరుడై ధరయేలెఁ దిరుకాళ దేవుండు
తిక్కనాయకుడేలెఁ దేజమెసఁగ
మన్మసిద్ధయేలె మహిమతో దీపించి
దాడినాగనయేలె ధర్మరీతి
మనుమగండ గోపాల మనుజాధిపతియేలె
స్వర్ణదేవుండతి ప్రబలగనేలె
గోపినాధుండేలె గుణపయోరాశియై
రమణతో శ్రీరంగ రమణుఁడేలె
తిక్కనయు మఱియొక కొన్నిదినములేలె
నేలె మీతండ్రి మర్యాదలెల్లఁ గలుగఁ
గడఁగ నీవేలి తండ్రికంటె మించి
శరధిగంభీర! సంగమ జ్మాతలేంద్ర!
(చాటుపద్య మణిమంజరి. పు. 28)

## రెడ్డి ప్రభువులు

1323 లో ఉలుఘ్‌ఖాన్ అనబడే మహమ్మద్-బిన్-తుఘ్లక్ వరంగల్‌పై దాడిచేసి ప్రతాపరుద్రుణ్ణి పట్టుకోవడంతో, కాకతీయ ఆంధ్రసామ్రాజ్యం అస్తమించిపోయింది. మిగిలిన దక్షిణ భారత దేశంతోపాటు ఆంధ్రావని ముస్లిముల హస్తగతమై పోయింది. కాని ఆంధ్రులు ఈ దాస్యాన్ని చాలా కాలం సహించలేదు. ఆంధ్ర సురత్రాణ, ఆంధ్ర దేశాధీశ్వర బిరుదాంకితుడైన ముసునూరి కాపయ నాయకుని నాయకత్వం క్రింద, రేచర్ల వెలమల, రెడ్డిప్రభువుల, హొయసలుల, ఆనెగొందె రాయల సహకారంతో క్రీ. శ. 1337 నాటికి ఆంధ్రదేశానికి ముస్లిం రాక్షస పాలననుండి విముక్తి కలిగింది (52). ఈ స్వాతంత్ర్యోద్యమ కర్తలు స్వతంత్ర హిందూ రాజ్యాలను స్థాపించారు గోదావరి, పెన్న నదుల గల తీరాంధ్రాన్ని వరుసగా అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రి రాజధానులుగా 1324 నుండి 1424 వరకు నూరేళ్లపాటు రెడ్డిరాజులు పాలించారు. 1336 లో హరిహర, బుక్కలు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. తెలంగాణాలో రాజకొండ రాజధానిగా రేచర్ల వెలమలు తమ రాజ్యాన్ని స్థాపించారు. గోదావరికి ఎగువనగల కళింగాంధ్రాన్ని తూర్పు గాంగరాజులు పరిపాలిస్తూ ఉండినారు.

రెడ్డిప్రభువుల జన్మస్థలము నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాలోని దువ్వూరు, గండవరము లైనా, వారి రాజ్యంలో నెల్లూరుగాని, నెల్లూరు మండలంగాని చాలాకాలం నిలచినట్లు కనపడదు. కడప, నెల్లూరు జిల్లాలోని రెడ్డిరాజుల పూర్వీకులు తెలుగుచోడులక్రింద రాజోద్యోగులుగా, ఎక్కువమంది సైన్యాధిపతులుగా వున్నట్లు కనపడుతుంది. రెడ్డిరాజులలో మొదటివాడైన ప్రోలయ వేమారెడ్డి శాసనాలు కందుకూరు తాలూకాకు దక్షిణంగా కనపడవు. కాని నెల్లూరు మండలానికి ముస్లింపాలన నుండి విముక్తి కలిగించినవాడు ప్రోలయ వేమారెడ్డే (1324-1353). నెల్లూరికో అతనికి దగ్గరసంబంధ

48. South Indian Inscriptions, X. 479 Annual Report,179 of 1905
49. Nellore District Inscriptions, Nellore 71, 62, 60, 74.
50. South Indian Inscriptions, IV. 661.
51. Nellore Distriet Inscriptions, Nellore 80, Kandukur 84, Atmakur 56.
52. "అని తల్లి కలువచేరు శాసనము", భారతి 1944 జూన్, జులై. విలసతామ్ర శాసనము, భారతి, 1942, మార్చి.

బాంధవ్యాలు వున్నాయి. అది అతని మాతామహుల ఊరు. వేమయతల్లి అనంతమ్మ. అనంతమ్మ తండ్రి దొడ్డారెడ్డి విక్రమసింహపురీయుడు. 'ఉద్ధట్టి రిపుబల తక్షాకమట్ట' బిరుదాంకితుడు (53). ఆయనకు అనంతమ్మ స్కందనగ ప్రసాదం వల్ల జనించింది. అనవేమారెడ్డి (1364-1386) మంత్రి పెద్దన. పెద్దన తాతగారు బిబిపెద్దన ప్రోలయ వేమారెడ్డి కాలం (1324-53) లో "విక్రమ సింహపుర అధ్యాసి" గా, అంటే నెల్లూరు పాలకుడుగా వుండేవాడని శ్రీనాథుడు చెప్తాడు (54) ఈ సందర్భాన్నిబట్టి కందుకూరు తాలూకాకు ఇవతలి నెల్లూరు మండలం, నెల్లూరు నగరం, రెడ్ల ఏలుబడిలో ఉండేవంటే, ఒక ఇరవైఏండ్లపాటు ఉండివుండాలి. తరువాత వారి చేయిజారి, నెల్లూరు నగరం, నెల్లూరుమండలం విజయనగర సామ్రాజ్యంలో ఒకభాగమైన ఉదయగిరి రాజ్యాంలో అంతర్భాగాలుగా నిలిచిపోయాయి. రెడ్లకాలంనుంచి నెల్లూరు రాజ్యరాజధానిగావున్న గౌరవాన్ని కోల్పోయినా, రాజకీయప్రాముఖ్యాన్ని, గొప్ప వ్యాపారకేంద్రంగా ప్రసిద్ధిని కోల్పోలేదు. దీనికికారణం అది ఉత్తర, దక్షిణభారతాలనుకలిపే ప్రధాన రాజమార్గంపై ఉండి, కృష్ణాపట్నం రేవు పట్టణంగా గొప్ప వ్యాపారకేంద్రంగా వుండడమే. అందువలనే కేతన తన ఆంధ్రభాషా భూషణంలో కంచినుండి అయోధ్యకుగలమార్గం తెలుపుతూ,

"కంచి నెల్లూరు మఱి యోరుగల్లయోధ్య
యను పురంబులపై గంగకరుగుచునిన
పగిది నొక్కత్రోవజూపెన...." (పద్యం 12)

అంటాడు. కుమరగిరి రెడ్డికాలంలో దేశ, విదేశాలతో సుగంధ ద్రవ్యాలలో భారీ వ్యాపారం కొనసాగించిన అవచి తిప్పయ్యసెట్టి (55) సోదరుల తండ్రి అవచి దేవయ "రెడ్డివేమ జగతీపతికిఁ బ్రాణమైన"వాడు (56). దేవయతండ్రి పావాణిసెట్టి, "సింహ విక్రమ పట్టణశ్రేష్ఠుడైన సెట్టి జగజెట్టి" (57). శ్రీనాథుడు అవచి తిప్పయసెట్టి బాల్య సఖుడుగా నెల్లూరులో కొంతకాలం గడిపాడు (58).

## విజయనగర సామ్రాజ్యం

క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్య స్థాపన జరిగింది. ఈ రాజ్యస్థాపన గావించిన హరిహర, బుక్కరాయుల పూర్వీకులు నెల్లూరు మండలంలో కొన్ని ప్రాంతాలు, కాకతీయుల సామంతులుగా నెల్లూరు పాలిస్తున్నట్లు తెలుస్తుంది. కనిగిరి తాలూకా గొజ్జలవీడులో లభ్యమైన శాసనం హరిహర, బుక్కరాయుల తాత బుక్కరాయవొడయలు ఆ ప్రాంతానికి అధిపతిగా వున్నట్లు సూచిస్తుంది (59). ఈ బుక్కరాయవొడయలు అతని కొడుకు సంగమరాయలు అనగా హరిహర, బుక్కలతండ్రి, నెల్లూరుపాలించినట్లు పైకనబడిన చాటువులోని

"నేలె మీ తండ్రి మర్యాద లెల్లఁగలుగఁ
గరఁగ నీనేలి తంగఱు కంటె మించి
శరధి గంభీర! సంగమక్ష్మాతలేంద్ర!" (60)

అనే పాదాలు సూచిస్తాయి.

క్రీ. శ. 1340 నాటికి హరిహరుడు పూర్వ పశ్చిమ సముద్రాధీశ్వర బిరుదాన్ని వేసుకొన్నాడు. 1346 నాటికి విజయనగరరాజుల, అధికారుల శాసనాలు కోవూరు, కావలి, ఉదయగిరి తాలూకాల్లో కనబడతాయి. నెల్లూరు జిల్లాలోని మొదటి విజయనగర శాసనం క్రీ. శ. 1343 (శక. 1265) నాటి, బుక్కరాయుల కొడుకు విరుపణ్ణ ఒడయరుది (61). అటు తర్వాతది, హరిహరుని తమ్ముడు కంపణ ఒడయరు శ. 1268 శక క్రీ. శ. 1346-47 నాటి కొడవలూరు శాసనం (62) ఈ శాసనం ఆనాటికి నెల్లూరు మండలాన్ని, ఉదయగిరి రాజధానిగా కంపణ పరిపాలిస్తున్నట్లు తెలుపుతుంది. విజయనగర ప్రభువులు తాము గెలిచిన ఈ తూర్పు ప్రాంతానికంతా ఉదయగిరిని కేంద్రంచేసి, ఆ గిరి దుర్గాన్ని బలిష్టం చేశారు. అందువలనే, నెల్లూరుజిల్లాలోని విజయనగర శాసనాలు, "రాయసింహాసనానికి మొదలిదుర్గమైన ఉదయగిరి" అని ఉదయగిరి ప్రాముఖ్యాన్ని పేర్కొన్నాయి (63). కాని తూర్పు నాటికంతా నెల్లూరు సింహద్వారం లాంటిది; రాజకీయానికి, వ్యాపారానికి కూడలి; దాని నడిబొడ్డున కందుకూరు ఉంది. అందువల్లనే, ఒక చాటువు

"ఉదయగిరి రాజ్యలక్ష్మికి
సదనము నెల్లూరు యట్టి సాధ్వీమణికిఁ
వదనంబు కందుకూరగు
పదయుగళం బాత్మకూరు బట్టేపాడుఁ"

అని చెప్తుంది.

## గాంగులు - గజపతులు

కొండవీటి రెడ్డిరాజులలో చివరివాడు రాచవేమారెడ్డి (1420-1424) అసమర్థుడు. అతనికాలంలో అరాచక పరిస్థితులను ఆసరాగా తీసుకొని గజపతి సింహాసనస్థుడైన లాంగూల గజపతి అనబడే నాల్గవ భానుదేవుడు "కటకము మొదలుకొని ఉదయగిరి పర్యంతమున్న గిరిదుర్గ స్థలములు ఆక్రమించి. శ. 342 శకము లగాయతు శ. 1353 శకము వరకు 12 సంవత్సరములు" ప్రభుత్వం చేశాడని కొండవీటి కైఫీయతు చెప్తుంది (64) అప్పట్లో విజయనగర చక్రవర్తి ఇమ్మడి దేవరాయలు (1422-1446) బహమని సుల్తానులతో పోరుచుండుటచే, ఈ గజపతి దండయాత్రను అరికట్టుట సాధ్యమైనదికాదు. కాని, కైఫీయతు నందు చెప్పినట్లు, లాంగూల గజపతి ఏలుబడి 12 ఏండ్లుకాదు; ఐదు ఏండ్లుమాత్రమే. క్రీ. శ. 1424 సంవత్సరంలో రాయ రాణువ, ఉదయగిరిని లోగొని, ఉదయగిరి నుండి సింహాచలందాకావుండే తీరాంధ్రాన్ని జయించినది. ఇమ్మడి దేవరాయల సామంతుడుగా ఉదయగిరి రాజ్యంలోని పొదిలె సీమను పాలిస్తున్న సాంవరాయని తెలుంగ రాయల శాసనం, 1426-27 నాటిది పొదిలి తాలూకా కూచపూడిలో వుండడం ఈ విషయాన్ని దృఢపరుస్తుంది.

క్రీ. శ. 1434 లో కపిలేశ్వర గజపతి (1434-68) అర్వాచీన తూర్పు గాంగరాజు నాల్గవ భాను

53. వేమభూపాలచరితం, III. 97
54. శృంగారనైషధం, I. V. 22
55. హరవిలాసం, పీఠిక 7
56. అదే — పీఠిక 18
57. అదే — పీఠిక 17
58. అదే — పీఠిక 30
59. Nellore District Inscriptions, Kanigiri 7; Venkataramayya —Vijayanagar Origin of the city and the Empire
60. చూడు 35 పేజీ.
61. Mackenzie Manuscripts, No. 15-4-17
62. Nellore District Inscriptions: Nellore 28
63. అదే, కనిగిరి 30; కందుకూరు 77
64. మద్దులపల్లి గురుబ్రహ్మ శర్మ: కొండవీటి సామ్రాజ్యము, పు. 90: కొండవీడు కైఫీయతు, పు. 10-11

దేవళ్ల సింహాసన భ్రష్టుణ్ణి గావించి, సూర్యవంశ గజపతి వంశాన్ని స్థాపించాడు; ఇతడు 1454 నాటికి విజయనగర సామ్రాజ్యాంతర్భాగమైన కొండవీటిరాజ్యాన్ని సాధించి, కొండవీడు, వినుకొండ, అద్దంకి మొదలైన దుర్గాలు హస్తగతం చేసుకొన్నాడు. అప్పటి విజయనగర చక్రవర్తి మల్లికార్జున రాయలు సత్త్వహీనుడు; 1463లో కపిలేశ్వర గజపతి మనుమడు, హంవీర గజపతి కొడుకు కుమార కపిలేశ్వరుని నాయకత్వంక్రింద ఒడ్డెసైన్యాలు, ఉదయగిరి, చంద్రగిరి, పడైవీడు, కంచి, వలుదలంపట్టు, తిరువారూరు, తిరుచినాపల్లి మొదలగు దుర్గాలను అవ్యాహతంగా జయించారు. ద్రావిడదేశంలో జయించిన దుర్గాలు రాష్ట్రము వెంటనే రాయలకు స్వాధీనపడినవి. ఉదయగిరి దుర్గం మాత్రం. గజపతుల అధీనంలో నిలిచిపోయింది. కపిలేశ్వర గజపతి తర్వాత పురుషోత్తమ గజపతి 1468 లో రాజ్యానికివచ్చి 1497దాకా పాలించాడు. ఇతడు సింహాసనానికై, ఇతని సోదరుడు హంవీరునితో పోరాడవలసి వచ్చింది. ఈ గజపతి అంతఃకలహాలు వీలుగా, 1469లో అప్పటిలో చంద్రగిరి పాలకుడుగనున్న సాళువ నరసింహుడు ఒడ్డె దళముల నెదిర్చి ఉదయగిరి దుర్గాన్ని స్వాధీనం చేసుకొన్నాడు. 1476 నాటికి అతడు మచిలీపట్నం వరకు గల తీరాంధ్రభూమిని లోగొన్నాడు. సోదరునితో కలహమేర్పడిన పురుషోత్తమ గజపతి 1476 నాటికి కాని తన అధికారం నిలద్రొక్కుకోలేకపోయాడు. 1484 నాటికి అతడు కొండవీడు వరకు తిరిగి గెలుచుకొని, 1489 లో ఉదయగిరిని ముట్టడించాడు. అంతవరకు చంద్రగిరి పాలకుడుగనున్న సాళువ నరసింహరాయలు, 1485 లో రాయ సింహాసనమెక్కాడు. నరసింహరాయలు ఈ ఉత్కళ దండయాత్రను స్వయంగా ఎదుర్కొన్నట్టున్నది. సాళువ నరసింహుడు పురుషోత్తముని చేజిక్కి బందీకృతుడయ్యాడు; ఉదయగిరి దుర్గాన్ని పురుషోత్తమ గజపతికి సమర్పించి విడుదల పొందవలసివచ్చింది (65). పురుషోత్తముడు పూసపాటి బసవ భూపాలుణ్ణి తన ప్రతినిధిగా ఉదయగిరియందు నిల్పాడు (66). కొండవీడు, ఉదయగిరి దుర్గాలను గెలుపుకోలేక పోయాననే దిగులుతో నరసింహరాయలు 1490 లో మరణించాడు. ఉదయగిరి దుర్గం, దానికి సంబంధించిన రాజ్యము, ప్రతాపరుద్ర గజపతి (1497-1538) కి పురుషోత్తముని నుండి సంక్రమించింది.

తీరాంధ్రమునకు దక్షిణ ద్వారమని చెప్పదగ్గది ఉదయగిరి దుర్గము. 1509లో విజయనగర వజ్రసింహాసనాన్నధిష్ఠించిన కృష్ణదేవరాయలు, పట్టుబట్టి 1513 లో ఉదయగిరి దుర్గాన్ని గజపతులనుండి తిరిగి గెల్చుకొన్నాడు. కృష్ణరాయల ముట్టడి 18 నెలలు జరిగినదని, కోటలోనికి ఒకే సన్నని ప్రవేశమార్గముండినదని, రాయలు బండలను కొండలను పిండిచేసి తన సైనికులు ప్రవేశించుటకు మార్గాలు ఏర్పరిచాడని న్యూనిజ్ చెప్తాడు (67). అప్పుడక్కడ దుర్గసంరక్షకుడుగా మన్న ప్రతాపరుద్ర గజపతి పినతండ్రి తిరుమల రాహుత్తరాయలు కృష్ణరాయల శరణుజొచ్చి లొంగిపోయాడు. కృష్ణరాయలు ఉదయగిరి విజయాన్ని సగర్వంగా 'ఆముక్తమాల్యద'లో ఇట్లా చెప్పుకొన్నాడు.

"ఇది కర్ణాట ధరాధృతి
స్థిరభుజా హేలాకలబ్ధేశ్వరా
డుదయోర్వీధర తత్ప్రిత్ప
వ్యకృత నవ్యోపాయనోష్ణీష ర
త్న దృఢంచత్పత కృష్ణరా
య వసుధాధ్యక్షోదితా ముక్తమా
ల్యద నాశ్వాసము హృద్య ప
ద్యముల నాద్యంబై మహింబొల్పగుణ్".

కృష్ణదేవరాయల పూర్వదిగ్విజయాన్ని తెల్పే శాసనాలు ఉదయగిరి దుర్గంపైన నాలుగు కలవు (68)

ఎడనెడ చేయిజారినను, అరవీటి వంశజులలో చివరివాడైన మూడవ శ్రీరంగదేవరాయల కాలం (క్రీ. శ. 1642–1678?) లో గోలకొండ కుతుబ్ షాహిల సేనానాయకుడు మీర్‌జుమ్లా 1645 లో ఉదయగిరి దుర్గము నాక్రమించువరకు, ఉదయగిరి దుర్గం, నెల్లూరు మండలం విజయనగర పాలనలోనే ఉన్నట్లు చెప్పవచ్చును. నెల్లూరులో, రంగనాయకస్వామివారి తిరునాళ్లలో పంచాహాణం వారి మర్యాదలనుగూర్చి కాపు, కరణాల సమక్షంలో చేసిన కట్టడను తెలిపే మొదటి శ్రీరంగరాయల (1573–74) శాసనం ఉంది (68ఎ).

## నెల్లూరు తిరుతెన్నులు

నెల్లూరు రంగనాయకస్వామి దేవళంలో 12, 13, 14, 15, 16, శతాబ్దాల శాసనాలు ఉన్నాయి. ఈ శాసనాల్లో ఉన్న సమాచారాన్నిబట్టి నాటి నెల్లూరు తిరుతెన్నులు కొంత అర్థంచేసుకోవచ్చు. నాటి నెల్లూరు, చెరువునానుకొని దర్గామిట్ట, మూలాపేట, రంగనాయకుల పేటలకు పరిమితమయినట్లు కనపడుతుంది. రంగనాయకస్వామి దేవళంలోకాక, పెద్దమసీదు దగ్గర, కాపువీధిలో, చిన్నబజారులో, దర్గామిట్టలో, ఇరుగాలమ్మ దేవళంలో, కలెక్టర్ కచేరిలో కొన్ని శాసనాలు లభించాయి. రంగనాయకస్వామి దేవళంలో చోళులనాటి, వారి సామంతులుగా వున్న తెలుగు చోడులనాటి తమిళశాసనాలు 25 దాకా ఉన్నాయి. వీటిలో సగం మూడవ కులోత్తుంగుడి కాలం (1178-1226) నాటివి (69). ఈ శాసనాల్లో అంతా నెల్లూరు "జయంగొండ చోళమండలంలోని చేడికుల మాణిక్కవలనాటి యందలి పడైనాటి విక్రమసింహపురమను నెల్లూరు" అని పేర్కొనబడ్డది. నేటి రంగనాయకుల పేటను 'తిరుప్పాడ్ కడల్' (పాలకడలి) అని దేవళాన్ని 'చిత్రమేలి విణ్ణగర్' అని, దేవుణ్ణి 'పళ్ళికొండ పెరుమాళ్' అని శాసనాలు పేర్కొంటాయి. హరిహర రాయల (రెండవ) నాటి (1400-01) ఒక తమిళ శాసనంలో ఈ దేవుడు 'శయనరాయన పెరుమాళ్ళు' అని చెప్పబడ్డాడు. సుందరపాండ్యుని నాటి ఒక తమిళశాసనం, దేవళంలో 'సుందరపాండ్యతంది' అని ఆ రాజుపేరట ఒకమండపం కట్టి, అక్కడి నిత్యోత్సవాలకు మోడేగుంటలో కొంత భూమిని దానంచేసినట్లు తెలుపుతుంది. క్రీ. శ. 1400 నాటికి ఊరికి, దేవళానికి మధ్య పెన్నానది పారుతుండేది. నాటివాడైన జక్కన తన విక్రమార్క చరిత్ర, ఏడవ ఆశ్వాసంలో, నెల్లూరును, పెన్నను రెండు పద్యాల్లో వర్ణిస్తూ, పినాకిని, 'పట్టణాంతర సీమ' యందు ఉందని చెప్పాడు. అందుకే 'పెన్నదాటితే పెరుమాళ్ళ' సేవ అనే నానుడి ఏర్పడ్డది.

---

65. సరస్వతీ విలాసం

66. ప్రబోధ చంద్రోదయం బసవ భూపాలుడిని గూర్చి "గజపతి సురథాణి గడిదుర్గములకెల్ల నేరాజు వజ్రాపు బోరుతలుపు" – అని చెప్తుంది.

67. Forgotten Empire

68. Nellore District Inscriptions, Udayagiri, 37, 38, 40, 41

68ఎ అదే, Nellore 54

69. సూచిక 19 క్రింద చూచేది.

## చిత్రమేళి విణ్ణగర్

ఈ రంగనాయకుల దేవళాన్ని నిర్మించినవారు నెల్లూరు కాపువారని పై పదం సూచిస్తుంది. మధ్యయుగంలో ప్రతి వృత్తి వారు సంఘంతో తమ హక్కులు సాధించుకొని నిలబెట్టుకోడానికి, స్వము యొడల ప్రభుత్వం యొడల తమ బాధ్యతలు నిర్వర్తించడానికి ఒక వృత్తి సమయం (Guild) గా ఏర్పడేవారు. వ్యవసాయం వృత్తిగా కలవారందరు (వారి కులంతో నిమిత్తంలేకుండా) ఏర్పరచుకున్న సమయాన్ని తెలుగులో 'కాంపులు' అరవంలో "చిత్రమేళి" అనే సాంకేతిక నామంతో పిలిచేవారు. ఈ సమయాలకంతా వారి వారి వృత్తులను, ఘనతలను ప్రతిబింబించే ప్రశస్తులు దేం. చిత్రమేళి ప్రశస్తి ఇట్లా ఉంది- "శ్రీమతు భూమి పుత్రాణాం శ్రీమద్గోక్షీర జీవినాం సర్వలోక హితాన్ న్యాయం చిత్రమేళస్య శాసనం జీయతాం. ఏతత్ పాలనం రాష్ట్రపోషణమ్ శాసనమ్ భూమి పుత్రాణామ్ చాతుర్వర్ణ కులోద్భవమ్" (70). ఇక్కడ "చాతుర్వర్ణ" అనే పదానికి నాలుగు వర్ణాలనుండి, నాల్గవ వర్ణంనుండి అని పండితులు వివిధంగా అర్థాలు తీశారు. అది ఏమైనా, ఈ "చిత్రమేళి" లేక "కా(ం)పులు" సమయం నిర్మించింది కాబట్టే రంగనాయకుని దేవళం శాసనాల్లో 'చిత్రమేళి విణ్ణగర్' (చిత్రమేళి విష్ణు దేవళం) అని పేర్కొనబడ్డది. ఇచట దొరికిన తొలి శాసనాలు 12వ శతాబ్దివిగా ఉండుటచే, ఈ దేవళం చోళుల ప్రాభవంలోనికి వచ్చిన తర్వాత, అంటే క్రీ. శ. 1000 తర్వాత నిర్మించబడి వుండవచ్చునని ఊహ. జయగొండ చోళమండలంలోని అనేక నాడుల "కాంపులు" కలసి, క్రీ. శ. 1197-98 లో 'తిరుప్పార్ కడల్ చిత్రమేళి విణ్ణగర్' (రంగనాయకులపేట చిత్రమేళి విష్ణ్వాలయం) లోని తమ 'సమయ' సమావేశ స్థలమైన 'చిత్రమేళి మండపం'లో సమావేశమై 2200 కుళి (భూవిస్తీర్ణం) భూమిని అకరంగా దేవుడికి దానంచేశారు. ఆ దాన శాసనం క్రింద వివిధ 'కాంపు'సమయాలనాయకులు చేవ్రాళ్ళు చేశారు(71). రంగనాయకుల దేవళంలో లభ్యమైన శాసనాల్లో ఇదే కాలక్రమంలో మొదటిదిగా కనపడ్తుంది. ఆరోజుల్లో ప్రతివృత్తి సమయం తమ సమయం పేరట దేవళ్లను నెలకొల్పేవారు.

## సాలేశ్వర-అగసాలేశ్వర

నెల్లూరు పట్టణంలో దొరికినశాసనాల్లో సాలేశ్వర, అగసాలేశ్వర (72) దేవుళ్ళు చెప్పబడ్డారు. ఈదేవళాలు దర్గామిట్టగో, చెరువొడ్డున, ఇప్పటి గోరీలమిట్ట ప్రాంతంలో ఉండిఉండవచ్చు. ఇరుకాలమ్మ గుడిలోని ఒక శాసనం సాలేశ్వరుణ్ణి పేర్కొంది.

## నగరేశ్వరుడు

వర్తక సమయాలను (Trade Guilds) "నగర"మనే సాంకేతిక నామంతో పిలిచేవారు. నెల్లూరులో ఒకనగరేశ్వరస్వామి ఉండేవాడు(73)

## మనుమసిద్ధేశ్వర-మనుమకేశవ

'మనుమ' నామాంకితులైన తెలుగుచోడరాజులు తమపేర నెల్లూరులో 'మనుమసిద్ధేశ్వర' 'మనుమకేశవ' దేవాలయాలను నిర్మించి, వానికి అనేక దానధర్మాలుగావించినటు శాసనాలుచెప్తాయి (74). ఇవి మూలపేట, చిన్నబజారులమధ్య ఉండివుండవచ్చు. నెల్లూరుకు తూర్పునవున్న కృష్ణాపట్నంలో మనుమసిద్ధేశ్వర, (గండ) గోపాల ఆలయాలు ఉన్నాయి.

## ఇరుకాలమ్మ

నెల్లూరు చెరువు ఒడ్డునవుండే నెల్లూరు గ్రామదేవత ఇరుగాలమ్మ దేవళం కూడా చాలాపురాతనం. "సర్వాచెరువు" అనబడే నెల్లూరు చెరువును కాకతీయ గణపతి నిర్మించాడని ప్రతాపచరిత్ర తెలుపుతుంది. కాకతీయ సేనానులు ముప్పడినాయకునికి, అతనికొడుకు పెద్దరుద్రుడికి పుణ్యంగా, "నెల్లూరు భూమికి నెల మూఁడు వర్షములు కురవఁ ధనకనక సమృద్ధిగానున్న", వారి భృత్యులు "ఇరుకలా పరమేశ్వరికి" కొన్ని దానధర్మాలు చేశారు (75).

విజయనగర సామ్రాజ్య ప్రతినిధిగా ఉదయగిరిని పాలిస్తున్న సావణ్ణ ఒడయలు కాలంలో (1364-65) అధికారి కాంచణంగారం అనే ఆయన ప్రతి శుక్రవారం సంత ఏర్పాటుచేసి, సంతలో "నానాదేశి పెక్కండ్రు" వర్తకులనుండి వసూలయ్యే వర్తకసుంకాలను "యిరుకలా పరమేశ్వరి" అంగరంగ భోగాలకు ఇచ్చేటట్లు కట్టడిచేశాడు (76).

## నాగేశ్వరస్వామి

రెండు శాసనాలు నాగేశ్వరస్వామి దేవళాన్ని పేర్కొంటాయి (77). ఈ దేవళాలన్నీ అసహన పూరితమైన తురుష్కపాలనలో ధ్వంసంకాబింపబడ్డాయి. దర్గామిట్టలోని గోరీలలో, నెల్లూరు పెద్ద మసీదులో ఈ శాసనాల్లో కొన్ని దొరకడమే దీనికి ప్రమాణం.

## హరిహరనాథుడు

పోగా మిగిలిన, నేటికిదొరికిన శాసనాల్లోనుంచి, ఇన్నిదేవళాల, దేవుళ్ళ పేర్లు బయటపడినా హరిహరనాథుడిపేరుగాని, అతని దేవళంగాని ఎక్కడా పేర్కొనబడలేదు. తిక్కనకు దశకుమార చరిత్ర అంకితం చేసిన కేతన, ఆపుస్తకంలో ఒకపద్యంలో గావించిన నెల్లూరు పురవర్ణనలో, హరిహరనాథ ప్రసక్తిలేదు. తిక్కనకు నూరేళ్ళ తర్వాత ఉన్నవాడైన జక్కన విక్రమార్క చరిత్రలో చేసిన నెల్లూరు పురవర్ణనలో హరిహరనాథ ప్రసక్తిలేదు. వేటూరు ప్రభాకరశాస్త్రిగారు 'చాటు పద్యమణిమంజరి'లో సేకరించిన నెల్లూరు పుర వర్ణనను తెలిపే చాటువుల్లో ఈ దేవుడు కనపడడు. వీటన్నిటిబట్టి చూస్తే నెల్లూరులో హరిహరనాథ దేవాలయం వున్నట్లు కనపడదు. కావున హరిహరనాథుడు "ధర్మాద్వైతస్థితి" నందిన తిక్కన స్వప్నమున కాంచిన

"సురనదియు గాళిందియు వెరసినట్టి
కాంతిపుంజము శోభిల్లు కాంతమూర్తి
నామనంబు నానందమగ్నముగఁజేయ
నెలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు"

మాత్రమే.

---

70. Nellore District Inscriptions, Nellore 55; South Indian Inscriptions VII, 129
71. Nellore District Inscriptions,
72. „ Nellore 81, Nellore 51, 50
73. „ Nellore 82
74. „ Nellore 91, 88, 87, 85; 83
75. „ Nellore 80
76. „ Nellore 78
77. „ Nellore 94, 51.

# శకుంతల - దుష్యంతుడు

★★★ శివారెడ్డి ★★★

విన్నారు భారతము మా
అన్నయ్యలు మీరు, దాన్ని ఆధారముగా
ఎన్నో మార్పులు, కూర్పులు,
కొన్నిటి వదిలేశ కథను క్లుప్తముచేశా.

ఎవరీ బంగరుబొమ్మ
నవలారత్నమ్ము, అవర నందనవరమీ
జవరాలు, మాలతీలత,
నవనీతపుముద్ద దోచె నా హృదయమ్మునా.

అందాలబరిణ, పుష్ప మ
రందము, వయ్యారిభామ, రాజ్యలక్ష్మి, యిం
దిందిర సన్నిభకుంతల,
కుందరదన యీ యపూర్వ కోమలి యెవతో!

ఏమి కన్గవ సోయగ
మేమి నెన్నడలతీరు, యిది నిర్జర క
న్యామణియొ, కిన్నెర గజ
గామినియొ యిట్టిదాని గననెచ్చోటనా.

కన్నవారెవరొ చిన్నారి పొన్నారి
చిన్నదాని పల్లెసీమ యేదో
అడిగి తెలుసుకుంటు అందాక చిత్తమ్ము
కుదుటబడదు నేను కోలుకోను.

కఠినమైన శిలలు కరిగి నీరైపోవు,
మోసులెత్తు యెండుమ్రోళ్ళు, కవుల
కలము పరుగులెత్తు కలకండ గురిపించు
కన్నెచిన్న పైరుగాలి సోక!

ఎవరమ్మాయివి? యీవన
మెవరిది? నీనామధేయ మెయ్యది? మా క
న్గవ ధన్యమాయె కన్గన
వివరింపవె నీ చరిత్ర విశదముగాగా.

వేటాడి అలసివచ్చితి,
కోటీ యిచ్చోట గలదె భోజనహోటల్?
లోటాకాఫీ, టప్పన
వాటరు కేనోచుకోల వనమధ్యమునా.

అంటికంటెగొప్ప అతిథిసత్కారమ్ము
దానధర్మముల్లో దీనిమించి
నట్టి దేదిలేదు అని ధర్మశాస్త్రాలు
నొక్కివక్కణించు, తెచ్చి గుక్కెడుపు.

దూరదేశపోట్టి, దుష్యంతుడంటారు
నన్ను, పెళ్ళిగాలనాకు, నేను
తగిన మ్యారెజికొరకు తంటాలుబడుతుండ
ఘటియ వొరిధంగ గడపతుండ.

జ్యోతిష్కుడొకడు నా కుడి
చేతిలో రేఖల్నుజూచి సెప్పాడబ్బా
యీ! త్వరలో లౌమ్యారే
జై తీరద్దంచు, దానికై చూస్తుండా.

వారువీసు నాతో చేరానికొచ్చారు
వందలాది, నాకు యెందువల్లనో
మనసుబోల, ఎంతోమంది సంబంధాలు
త్రోసివుచ్చ, బ్రహ్మ రాసిపెట్ట!

కోడెప్రాయమొచ్చి కోడికూతకాక
పూరుకోదు తొడిమ వూడినాక
యెద్దెమద్దె మనసు అద్దాలలాగుద్ది
మాపురేపుఅట్టి వూపుతుంది.

అస్తిపాస్తివుంది, అద్దాలుమహలుంది,
మూలమూల డబ్బు మూల్గుతుంది,
కారగీసువుంది కాని లాభంలేదు
కలికి నీకుదెలుసు కారణమ్ము.

చదువుకున్నదైతె నవరబంగారమ్ము
లక్కబొమ్మ నాకు ముక్కుమొగమూ
వొక్కటుంటెచాలు తక్కింది యెట్లున్న
సర్దుకుంటు, వల్ల చక్కదనము.

కన్నె నాకునస్తె కట్నంతో పన్లేదు,
మాలి చూసరైతె మాకు కొలము
మతము అవసరంల, మర్యాద ముఖ్యమ్ము
అంతవరకె, నాది వింతతైపు.

ఊరుకుంటారు కొందరుబలాటపడుతారు
నూటుకొరకు, హేటుబూటుకొరకు
రిస్టువాచికొరకు దెష్టైన డ్రెష్టైన
పుస్తెగట్టుతారు పొయ్యి మెళ్ళో!

చాలమందిపిల్ల నీలాగెవ్వండేది
ఫేసు నోసు, నాకు క్లాసుమెట్టు
బియ్యె పాసైంది వీదింటి అమ్మాయి
ఎక్కడుందో యిప్పుడేమైందో!

కన్నవారులేరు కడతేరిపొయ్యారు
చిన్ననాడె దివికి చేరినారు
సకలమునకు నాదె సర్వాధికారమ్ము
మందెపెత్తనమ్ము మాటకంట!

చేదోయి కందిపోయెను
పూదోటకు నీరుపోసి ప్రొద్దొస్తము, నా
కేదో జాలేస్తుందీ
నీదువునికిజూస్తె గుండె నీరౌతుందీ!

మల్లెసౌరభంల, మొల్లసౌభాగ్యంల,
మావిచివురుటాకు మార్దవంల
కన్నుగవకుచిందు కైసేయు నీమేను
తాళగలదె యెండ తాపమునకు

చిందుచున్నవాన్ని, నీలేకప్రాయాన్ని
పైనపిల్లు, ద్రాక్షఫలరసాన్ని
మట్టిపాలుచేసి మడిగట్టికూర్చుంటె
పూరుకోదు కుర్రకారుజూస్తె

రంగులీను మేల్మిబంగారు సౌధాల్లో
తరిపివెన్నెలల్లో తమ్మిపూల
పానుపుల్లో సతము పవళించు కలహంసి
చెట్లపాలుచేసె చెనటిబ్రహ్మ!

తులసిపూసలేల, తూతూతు రుద్రాక్ష
పేరులేల, నారచీరలేల?
పెళ్ళిగాని ఆడపిల్లలీలాగుంటె
ముందుకెవరురారు ముట్టుకోరు!

ఆడుపుట్టువునకు అసలైనభాగ్యమ్ము
భూరిఖచిత రత్నభూషణమ్ము
మంగళప్రదమ్ము మాంగల్యమంటాను,
యివ్వబోరు దానికొవ్వబోరు

గాజులేసుకోరు నాజూకుగాదంచు,
వనువు బూసుకోరు, పైటసగము
రవికసగము, రానురాను నాగరికమ్ము
ముదరతుంది యిల్లో ముద్దియల్లో!

పట్టుగొమ్మలేక ప్రాకేదికష్టమ్ము
దుస్తరమ్ము మిగుల దుర్లభమ్ము
పువ్వుబోడి లతిక పురుషసంయోగమ్ము
అంటు స్త్రీకి ఎంతొ అవసరమ్ము

చదువు సాములున్న, సంస్కారమెంతున్న,
దాసిజనములున్న, ధనములున్న
యూతకర్త లేకనాతి జీవితయాత్ర
సాగబోదు, బ్రతికి సార్థకంః!

మగువకేల లేద మగవానికేగాని
పాతికేళ్ళకన్న పైనబడితె
పేడుగడితె పెళ్ళి పేటికి దిగుతుంది
ఆ గిరాకి కాస్త ఆగిపోద్ది!

పక్కనూటచెప్త వద్దంటె పొకవేళ
కాదనంటె నేను బాధపడ్డ
నిన్నురాణిజేస్త నిను పూంపూజిస్త
కోపలాగి నాదు కోర్కెదీర్చు

ముద్దుపెట్టమంటె ముఖము తిప్పిస్తావు
కౌగిలిమ్మనంటె కసురుతావు
ముట్టబోగరుబాస్తి ముఱికన్నెలకు మీకు
వాయిదేస్తె పోను వదులుకోను

రాచబిడ్డనొద్దు రమ్మంటె, కౌగింట
జేర్చమంటె, కోర్కె దీర్చమంటె
బెట్టుజూపుతావు నెట్టిపారేస్తావు
మంచిఛాన్సు పోతెమళ్ళిరాదు!

టైమయిందిగంట అమ్మాయి! పోవాలె
ప్రొద్దుబోతె దార్లొ పురుగుబుట్ర
సిగ్గదేల నన్ను చేపట్టు నెలవంక
దేనికింక లేనిపోనిశంక?

ఎత్తిపొడిచినాను ఏమేమొ అన్నాను
తప్పసైచు. రాను తడవ తడవ
అలుసుగలమైతె అదివేరెవిషయమ్ము
జన్మరెస్తు టైమువేస్టుజెయుతు

రాకమారు! నీతొ రాగూడదనిగాదు
నాకు నీపై ప్రేమ లేకగాదు
నిందమొయ్యలేక నీదాన్ని నువుబోతె
చెప్పు? నీకుయేమి పవ్వుతిమిడ!

ప్రాకులాడుతారు, పైపైనబడతారు
కోర్కెదీరినాక కొంపదీసి
పురుకుతారు మేముఱచ్చల్లోబడ్డాక,
మీమొగోళ్ళ దొంగస్వాములండి

మగవాడు వెంటబడితే
సిగమెక్కిబలాత్కరిస్తె సిగ్గువిడిస్తె
తెగబడితెపాపానికి
మొగబడితే అడమాసి ఎంతేస్తదిరా?

నొక్కిమోలిపంట, చెక్కిళ్ళముద్దాడి
విరుసుమరుసు విడిచిపుచ్చె,
ఆ శకుంతలమ్మ ఆ పైన అగచాట్లు
పడ్డపాట్లు నేనువలికెదెట్లు?

దొడ్డివార్నిబోతె దోషంల మగనాలు,
తాళిమెళ్ళో వుంటెచాలు, యెట్నొ
పడితెకాలుజారి పాపమ్మునేరమ్ము
కన్నెపిల్లకైతె కఠినశిక్ష!

తప్పుశకుంతలదంటే
చెప్పకోదు అడజాతి, పతియులదని నే
చెప్పి తప్పించుకుంటా,
యెవ్వడు యీలాగువుంట యెందుకుతంటా?

శృంగారమంటె కవులకు
బంగారము, యేటికొంత బారైనా, కో
నంగులకర్థముగాదె
సంగతి, చదువేరు వారిసభ్యత వేరూ!



## అర్మాగాన్‌నుంచి మదరాసుకు...

# మూడువందలయేళ్లనాటి విషాదగాథ

శ్రీ మలిరెడ్డి పట్టాభిరామరెడ్డి ఎం. ఎ.

పాశ్చాత్య వ్యాపార స్థావరాలవల్ల ఆధునిక భారతచరిత్రలో నెల్లూరుకు చారిత్రక ప్రాధాన్యం ఏర్పడింది. తూర్పుతీరంలోని పులికాట్, అర్మాగాన్ యూరప్ వర్తకుల అతిప్రాచీన స్థావరాలలో ప్రముఖమైనవి. డచ్చివాళ్ళు 1606 లోను, ఇంగ్లీషువాళ్ళు 1611 లోను మచిలీపట్నం చేరుకున్నారుకాని, గోల్కొండ అధికారుల క్రూరత్వమూ, దమననీతి వాళ్ళు సురక్షిత ప్రాంతాలకు తరలిపోయేటట్లు చేశాయి. తూర్పుదీవులకు విస్తృతంగా వస్త్ర ఎగుమతి చేయడానికి అనుకూలమైన దక్షిణ తీరాలవారికి ఆసరా అయ్యాయి. 1610 లోనే డచ్‌వారు పులికాట్‌లో కోట నిర్మించుకున్నారు. ★ ఆంధ్రప్రదేశంలోని మొత్తం కోస్తాతీరంలో నాలుగోవంతు–150 మైళ్ళు నెల్లూరు మండలానికే ఉంది. 17వ శతాబ్ది అంతా డచ్‌వాళ్ళదే వ్యాపారంలో పైచేయిగా ఉండేది. డచ్‌వాళ్ళ పెట్టుబడులు, ఎగుమతులు, లాభాలు ఇతరులకు అసూయాజనకంగా ఉండేవి. ఇంగ్లీషువర్తకులు డచ్‌వారితో ఎంతపోటీపడి వ్యాపారంచేస్తున్నా, తరచుగా ఋణాలకు డచ్‌వారే గతి అయ్యేవారు. 1612 నాటికి మలక్కా వస్త్రవ్యాపారానికి పులికాట్ ప్రధాన ఆధారంగా ఉన్నట్లు డచ్ రికార్డులు పేర్కొంటున్నాయి. కోరమాండల్ తీరశాఖ పరిధిని విస్తృతపరచడంతో పులికాట్ 1617లో డచ్ గవర్నర్ పీఠమయింది. అంతటితో పెటపోలి, నొవోపోర్టు, నాగపట్నం, దేవానాంపట్నం, గోల్కొండ, పాలకొల్లు, దాక్షారామం, భీమునిపట్నం, మొదలైన డచ్చి వ్యాపారకేంద్రాలన్నీ పులికాట్ ఏలుబడిక్రిందకు వచ్చేశాయి. మొగల్ చక్రవర్తులు 1689 లోను, 1712 లోను, 1713 లోను డచ్చి ఫర్మానాలను ఖాయపరచారు. ఐతే 1689లో మద్రాసుగో ఈస్టిండియాకంపెనీ స్థావరం ఏర్పరచుకొనడంతో ఆంగ్లేయుల దశ తిరిగింది. డచ్‌కంపెనీ అతిక్లిష్టమైన పరిస్థితుల్లో 18వ శతాబ్ది చివరికాకా ఇంగ్లీషువాళ్ళపై ఆధారపడి మనుగడ సాగించవలసి వచ్చింది.

డచ్చివారు సహజసిద్ధమైన నావికులు. వారు అప్పుడప్పుడే స్పెయిన్ రాజకీయ బంధనాలను తెంచుకొని, పోర్చుగీసువారితో ఎడతెగని యుద్ధాలు చేసి సముద్రాధినేతలయ్యారు. ఐరోపా విపణికి కేంద్రమైన లిస్బన్‌కు గ్రహణంపట్టింది. లిస్బన్, వెనిస్ మహానగరాలు వెనుకబడిపోయినతర్వాత అమ్‌స్టర్‌డామ్‌ఐరోపావ్యాపారానికి పెట్టుబడికేంద్రం అయింది. ఒకకాలంలో లండన్ మహానగరంకూడా ఆర్థిక సహాయానికి, పెట్టుబడికి, డచ్‌వాళ్ళపై ఆధారపడవలసి వచ్చింది. డచ్‌కంపెనీ 17వ శతాబ్దిలో అధికభాగం, ఆంధ్రకోస్తాలో ఉత్తున్నత దశలో ఉండింది. క్రయానికిగాని, కయ్యానికిగాని పులికాటే వారి కర్మాగారమూ, కోటకూడా అయింది. గోల్కొండ నవాబుకాని, చంద్రగిరి ప్రభువుగాని, వారి సామంతులుకాని సురక్షితమైన పులికాట్ కోటనేమీ చేయలేకపోయారు. సముద్ర యుద్ధంలో భారతీయులకు డచ్‌వారికున్న శక్తి సామర్థ్యాలులేవు. ఒకసారి గోల్కొండ అధికారులు డచ్‌వారిని బాధించగా, వారు మచిలీపట్నం నుండి తరలిపోయి ఆ రేవును చుట్టుముట్టారు. చిట్టచివరకు గోల్కొండ ప్రభుత్వం సంప్రదింపులకు దిగి వారితో ఒక అంగీకారానికి రావలసి వచ్చింది. ఈ తతంగమంతా డచ్‌వాళ్ళు పులికాట్ తీరంనుండే జరిపారు. చివరకు డచ్‌వాళ్ళు మచిలీపట్నంలో ఉండి వ్యాపారం జరుపుకొనేందుకు గోల్కొండవాళ్ళు అంగీకరించవలసే వచ్చింది. ఈ సంఘటనలో విజయానికి కారణం గోల్కొండ రాజ్యానికి వెలుపల జరిగిన వ్యాపార స్థావరాలుండడమేనని మోర్‌ల్యాండ్ పేర్కొంటాడు. గోల్కొండకు నౌకాబలం లేదు. అందువల్ల మచిలీపట్నం పులికాట్ దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసివచ్చేది. తూర్పుతీరంలో ఆధిక్యానికి డచ్‌వారికిగల కొద్ది సాయుధనౌకలే తోడ్పడ్డవనికూడా మోర్‌ల్యాండ్ ఈ సందర్భంలో వ్యాఖ్యానించాడు. ఈ చిన్న సంఘటనే 17వ శతాబ్దిలోని భారతదేశ పాలకుల బలహీనతను వ్యక్తంచేస్తున్నది. కేంద్రప్రభుత్వం బలహీనపడిపోతున్న ఈ రోజులలో విజయనగర సామ్రాజ్యంలోని సామంతులు, నాయకులు పరస్పరం ఎడతెగని అంతఃకలహాలతో, కయ్యాలతో తమ అస్తిత్వానికి వచ్చే ప్రమాదాన్నికూడా గమనించలేని స్థితిలో ఉన్నారని స్పష్టమవుతున్నది. పాశ్చాత్యులు మనదేశంలో నిర్మించిన స్థావరాలలో డచ్‌వాళ్ళ 'గెల్డ్రియా' మొట్టమొదటిది. ఈ నిర్మాణం అర్మగాన్, మద్రాసులలో ఫ్యాక్టరీల స్థాపనకు దారితీసింది. ఈ సందర్భంలోనే ఒక విషయం చెప్పుకోవాలి. యూరప్ వర్తకులకు దళారులుగా, పెట్టుబడిదారులుగా ఉండిన స్థానిక వర్తకులు వ్యాపార నిర్వహణలో వారిని ఆదర్శంగా గ్రహించి ఎందుకు

★ Though Pulicat was in the Madras district till 1863, greater number of Pulicat lake villages were transferred to Nellore district in the year, and added to the Gudur Taluk at the Sriharikota Division. Rundall's Revenue Settlement Report (1870) Para 2; G. O. 7th January 1863 No. 16.



మాన్యుడు, మహాదాత
కీర్తికాయుడు
దొడ్ల సుబ్బారెడ్డికి
స్మృత్యంజలి

(Space Donated)

పురోగమించ లేదో ఆశ్చర్యంగా వుంది. ఒకశతాబ్దం పాటు యూరపు వర్తకులతో అంతటి సంబంధాలు కలిగి ఉండికూడా, వీళ్ళ ఆలోచనలో ఎటువంటి అభివృద్ధీ కనపడదు. ఈ మండలంలోని స్థానిక పరిపాలకులుకూడా తమలో తాము కీచులాడుకుంటూ, ఒక గొప్ప అవకాశాన్ని గుర్తించలేదని పిస్తుంది.

గోల్కొండ అధికారులు మాటమాటికి ఇంగ్లీషు కంపెనీ వాళ్ళనుకూడా బాధించసాగారు. 1626లో ఇంగ్లీషువాళ్ళుకూడా ఆర్మాగాన్‌కు బదిలీ అయ్యారు. ఆర్మాగాన్ డచ్‌వ్యాపార కేంద్రమైన పులికాట్‌కు 40 మైళ్ళదూరంలో ఉంది. వెంకటగిరి పాలకులూ స్థానిక వ్యాపారులూ ఇంగ్లీషు వారికి స్వాగత మిచ్చారు. వీళ్లతో వ్యాపార ఒప్పందాలవల్ల అధిక లాభాలు గడించవచ్చునని వాళ్ళు భావించి ఉండవచ్చు. ఇంగ్లీషువాళ్ళు అక్కడ కోట కట్టుకోకుండా నివారించడానికి, స్థానికపాలకుడికి డచ్ వారు రెండు తుపాకులను బహూకరించారు. ఐతే ఇంగ్లీషు వారు బహూకరించిన ఫిరంగితో సంతృప్తి చెందిన స్థానిక పాలకుడు ఆర్మాగాన్‌లో ఆంగ్లేయులు కోట కట్టుకోడానికి అనుమతించినట్లు ఇంగ్లీషు రికార్డులు పేర్కొంటున్నవి. కోట కట్టుకోడానికే కాకుండా, ఎగుమతులమీద మూడుశాతం, దిగుమతులమీద ఒకశాతం సుంకంతో వ్యాపారం సాగించుకోడానికి నాణాలు ముద్రించుకోడానికి, రిజిస్ట్రేషన్ చేసుకోడానికికూడా ఇంగ్లీషువర్తకులు అనుమతిపొందారు. నాటి రికార్డులనుబట్టి, ఇంగ్లీషు వర్తకులు ఆస్థలానికి రాకముందే దానికి ఆర్మాగాన్ అన్న పేరున్నట్లు తెలుస్తున్నది. స్థానికుడైన కరణం ఇంగ్లీషువారికి చేసిన సహాయానికి కృతజ్ఞతా సూచకంగా, వారాతని పేరు పెట్టుకొన్నారనడం వాస్తవంకాదు. నిజానికి ఆ పెద్దమనిషి అత్యాశాపరుడై, క్రూరంగా ప్రవర్తించినందుకు అతణ్ణి కరణీకంనుండి తొలగించినట్లుకూడా తెలుస్తున్నది.

150 గజాల పొడవు, 100 గజాల వెడల్పు ఉన్న ఆ స్థావరం నిర్మించడానికి ఎన్నో నివాస గృహాలను నేలమట్టం చేయవలసి వచ్చింది. 1626 మార్చి 1 న ఇంగ్లీషువర్తకులు అందులో ప్రవేశించారు. డచ్‌వారిదాడికి భయపడి కోటపై తుపాకులు నిలిపి, సైనికరక్షణతో కోటను భద్రపరచుకొన్నారు. "మనం కోటకట్టుకొని నిలదొక్కుకోగలిగితే లెక్కలేనంతమంది జనాన్ని వశంచేసుకోగలం. క్రమక్రమంగా స్థానికాధికారాన్నికూడా వశం చేసుకోగలం" అని మచిలీపట్నం రేవు ప్రధానాధికారి థామస్ మిల్ తమ ప్రధానకేంద్రం బెంటేయాకు వ్రాశాడు. ఆర్మాగాన్ కోట తప్పకుండా నిర్మించాలని ఆయన పేర్కొన్నాడు. గోల్కొండవారి దౌష్ట్యానికి నిరసనగా 1628 లో మచిలీపట్నంలోని వ్యాపారకేంద్రాన్ని మూసివేసి, దాన్ని ఆర్మాగాన్‌కు తరలించారు. ఆ సమయంలోనే డచ్ వ్యాపారులు గోల్కొండవారిపై దాడి చేసి తమ హక్కులను సాధించుకున్నారు.

1629 ఆగస్టు 20 న ఆర్మాగాన్‌లోని ఇంగ్లీషు వ్యాపారలు బాటంలోని ఉన్నతాధికార కేంద్రానికి వ్రాసుకున్న లేఖలో తమ ఆర్థిక దుస్థితిని, దైన్యాన్ని వ్యక్తపరచుకున్నారు. ఏమైనా సహాయం అందనిదే ఏమీ కొనసాగదనీ, లేకుంటే దిల్లర వెద్యాలకుకూడా డచ్‌వారిని దేహీ అని యాచించవలసి వస్తుందని పేర్కొన్నారు. 1634 లో ఆర్మాగాన్ తాము భావించిన స్థాయికి చేరుకోలేదని దాని నిర్వాహణాధికారిగా ఉన్న ఫ్రాన్సిస్ డే పేర్కొన్నాడు. నౌకామార్గం లోతుగా లేదనీ, కావలసినంత వస్త్రం తయారుకావడం లేదనీ, స్థానిక నాయకుల పీడనలో వ్యాపారులు దరిద్రులైపోయారనీ వ్రాశాడు. పులికాట్‌కంటె మంచి రేవు కోసం ఫ్రాన్సిస్‌డే ప్రయత్నించాడు. ఆఖరుకు దామెర్ల వెంకటరావు చెన్నపట్నంలో పారిశ్రామిక కేంద్రం ఏర్పాటు చేసుకోడానికి అనుమతించాడు. 1640 ఫిబ్రవరి 20 న ఆర్మాగాన్ కోటను మూసివేసి, రెండువేల పగడాల బాకీలు తీర్చివేసి డే, కొంగన్ ఇద్దరూ మద్రపట్టణం చేరారు.

ఆర్మాగాన్‌లో ఇంగ్లీషు ఫ్యాక్టరీ మూతపడడానికి కొన్ని ముఖ్యకారణాలను ఊహించుకోవచ్చు. డచ్చివాళ్ళు ఎక్కువ పెట్టుబడి వనరులు కలిగిఉండడం, వాళ్ళు నేతపనివాళ్ళకు మంచి కూలీలు చెల్లించడం, అందువల్ల ఏర్పడ్డపోటీకి వాళ్లు నిలవలేకపోవడం జరిగిఉంటుంది. ఇంగ్లీషు వర్తకులు డచ్చివారికి దూరంగా ఉండాలనికూడా భావించి ఉండవచ్చు. నాటి పులికాట్ నాయకుడే దుగరాజపట్నంకూడా పరిపాలిస్తూ ఉండడం వల్ల, ఆ నాయకుడికి డచ్ వ్యాపారులు తరచుగా మంచి బహుమతులివ్వడమే కాకుండా, అంతర్యుద్ధాలతో సైన్యాలనుకూడా సమకూర్చి ఉండవచ్చు. ఈ కారణాలవల్ల అతడు డచ్‌వాళ్లకే సుముఖంగా ఉండి ఉండవచ్చు. చంద్రగిరి ప్రభువు తమిళదేశంలోని మధుర, తంజావూరు, చెంజి మొదలగు



పట్టాభిరామరెడ్డి

తిరుగుబాటుదారులైన సామంతులకు తనకు మధ్య తటస్థప్రదేశాన్ని ఏర్పాటుచెయ్యడానికి ఇంగ్లీషు కంపెనీవారిని ఆహ్వానించినట్లుకూడా పేర్కొనబడుతూంది. ఈ విషయంవల్ల, గోల్కొండ, బీజాపూరు సుల్తానుల దండయాత్రల భయంతో, తమిళదేశంలోని అంతర్యుద్ధాలతో. కర్ణాటక సామ్రాజ్యం శిథిలదశకు చేరినట్లు స్పష్టంగా తెలుస్తూంది.

ఆర్మాగాన్ దుగరాజపట్నం అభివృద్ధివల్ల నెల్లూరుమండల భవితవ్యం ఎట్లా మారివుండేదో ఒక్కమాటు అంచనా వేసుకోవచ్చు. 1640-49లో ఇంగ్లాండులో రాజకీయవిప్లవం వచ్చిందిగదా! దాంతో లండన్ యూరపు ఆర్థికరంగానికి కేంద్రమయింది. ఇంగ్లీషుకంపెనీ సముద్రాంతర వ్యాపారంలో ప్రాబల్యం సంపాదించి, డచ్చి ప్రాభవాన్ని అణచివేసింది. చంద్రగిరి ప్రభువు, ఆయన సామంతులు క్రమక్రమంగా పెరుగుతున్న ఇంగ్లాండు ప్రాముఖ్యాన్ని గమనించి, ఆర్మాగాన్‌లోని ఇంగ్లీషు కంపెనీకి తోడ్పడివుంటే, పులికాట్ ఇంగ్లీషువారి అధీనమై ఉండేది. ఆర్మాగాన్ గొప్ప నౌకాశ్రయంగా అభివృద్ధి పొంది ఉండేది. మత్స్యకారుల గ్రామం చెన్నపట్టణం స్థానంలో ఈనాడు నెల్లూరు నౌకావ్యాపారంతో, సిరిసంపదలతో తులతూగిఉండేది. ఆర్మాగాన్, పులికాట్ వాణిజ్యంలో ప్రఖ్యాతిపొంది, వేలకొలది నేతగాళ్ళు, కలంకారీలు నిరంతరం ఐరోపా విపణికొరకు క్యాలికో, లాంగ్ క్లాత్, తివాచీలు ఉత్పత్తిచేస్తూ ఉంటే, చెన్నపట్నం చిన్నపట్నంగా మాత్రమే మిగిలిపోయి ఉండేది. దురదృష్టంకొద్దీ దూరదృష్టిలేని పాలెగాళ్ళు ఒకరిగొంతులు ఒకరు కోసుకుంటూ, కలంకారీలను, నేతపనివారిని నాశనం చేశారు. నెల్లూరుకు పట్టిన ఈ దురదృష్టం చెన్నపట్నాన్ని

మహానగరంగా, దక్షిణాదికి ముఖ్యపట్టణంగా మార్చివేసింది. ఆర్మాగాన్‌కు కొంచెం ఆగ్నేయంగా ఏర్పడ్డ బ్లాక్‌ఉడ్ హార్బర్ కూడా ఈ ఊహకు ప్రాణంపోస్తుంది. ★ నెల్లూరుచరిత్రలో ఈశతాబ్దం యుద్ధాలకు, కలహాలకు, తుఫానులకు, ఉపద్రవాలకు, పీడనకు గుర్తుగామాత్రమే మిగిలిపోయింది.

నెల్లూరు జిల్లా చంద్రగిరి రాజ్యంలో అంతర్భాగంగా ఉండేది. పులికాట్, నెల్లూరు, వెంకటగిరి, ఉదయగిరి, ఆత్మకూరు, రాపూరు పాలెగాళ్ల అధికారంలో ఉండేవి. విజయనగర సామ్రాజ్యం ఛిన్నాభిన్నమై, ముక్కలుముక్కలుగా అమర నాయకుల ఆధీనమైంది. ఈపాలెగాళ్లు చాలామంది అమర నాయకుల వారసులు. వీళ్ళలో వెంకటగిరి యాచమ నాయకుడు విజయనగర సామ్రాజ్యంలో 1614-18 నడుమ జరిగిన అంతర్యుద్ధంలో ప్రముఖపాత్ర వహించాడు. ఆ అంతర్యుద్ధం సామ్రాజ్యాన్ని సర్వ నాశనం చేసింది. విద్రోహులైన మధుర, చెంజి నాయకులకు వ్యతిరేకంగా రాజుకు గట్టి అండగా నిల్చి, మేటి వీరుడుగా, యాచమనాయకుడు చరిత్రలో ప్రసిద్ధి పొందినప్పటికీ, అతడి పరాక్రమం, వీరత్వం, సామ్రాజ్యపతనాన్ని నిలువరించలేక పోయాయి.

గోల్కొండ దండయాత్రల వల్ల 1640 ప్రాంతాలకల్లా రాజకీయ పరిస్థితుల్లో తీవ్రమైన మార్పులు సంభవించాయి. మీర్ జుమ్లా నాయకత్వాన గోల్కొండ బలం గుండ్లకమ్మ దాటుకొని, తీరాంధ్రాన్ని జయించింది. షుమారు 1647కల్లా నెల్లూరు జిల్లా గోల్కొండ ఆధిపత్యం క్రిందకు వచ్చింది. నెల్లూరు జిల్లాలోని పాలెగాళ్ళు గోల్కొండ ప్రభువులకు విధేయులై మసలుకో సాగారు.

40 వేల పదాతి దళంతో, 4000 అశ్విక దళంతో మీర్‌జుమ్లా కొండవీడు నుండి కర్ణాటక రాజ్యంపైకి బయలుదేరాడు. 1642 ఏప్రిల్ 21న అతడి సైన్యాలు శ్రీహరి కోటను ఆక్రమించుకున్నాయి. అక్కడ నుండి పడమరగా దండయాత్ర కొనసాగింది. రాపూరుకోట ముట్టడిసాగింది. వెంకట్రాదిరెడ్డి, తిమ్మారెడ్డి అనే సోదరులు ఈ ముట్టడికి నాయకత్వం వహించారు. ప్రఖ్యాతి పొందిన ఈ దుర్గం 1642 డిసెంబరు 31న గోల్కొండ సేనలకు లొంగిపోయింది. అటు తర్వాత నాలుగు రోజులకు కల్లూరు కోట ముట్టడి ఆరంభం అయింది. గొప్పదండు కావలి ఉన్న ఈ దుర్గం ఒక మాత్రాన స్వాధీన పడలేదు. దీన్ని స్వాధీన పరుచుకోడానికి గోల్కొండ వారికి ఒక్క నెలరోజులు పట్టింది. ఆ పైన ఉదయగిరి అనేక పర్యాయాలు చేతులుమారింది. చంద్రగిరి సైన్యాలు కొన్ని విజయాలు సాధించాయి. అయితే మల్లయ్య అనే దుర్గాధిపతి స్వామిద్రోహం వల్ల చివరకు ఈ దుర్గం గోల్కొండ వారికి దఖలు పడింది. గోల్కొండ వారివద్ద లంచం పుచ్చుకొని ఈ అధికారి 1643 జూన్‌లో దుర్గాన్ని పరాధీనం చేశాడు. అటు తర్వాత మీర్‌జుమ్లా సేనలు సిద్ధవటం వైపు నడిచాయి. గోల్కొండ సైన్యాలు అటుపోగానే చంద్రగిరి సైన్యాలు ఉదయగిరి దుర్గాన్ని తిరిగి ఆక్రమించుకున్నాయి. ఇది 1844లో జరిగింది. అయితే ఉదయగిరి దుర్గాధిపతిగా నియమించబడ్డ కొమరి చెట్టి అన్న మారుపేరుగల చిన్నన్న తన ముందు వాడిలాగే స్వామిద్రోహి అయి దుర్గాన్ని 1645లో మీర్‌జుమ్లా ఆధీనం చేశాడు. అటు తర్వాత గోల్కొండ సైన్యాలు 1646 డిసెంబర్ 11న పులికాట్‌ను ఆక్రమించుకున్నారు.

1659 ప్రాంతాలకు నెల్లూరు జిల్లా యావత్తూ గోల్కొండ వారి హస్తగతమయింది. మద్రాసువరకు గల తూర్పు తీరం సమస్తం గోల్కొండ రాజ్యంలో చేరిపోయింది. విజయనగర సామ్రాజ్య చరిత్రను వివరించడానికి వీలుగా శిథిలాలనూ, శాసనాలనూ మిగిల్చి విజయనగరసామ్రాజ్య భానుడు అస్తమించాడు.

కుతుబ్‌షాహీ రాజ్యానికి 1674 లో మాదన్న ప్రధాన మంత్రి అయ్యాడు. అప్పటికి తెలుగు దేశంపై గోల్కొండవారి దండయాత్రలు సమాప్తమయ్యాయి. అక్కడ గోల్కొండ అధికారం సుస్థిరమైంది. గుండ్లకమ్మనుండి మద్రాసు వరకు గల భూభాగానికి మాదన్న దగ్గరిచుట్టం పొదిలి లింగన్న పాలకుడుగా నియమించబడ్డాడు. స్థానిక నాయకులను కరగ్రాహకులుగా నియమించారు. కాకతి సామ్రాజ్యం పతనమైన తర్వాత, మళ్లీ ఇన్నేళ్లకు తెలుగుదేశం అంతా మాదన్న మహామాత్య పదవిలో ఒకే పరిపాలన క్రిందకు వచ్చింది.

అక్కన్న, మాదన్నల అధికారానికి అసూయ చెందిన ఈర్ష్యాపరులు పఠానులు, ఆఫ్గనులు మొదలైన కుట్రదారులు వాళ్ళను గోల్కొండ నడి వీధుల్లోనే హత్యచేశారు. ఈ హత్యోదంతం 1686 లో జరిగింది. ఆ మరుసటి సంవత్సరమే గోల్కొండ ఔరంగజేబు హస్తగతమైంది. తానీషా (అబుల్ హసన్) బందీఅయ్యాడు. కుతుబ్‌షాహీ సామ్రాజ్యం మొగల్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా మారిపోయింది. నెల్లూరు జిల్లాలోని పాళెగాళ్ళు పూర్వం గోల్కొండవారిని సేవించినట్లే యిప్పుడు మొగల్ సామ్రాజ్యానికి విధేయులై మసలుకో సాగారు. మొగల్ సామ్రాజ్య విధేయులై సేవలు చేసినందుకు ప్రతికృతిగా వెంకటగిరి ప్రభువుకు ఈ క్రింది జాగీర్లు కానుకగామొగల్ ప్రభువు యిచ్చాడు. సర్వేపల్లి సర్కారులోని సర్వేపల్లి, నెల్లూరు, రాపూరు, వెంకటగిరి తాలూకాలు; చంద్రగిరి సర్కారులోని కాళహస్తి, సత్యవీడు, చెన్నూరు, గూడూరు, తిరుపతి తాలూకాలు; కంది సర్కారులోని విష్ణుకంచి, కారంగుడి, మొనసవాక తాలూకాలు. ఆ రోజుల్లో ఈ జాగీరువల్ల 25, 32, 615 రూపాయల దాకా సంవత్సరాదాయం వుండేది. ఆ తర్వాత కొద్దిరోజులకే దూపాడు, ఉదయగిరి, అద్దంకి, పొదిలి, మాచెర్ల, దర్శి, కారంపూడి, పెళ్ళూరు, ఆరికట్ల, కొచ్చెర్లకోట ప్రాంతాలను మొగల్ ప్రభుత్వం వెంకటగిరి పాలకుడి తమ్ముడికి జాగీరుగా ఇచ్చింది. కొద్దికాలానికే ఈ ప్రాంతాలన్నీ వెంకటగిరి సంస్థానంలో చేరిపోయినవి. 1802 లో శాశ్వత పరిష్కారం (Permanent Settlement)జరిగినప్పుడు వెంకటగిరి సంస్థానం 800 గ్రామాలతో 117 చదరపు మైళ్ళ విస్తరించి వుండింది. పదిహేడో శతాబ్ది ముగిసేటప్పటికి నెల్లూరు మండలమంతా మొగల్ ప్రభుత్వాధికారం క్రింద ఉండిన వెంకటగిరి సంస్థానంలో చేరిపోయింది.

విజయనగర సామ్రాజ్య పాలనలోని చివరి నూరేళ్ళ (1565-1659) సాంఘిక పరిస్థితులు,

---

★ "To the South of Armagon is an anchorage know as Blockwood's Harbor, because it was surveyed in 1821 at the instance of Sir Henry Block wood...it is the only place on the cormandal coast which offers any real protection to ships during an easterly gale. (Mclean : Madras manual of Administration Vol III P 281)

పోర్చుగీసు, డచ్, ఇంగ్లీషు వ్యాపారుల వ్రాతలవల్ల చక్కగా వెల్లడి అవుతున్నవి. ఈ వ్యాపారులు తమతమ ఫ్యాక్టరీల పరిసరప్రాంతాల స్థితిగతులను, కలుగుతున్న మార్పులను బటావాలోనో లండన్‌లోనో, లిస్బన్‌లోనో, ఆమ్‌స్టర్‌డామ్‌లోనో, సూరత్‌లోనో, బందరులోనో ఉన్న తమ పైఅధికారులకు వ్రాసేవారు. పోర్చుగీసు యాత్రికులు న్యూనిజ్, పేస్ వ్రాతలవల్ల విజయనగర సామ్రాజ్యం 250 అమరనాయకుల మధ్య ఎట్లా విభజింపబడి ఉండేదో తెలుస్తుంది. ఈ నాయంకరాలు రాజ్యానికి పన్నులరూపంలో ఆదాయాన్ని ఏ విధంగా సమకూర్చేవో కూడా వీళ్ళ వ్రాతలవల్ల తెలుస్తూంది. నిరుటి రాబడినిబట్టి ఆయా నాయంకరాలు చెల్లించవలసిన కరధనాన్ని నిర్ణయించేవారు. అమరనాయకులు తమ అమరాలను కొన్ని వంతులుగాచేసి గుత్తకిచ్చేవారు. ఇట్లా భూమిదున్ని సాగుచేసే రైతుకూ, సామ్రాజ్యాధిపతులకూ నడుమ ఇద్దరు ముగ్గురు దళారులుండేవారు. గ్రామ పెద్దల నుండి గాని, రైతుల నుండి సామూహికంగా గాని పన్నులు వసూలు చేసేవారు. భూమిహక్కు ఎవరిదనికాని, గ్రామాలలో భూస్వామ్యం ఎవరికి చెందిందనికాని ప్రభుత్వాధిపతులు పట్టించుకునేవారు కాదు. మొత్తం పంటలో సగం కంటె పైగానే పన్ను రూపంలో కేంద్ర ప్రభుత్వానికి ముట్టేది. వ్యవసాయకులకు మిగిలేది గంజినీళ్ళకు కూడా సరిపోయేదికాదు. దక్షిణ భారతదేశంలో, హిందూ రాజ్యంలో వ్యవసాయకులు అమర నాయకుల చేత దారుణంగా అణచివేయబడ్డారని, అత్యంత దారిద్ర్యంలో బతికారని (న్యూనిజ్, పేస్ వ్రాసిన వ్రాతలను వ్యాఖ్యానిస్తూ) చరిత్రకారుడు సూవెల్ పేర్కొన్నాడు. ధాన్యం వ్యాపారం కూడా ఏ ఇబ్బందులూ లేకుండా సవ్యంగా సాగేదికాదు. ఒకే వస్తువుమీద దేశంలో అనేక కేంద్రాలలో మితిమీరిన సుంకాలు. తిరవలు, బందిపోటుల నుండి, దారిదోపిడుల నుండి రక్షణలేకపోవడం, ఇత్యాది అనేక ప్రతిబంధకాలుండేవి. వ్యాపారులు నిరంతరం అననుకూల పరిస్థితుల్లో బ్రతకవలసి వచ్చేది. సార్థవాహులు ధన ప్రాణనష్టాలకు సిద్ధపడి విడారులను తరలించవలసి వచ్చేది. గోల్కొండ రాజ్యంలోనూ ఇదేస్థితి. అందరికంటె హెచ్చుపాటపాడిన వాడికి శిస్తువసూలుచేసే హక్కుదఖలు పరచేవారు. కరగ్రహణాధికారం ఒకటి రెండేళ్లకే పరిమితి అయి ఉండేది. ఆ కారణంచేత పెద్ద పాటపాడి శిస్తు వసూలుహక్కు భుక్తం చేసుకొన్నవాళ్ళు, అతడిదగ్గర చిల్లరగా పన్ను వసూలుహక్కు పొందినవాళ్ళు ఆ కొద్దికాలంలో వీలైనంత డబ్బు పిండుకొనేందుకు ప్రయత్నించేవాళ్ళు. డచ్, ఇంగ్లీషువ్యాపారులు తరచుగా పల్లెలూ, పట్నాలూ పాటపాడి పన్నువసూలు చేసుకుని లాభించేవాళ్ళు ఈ లాభాలనే వస్త్ర వ్యాపారంలో పెట్టుబడి పెట్టేవారు. పారసీ, ఆఫ్గనీ దేశీయులు పన్ను వసూళ్ళలో పాశవికంగా ప్రవర్తించేవాళ్ళు. అత్యాశాపరులైన ఈకరగ్రాహకులు, పన్ను కట్టలేకపోయినా, ఆలస్యం అయినా రాక్షసంగా ప్రవర్తించేవాళ్ళని డచ్ యాత్రికుల వ్రాతలు సాక్ష్యమిస్తున్నాయి. ఒక పల్లెపెద్ద తన పొలం సాగు చెయ్యనందుకు ముక్కలు ముక్కలుగా నరకబడ్డాడట!

17వ శతాబ్దంలో తరచుగా సంభవించినకరవు కాటకాల్లో పల్లెపట్టులూ, పట్నవాసాలూ పొందిన సంక్షోభం ఆనాటి డచ్, ఇంగ్లీషు రికార్డులవల్ల విస్తారంగా తెలుస్తున్నది. తూర్పుకోస్తాలో 1618–19లో తీవ్రమైన కాటకం సంభవించింది. కరవువల్ల పెద్ద సంఖ్యలో బానిసలను కొనగలిగినట్లు ఒక డచ్ గుమాస్తా మచిలీపట్నంనుండి వ్రాశాడు. పులికాట్ పరిసరాల్లో కరవుకారణంగా అధిక సంఖ్యలో మరణాలు సంభవించడంవల్ల తాను ఈ విధంగా బానిసలను సమకూర్చుకొనవలసివచ్చినట్లుకూడా అతడు పేర్కొన్నాడు. విజయనగర సామ్రాజ్యంలో ఏర్పడ్డ భయానక క్షామంగురించి, మాచ్వోల్డ్ సొంతంగాచూచి అతివాస్తవంగా వ్రాశాడు. 1622లో అతడు తూర్పుతీరాన్ని విడిచిపెట్టాడు. తలిదండ్రులు వేలసంఖ్యలో పిల్లలను తీరప్రాంతాలకు తీసుకొనివచ్చి నాలుగు దోసిళ్ళ బియ్యానికి అమ్మివేసేవారు. లవ్‌డే తన 'క్షామ చరిత్ర'లో 1623ను, 1628–29ని కాటకకాలంగా పేర్కొన్నాడు. 1630–31 కాటకం ఒక ఘోర కలి. నేతపనివారు, రజకవృత్తివారు ఈ క్షామ కాలంలో చాలావరకు తుడిచిపెట్టుకొని పోయినట్లు ఒక ఇంగ్లీషు వ్యాపారి పేర్కొన్నాడు. పొలాలు, ఊళ్ళు అన్నీ పీనుగులపెంటలో నిండిపోయాయి. మానవకంకాళాలు, పశువుల మృతకళేబరాలు ఎక్కడబట్టినా కనిపించేవి. పస్తులున్న మనుష్యులు చచ్చిన జంతువులను పీక్కు తినేవారు. కుక్కలు అస్తిపంజరాలను నమిలేవి. నదీప్రవాహాల్లో శవాలు కుప్పతెప్పలుగా కొట్టుకొచ్చేవి. తల్లులు పిల్లల్ని అమ్ముకునేవారు. కొందరు నదిలో పడి ఆత్మహత్య చేసుకునేవారు. రహదారిప్రయాణం ప్రమాదపూరితమైంది. ఆకలిగొన్న మనుష్యులు మనుష్యులను చంపి మాంసం పీక్కుతినేవారు. ఈ వర్ణనల్లో కొంత అతిశయోక్తిపాలు ఉన్నా, ఆ ఘోరకలిని కన్నులకు కట్టిస్తున్నాయి. 1646-50 మధ్య సంభవించిన దుర్భిక్షాన్ని ఆనాటి ఇంగ్లీషు వ్యాపారుల ఉత్తరాలనుబట్టి ఊహించుకోవచ్చు. "కాటకం కర్ణాటక సామ్రాజ్యాన్ని వినాశనం చేసివేసింది. ఈ కాటకబాధవల్ల మీర్‌జుమ్లా దండయాత్రలను అడ్డుకున్నవారే లేకపోయారు. ఈ కాటకంవల్ల పులికాట్‌లో 15000 మంది చచ్చారు. శాంథోమ్‌లోని కలంకారీ పనివారు, నేతపనివారు చాలావరకూ మరణించారు. ఈ క్షామం ఒక్క మద్రాసు పట్నంలోనే 3000 మందిని పొట్టన పెట్టుకుంది. ఆ మూడేళ్ళూ కొనడానికి వస్త్రం ఏమాత్రం లభ్యంకాలేదు" అని మద్రాసునుండి సూరత్‌కు వ్రాయబడ్డ ఒకజాబులో పేర్కొనబడ్డది. ఈ కాటకం ఎంత భయంకరరూపం దాల్చిందంటే విజయనగర సామ్రాజ్యంలో జనసంఖ్యలో చాలా భాగం నశించిపోయింది. అయిదేళ్ళకుకూడా దేశం మళ్ళీ కోలుకోలేక పోయిందని మరో జాబులో పేర్కొనబడింది. 1649 లో వ్రాయబడ్డ రెండు జాబులు ఆనాడు అలముకొంటున్న క్షామభయాన్ని చక్కగా వివరిస్తున్నవి.

టేవర్నియర్ అనే ఫ్రెంచి యాత్రికుడు, వ్యాపారి 1638-39, 1651, 1657-58, 1662-63 ల్లో గోల్కొండ రాజ్యాన్ని సందర్శించాడు. 1676 లో 'ట్రావెల్స్ ఇన్ ఇండియా' అనే అతడి గ్రంథం ప్రకటించబడ్డది. ఆనాటి వాణిజ్య వ్యవసాయాలకు, సంస్కృతికి ప్రజాజీవనానికి సంబంధించిన అనేకాంశాలు ఆ గ్రంథంలో ప్రస్తావించబడ్డవి. విజయవాడ నుండి మదరాసుకు టేవర్నియర్ 13రోజుల్లో చేరుకున్నాడు. ఈ ప్రయాణం కొండవీడు, కొప్పారం, అద్దంకి, నానిరుపాడు, కందుకూరు, దాకేపల్లి, గండవరం, సర్వేపల్లి, పుదూరు, పోనప్పగుంట, ప్రళయకావేరిపైన జరిగింది. ఆ రోజుల్లో ప్రజలంతా భాగ్యనగరంలో నివసించేవారని, అధికారులుమాత్రమే హైదరాబాదులో నివసించేవారనే అంశాన్ని టేవర్నియరే మొట్టమొదట పేర్కొన్నాడు. థీవ్‌నాట్ అనే మరో ఫ్రెంచ్ దేశీయుడు 1666-67 మధ్య గోల్కొండ రాజ్యాన్ని దర్శించాడు. బెర్నియర్, మనుక్కి ఇద్దరూ మొగల్ సామ్రాజ్యం మహోజ్వలదశలో ఉన్నప్పుడు ఈ దేశంలో పర్యటించారు. షోవర్ అనే డచ్ దేశీయుడు, మెథోల్డ్ అన్న ఆంగ్లేయుడు, మ

ఒక ఇంగ్లాండు యాత్రికుడు 'రిలేషన్స్ ఆఫ్ గోల్కొండ' అన్న గ్రంథంలో తమ పర్యటనానుభవాలు వివరించాడు. పీటర్ 17వ శతాబ్ది ప్రథమపాదంలో తూర్పుతీరాన్ని, మచిలీపట్నాన్ని సందర్శించాడు. ఆ శతాబ్దారంభంలోని పరిస్థితులు, మొగల్ సామ్రాజ్యంలోని స్థితిగతులు, మీర్ జుమ్లా దండయాత్ర పిమ్మట నెల్లూరు మండలం పరిస్థితులు ఆ గ్రంథంలో అభివర్ణింపబడ్డవి. షోరర్ ఆనాటి ధరలను పేర్కొన్నాడు. బియ్యం రూపాయకు 40 శేర్లు, గోధుమలు 20 శేర్లు అమ్మేవారు. ఎద్దు జీతు 4½ రూపాయ నుండి 5వరకూ ఉండేది. మేకవెల 5నుండి 10 అణాలదాకా ఉండేది. 4½ రూపాయకు (వగడా) 60నుండి 80కోళ్ళు అమ్మేవారు.

తూర్పుకోస్తాలో వ్యాపారమంతా మల్లయ్యశెట్టి చిన్నమశెట్టి (లేక కామశెట్టి) వ్యాపార సంస్థ ఆధీనంలో ఉండేది. డచ్, ఇంగ్లీషు వ్యాపారులు వీళ్ళద్వారానే తమ పెట్టుబడులను పెట్టేవారు. 17వ శతాబ్ది పూర్వార్థంలో వీళ్ల పేర్లు డచ్, ఇంగ్లీషువ్యాపారుల రికార్డుల్లో తరచుగా కనిపిస్తాయి. వాళ్ళ వ్యాపార కేంద్రం పులికాట్‌లో ఉండేది. అక్కడనుండే దళారులను తూర్పు తీరానికంతా పంపేవారు. యూరపు విపణికోసం పులికాట్ నేతపనివారు అత్యుత్తమమైన బట్టను ఉత్పత్తి చేస్తున్న ఆ రోజుల్లో, నరసాపూర్, గోదావరి ప్రాంతంలో నౌకానిర్మాణ పరిశ్రమ, ఉక్కుపరిశ్రమ చక్కగా సాగుతున్న ఆ దినాల్లో స్థానిక నాయకుల తోడ్పాటు, అండదండలు ఉండి ఉంటే ఆనాటి మన వ్యాపారులు తమ పెట్టుబడులతో యూరపు విపణినికూడా తమ గుప్పిటిలో పెట్టుకొని ఉండేవారు. రాజకీయ వాతావరణం అనుకూలంగా ఉండి ఉంటే లిస్బన్, వెనిస్, ఆమ్‌స్టర్‌డామ్, లండన్‌లవలె పులికాట్‌ను గొప్పవాణిజ్య కేంద్రంగా రూపొందించి ఉండేవారు. మీర్‌జుమ్లాకు గాని, మాదన్నకుగాని, యూరప్ రాజ్యాలను ఆదర్శంగా గ్రహించి, వాటిని మించాలనే ఆలోచనే లేకపోయింది. శివాజీ వంటి నాయకుడు కూడా మహారాష్ట్రేతరులను పీడించడం, దోపిడీ చెయ్యడం వంటి సంకుచితపు ఆలోచనలనే తప్ప, శిథిలమైన విజయనగర సామ్రాజ్య స్థానంలో భారత సామ్రాజ్యాన్ని నిర్మించే అవకాశాన్ని ఉపయోగించుకోలేకపోయాడు. ఆధునిక పద్ధతుల్లో మొగల్ చక్రవర్తులుగాని, కుతుబ్‌షాహీలుగాని, మహారాష్ట్రులు గాని సైనిక, రాజకీయ వ్యవస్థను ఏర్పర్చుకోలేకపోయారు. వ్యాపారం కోసం వచ్చి, తమ ఉనికి కోసం స్థానిక నాయకులవద్ద ప్రాధేయపడ్డ ఆంగ్లేయులు కోటలు కట్టారు, నాణాలు అచ్చువేశారు. స్థానిక ప్రజలతో సైన్యాన్ని సమకూర్చుకున్నారు, హిందూ మహమ్మదీయ ప్రభువుల నుండి రాజ్యాలు గెల్చుకున్నారు. ఇక్కడి స్థానిక నాయకులు తమ దేశంలో కళ్ళముందు జరుగుతూవచ్చిన ఈమార్పులనుగుర్తించనే లేకపోయారు. భారతదేశంయొక్క, సంఘం యొక్క పునాదులు పరియలు పారడానికి కారణాలను మూర్‌ల్యాండ్ ఇట్లా అభివర్ణించాడు:
"ఔరంగజేబు పరిపాలనాకాలం ముగిసే సమయానికి ఇక్కడి ఆర్థికవ్యవస్థ భగ్నం కావడానికి సిద్ధంగా ఉంది. దినమొలలతో నేతపనివారు ఆతరులకోసం బట్టలు నేస్తున్నారు. వకవకలాడే కడుపుతో పట్టణాల ఆకలి తీర్చడానికి పొలాలలో శ్రమించారు. భారతదేశాన్ని మొత్తంగా పరిశీలిస్తే ఈ కాలంలో అత్యవసరమైన వస్తువుల నెగుమతి చేసి, మారుగా నిరుపయోగమైన బంగారాన్ని, వెండిని మార్పిడి చేసుకున్నారు. అన్నం ఇచ్చిరాళ్ళు రత్నాలు తెచ్చుకున్నారు. ఆ దామగా ఏటికేడు ఆకలితో శ్రమించారు. ఆకలి కొంతమటుకైనా తీరుతున్నంత వరకూ వారిలో సహనం ఉంటూనే వచ్చింది. ఆ కొద్ది ఆహారం దొరకనినాడు కన్నబిడ్డలను బానిసలుగా అమ్ముకున్నారు. నరమాంస భక్షణ, ఆత్మహత్యలు. వస్తులు ఇవేవారు చేయగలిగినవి........"

ఈ వ్యాసరచనకు ఉపయోగపడ్డ కొన్ని గ్రంథాలు.


1. Rundall's Revenue Settlement Report 1870
2. Journal of Indian history VOL XLI
3. Madras Manual of Administration VOL III
4. The English Factories in India, Edited by William Foster
5. H K. Sharwani : History of Qutubsha Dynasty
6. Moreland: Akbar to Aurangzib


—

# నా రాజకీయ జీవితం

# -కొన్ని స్మృతులు

1921 జనవరి 28 తేదీ – నేను వి. ఆర్. హైస్కూలులో నాల్గవఫారమ్ చదువుతూ, చదువు మానినాను. మా అన్న చంద్రశేఖర రెడ్డిగారు అప్పటికే కాంగ్రెసులో చేరి, ఉత్సాహంగా పని చేస్తుండేవారు. 1920 శాసనసభా ఎన్నికలలో బెజవాడ సుందరరామరెడ్డిగారు పోటీచేయడానికి నిశ్చయించుకొని, ప్రచారం చేస్తుండగా, మా అన్న దానికి వ్యతిరేకంగా, ఎన్నికలలో పాల్గొనవద్దని ఆత్మకూరు, ఉదయగిరి తాలూకాలలో ప్రచారం సాగించారు. 1920 సెప్టెంబరులో కలకత్తా కాంగ్రెసు సమావేశంలో తీర్మానింపబడిన అసహాయోద్యమ తీర్మానం డిసెంబరులో నాగపూరులో ఆమోదింపబడింది. అప్పుడు మా అన్న— "బడులు మానుకోవలసిందన్న తీర్మానాన్ని కాంగ్రెసు ఆమోదించింది; కాంగ్రెసు వాదిగా నా అభిప్రాయాన్ని మీరు అవలంబించాలని నేను కోరడంలేదు; మీ బాధ్యత మీరే వహించి నిర్ణయం చేసుకోవలె" అని అన్నారు.

అప్పుడు మొదటిఫారమ్ చదువుతుండిన మా తమ్ముడు రామిరెడ్డి, నేను చదువు మానివేయడానికే నిశ్చయించుకొని, మా నిర్ణయాన్ని మా అన్నకు తెలియజేశాము. తర్వాత మా నిర్ణయానుసారం జనవరి 28 తేదీ పాఠశాలనుంచి విరమించుకొన్నాము. ఫిబ్రవరి 1 తేదీ మమ్మల్ని మా అన్న బందరు తీసుకవెళ్ళి ఆంధ్ర జాతీయ కళాశాలలో చేర్పించినారు. అది కాంగ్రెసుతో నా తొలి అనుబంధం.

తర్వాత కల్గిన పరిణామాలన్నీ దాని ఫలితాలే. బందరు జాతీయ కళాశాలనుంచి విశ్వభారతికి పోయాను; అక్కడినుంచి 1927లో చదువు పూర్తి చేసికొని, తిరిగి వచ్చినాను.

1930లో ఉప్పుసత్యాగ్రహోద్యమం ప్రారంభమైనప్పుడు, జిల్లాలో సత్యాగ్రహంలో పాల్గొనేందుకు పేర్లిచ్చిన మొదటి జట్టులో నేను వున్నాను. అప్పుడు ఓరుగంటి వెంకటసుబ్బయ్య జిల్లా 'అధినేత'గా నియమింపబడ్డారు. వారి నాయకత్వంలో, మొదటిజట్టుకు నేను నాయకత్వం వహించి, 1930 ఏప్రిల్ 13 తేదీన, ఉప్పుచట్టానికి వ్యతిరేకంగా, మైపాడులో ఉప్పు తయారుచేశాము. ఐతే వెంటనే నన్ను అరెస్టుచేయలేదు; మే నెల నాల్గవవారం వరకు మాకేమీ నోటీసులు రాలేదు. ఈ లోగా కోవూరు, కావలి తాలూకాలలో, గ్రామాలలో పట్టాభి సీతారామయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్య తదితరులున్నారు. తర్వాత నన్ను అక్కడినుంచి కడలూరు జైలుకు మార్చినారు. అక్కడ కళావెంకట్రావు, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, చెరుకువాడ వెంకటనరసింహం తదితరులుండినారు. ఆ మూడు నెలలూ కడలూరు జైలులో – బి క్లాసు గనుక— ఎటువంటి ఇబ్బందులూ లేకుండా గడచిపోయాయి. ఆగస్టు 25 తేదీన విడుదలచేయబడ్డాము.

## డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

ప్రచారం చేశాము. నా తొలి రాజకీయోపన్యాసం కావలి బజారులో, ఓరుగంటి వెంకటసుబ్బయ్య అధ్యక్షతన జరిగింది.

తర్వాత గోగులపల్లిలో సత్యాగ్రహశిబిరం స్థాపించాము; వందలాది గోగులపల్లివాసులు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఇంతలోగా, మే 26 తేదీన గూడూరు సబ్ కలెక్టరాఫీసులో జిల్లా కలెక్టరు యెదుట హాజరు కావలసిందిగా మాకు 22, 23 తేదులలో నోటీసులు వచ్చాయి. బేబూరు సుబ్బరామరెడ్డి, బొమ్మా శేషరెడ్డి, దువ్వూరు బలరామరెడ్డి, బత్తెన రామకృష్ణారెడ్డి నోటీసులు వచ్చినవారిలో వున్నారు.

గూడూరులో పెద్ద ఊరేగింపు; దేశిరెడ్డి శేషరెడ్డి ఉపన్యాసం; ఎంతో ఉత్సాహంతో వందలాది ప్రజలు మమ్మల్ని అనుసరిస్తుండగా కోర్టుకు హాజరయ్యాము. విచారణ క్లుప్తంగా ముగిసింది; తలా మూడు నెలలు జైలుశిక్ష విధించారు. నాకుమాత్రం బి క్లాసు యిచ్చి వెంటనే రాయవెల్లూరు జైలుకు తీసుకపోయారు.

అప్పటికే, రాయవెల్లూరు జైలులో భోగరాజు

నేను విడుదలయి వెలుపలికివచ్చేసరికి బెజవాడ శివకోటారెడ్డి జైలువద్దనే కాచుకొని వుండినారు. ఇద్దరంకలిసి మద్రాసుకు వచ్చాము; తర్వాత నేను 29 తేదీ నెల్లూరు చేరినాను.

నేను నెల్లూరు చేరేటప్పటికి, మదనమోహన్ మాలవ్య, విఠల్‌భాయ్‌పటేల్ తదితరనాయకుల అరెస్టుకు నిరసనగా వి. ఆర్. కాలేజి విద్యార్థులు సమ్మెచేస్తున్నారు. నేను కాలేజిమీదుగా మూలపేటకు వస్తుండగా, విద్యార్థులు నన్ను ఆపి, మధ్యాహ్నం తాము చేయబోతున్న ఊరేగింపులో నన్ను పాల్గొనవలసిందిగా ఆహ్వానించారు. నేనందుకంగీకరించి, మధ్యాహ్నం 3 గంటలకు కాలేజికి పోయినాను.

ఊరేగింపు కాలేజినుంచి బయల్దేరి జిల్లాబోర్డు ఆఫీసు మూలదగ్గరకు చేరేసరికి పోలీసు అధికారి మునిలాల్ నన్ను అరెస్టుచేసినాడు. ఆరాత్రి నన్ను నెల్లూరు టౌను పోలీసు స్టేషనులో వుంచినారు. సెప్టెంబరు 1తేదీ నెల్లూరు తాలూకాఫీసులో సబ్ మేజిస్ట్రేట్ శ్రీరాములునాయుడు విచారణ జరిపి, నాకు ఆరునెలలు కఠినశిక్ష విధించి, ఏ క్లాసు యివ్వకుండా నన్ను వెల్లూరు జైలుకు పంపించి

# CONTINENTAL DIELECTRICS

EXPORTERS OF FABRICATED MICA CUT PARTS

( Spacers, Washers., Trimmers & Heater Elements )

GUDUR (Nellore Dt.)



Precision and workmanship our Speciality

---

ఫోన్ : 59

# ALANKAR JEWELLERY

## అలంకార్ జ్యూయలరి

Prop : Sait Javanmull Kushalchand & Co.,

చిన్నబజారు : నెల్లూరు.

22ct. Guaranteed upto-date Jewellers

and

ORDER SUPPLIERS

నూతనసంవత్సర శుభాకాంక్షలతో

మా ఖాతాదారులందరిని మరల, మరలా విచ్చేయవలసిందిగా కోరుచున్నాము.

నారు. ఫలానా క్లాసు అని పేర్కొనకపోతే జైలు పరిభాషలో 'సి' క్లాసు అనిఅర్థం. అందువల్ల రాయవెల్లూరు క్వారెన్‌టైన్‌లో సి క్లాసులో, సిక్లాసు దుస్తులుధరించి, వారిభోజనం చేసినాను; రాళ్ళుకొట్టే పనిచేసినాను; చేసినట్లు నటించాను.

తర్వాత నన్ను బి క్లాసుకుమారుస్తూ ప్రభుత్వం నుండి సెప్టెంబరు 22 తేది ఉత్తర్వులు వచ్చాయి. బి క్లాసులో అన్ని జిల్లాలకు చెందిన కొన్ని వందల మంది రాజకీయ ఖైదీలుండినారు. రాజగోపాలాచారి, పట్టాభిసీతారామయ్య తదితరులు ఎ క్లాసులో వుండినారు. అప్పట్లో గంజాంజిల్లా మద్రాసు రాష్ట్రంలో వుండింది కాబట్టి, విశ్వనాథదాసు వగైరాలుకూడా ఆ జైలులోవుండినారు. బిక్లాసు ఖైదీలు ఎక్లాసుకు పోవడానికి అనుమతి ఉండేది. అప్పుడు జైలులో కొంత చదువుసంధ్యలు సాగాయి. కఠిన శిక్షఅయినా, పనేమీ ఉండేదికాదు. గాంధీ-ఇర్విన్ ఒప్పందం క్రింద రాజగోపాలాచారిని, పట్టాభిని, తర్వాత మట్నూరి కృష్ణారావుగారిని జైలునుండి విడుదల చేశారు. ఆ రోజు జైలంతా అత్యంతోత్సాహంగా వుండింది; ఎవరెవరి గదుల్లో వాళ్ళు నినాదాలుచేసి, తమ ఉత్సాహాన్ని ప్రకటించుకున్నారు.

నన్ను 1931 ఫిబ్రవరి 7 తేదీన విడుదలచేశారు. అంతకుముందురోజున్నే – 6 తేదీన - మోతిలాల్ నెహ్రూ చనిపోయినందువల్ల, వెల్లూరులో హర్తాళ్ జరిపినారు. తర్వాత గాంధీ – ఇర్విన్ ఒడంబడిక కుదరడం, రాజకీయఖైదీలందరూ విడుదలకావడం జరిగింది.

1931 లో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సమావేశంలో గంపలగూడెం కుమారరాజా అధ్యక్షులుగాను, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రధాన కార్యదర్శిగాను, న్యాపతి నారాయణ మూర్తి, నేను సంయుక్త కార్యదర్శులుగాను ఎన్నికయ్యాము అప్పుడే నేను అఖిలభారత కాంగ్రెసుసంఘ సభ్యుడుగాకూడా ఎన్నికయినాను.

పటేల్ అధ్యక్షత క్రింద సమావేశమైన కరాచీ కాంగ్రెసుకు నేను హాజరయినాను. భగత్‌సింగ్‌ను, ఉరితీసింది అప్పుడే. ఆ విషాదఛాయలలోనే ఎ. ఐ. సి. సి. సమావేశం జరిగింది. తర్వాత ఇర్విన్ పోవడం, వెల్లింగ్డన్ వైస్రాయిగా రావడం, ఒడంబడిక తారుమారు కావడం, మహాత్ముడు రౌండుటేబిల్ సమావేశాలకు హాజరయి, రిక్తహస్తాలతో తిరిగిరావడమూ జరిగింది. 1932 లో గాంధీజీని అరెస్టు చేశారు; మళ్ళీ ఉద్యమం ప్రారంభమయింది.

విదేశీవస్త్రాలు బహిష్కరించవలసిందంటూ ట్రంకురోడ్డుగాంధీ బంగళాముందు శ్రీమతి పొణకా కనకమ్మ సత్యాగ్రహం చేసింది. మమ్మల్ని అరెస్టు చేసి, నెల్లూరు సబ్ జైలులోవుంచి, మేనెల 26తేదీన మా యిద్దరికీ చెరి 18 మాసాలు కఠినశిక్ష, నాకు అదనంగా రు 500లు జుల్మానా విధించి వెంటనే వెల్లూరు సెంట్రల్ జైలుకు తీసుకపోయారు.

అప్పుడు వెల్లూరుజైలులో మాతోపాటు రంగాగారు, నంబూద్రిపాద్, బెజవాడ శివకోటారెడ్డి, బెజవాడ వెంకటకృష్ణారెడ్డి వుండినారు. తర్వాత సత్యాగ్రహం సన్నగిలింది. కాలవ్యవధికి కొంచెం ముందుగానే - 1933 జూన్ 30 తేది – నన్ను, కనకమ్మగారిని విడుదలచేసినారు.

హరిజనులకు ప్రత్యేక ప్రాతినిధ్యం కల్పించే మ్యాక్‌డొనాల్డ్ పథకానికి నిరసనగా గాంధీజీ ఎరవాడ జైలులో నిరసన వ్రతం బూనినారు. అప్పుడు నాయకులందరూ సమావేశమై, అంబేద్కర్ తో రాజీకుదిర్చి, గాంధీజీ వ్రతం మానుకునేట్టు చేశారు. అప్పుడు టాగోర్ చేత గాంధీజీకి నిమ్మరసం అందింపజేశారు; టాగోర్ అప్పుడొక గీతాంజలి గీతంకూడా గానంచేశారు. ఇదంతా నేను జైలులోవుండగా జరిగింది.

1934లో హరిజనోద్ధరణ నిధికోసం గాంధీజీ ఆంధ్రదేశం సంచరించారు. నెల్లూరు జిల్లాలో ఆయన పర్యటనను నేను యేర్పాటుచేసి, ఆయనతో జిల్లాలో నేకాక, రేణిగుంట కడప, అనంతపురం ప్రాంతాలపర్యటనలోనూ కూడావున్నాను. తర్వాత ఆయనతో బెంగుళూరుదాకా వెళ్ళినాను.

1936లో జిల్లాబోర్డు ఎన్నికలు జరిగాయి; మొట్టమొదటి సారిగా కాంగ్రెసు పోటీచేయడానికి నిశ్చయించుకున్నది. నేను కోవూరు నియోజక వర్గంనుండి పోటీలేకుండా ఎన్నికయ్యాను. ఎన్నికల తర్వాత జిల్లా బోర్డును రెండుగా విభజించి, రెండింటికీ కొందరు సభ్యులను నామినేట్ చేశారు. అప్పుడు బొబ్బిలి రాజాగారు ముఖ్యమంత్రిగాను, స్థానిక పరిపాలనాశాఖ మంత్రిగాను ఉండేవారు. నెల్లూరు దక్షిణపు బోర్డుకు పెల్లేటి వెంకటసుబ్బారెడ్డి అధ్యక్షుడయ్యారు. ఉత్తరపు బోర్డుకు పొణకా గోవిందరెడ్డి నేను పోటీచేశాము.



డాక్టర్ గోపాలరెడ్డి

కాంగ్రెసు శిబిరంలో 19 మంది సభ్యులున్నారు. అందరూ ఓటింగుకు కావలికి వెళ్ళాము. కానీ ఓట్లు లెక్కించగా నాకు 18ఓట్లు వచ్చాయి. ఒక్కఓటు తేడాతో గోవిందరెడ్డిగారు గెలిచారు.

1937 ఎన్నికల తర్వాత నేను స్థానిక పరిపాలనాశాఖ మంత్రి నయ్యాను; విభజన బోర్డులను రద్దుచేసి, జిల్లాకంతటికీ ఒకే బోర్డును ఏర్పాటు చేశాము అప్పుడే ఒంగోలుజిల్లా బోర్డు అధ్యక్షులుగా వుండిన కాసు బ్రహ్మానందరెడ్డిగారు, విభజన రద్దు కాగానే పదవీ విరమణ చేశారు.

1937 ఎన్నికలలో కావలి, కోవూరు, ఉదయగిరి తాలూకాల నియోజకవర్గానికి నేను పోటీ చేయవలసి వుండింది. అప్పుడు జస్టిస్‌పార్టీ తరఫున బెజవాడ రామచంద్రారెడ్డిగారు మద్రాసు కౌన్సిలు అధ్యక్షులుగా వుండేవారు. వారిని నేను ఎదుర్కొనవలసివచ్చింది. అప్పుడు నేను కందుకూరు నియోజకవర్గంనుండి పోటీ చేస్తే, రామచంద్రారెడ్డిగారి అనుచరులంతా సహాయం చేస్తారని నాకు ఒక సూచన అందింది. కానీ కాంగ్రెసు ఉద్యమంలో ఎక్కువగా కోవూరు తాలూకావారు జైలుకు పోయారుగనుక, నేను ఆ స్థానంనుండి పోటీ చేయడమే ఉచితమని నిర్ణయించుకొన్నాము.

నేను ఎన్నికలరంగంలో దిగినప్పుడు గెలుస్తానని ఆశలేదు జిల్లా బోర్డు ప్రత్యర్థుల చేతిలో వుండడం, వారు కౌన్సిల్‌లో వుండడం, వారి బంధువర్గం వారి జమీందారీ గ్రామాలు ఉదయగిరి

తాలూకాలో వుండటం—ఈ కారణాలవల్ల నాకు గెలుస్తామనే ధైర్యం లేకపోయింది. పైగా నాకు ఉదయగిరి తాలూకాతో కొత్తగా పరిచయం లేకుండా వుండింది.

1937 జనవరి 10 తేది కావలిలో డాక్టరు కనుమర్ల సుబ్బరామయ్య తదితరులు 'కాంగ్రెస్ ప్లాట్‌ఫామ్' ఏర్పాటుచేసినారు. ఆ సభకు తూములూరు శివరామయ్య అధ్యక్షత వహించినారు. నేను కాంగ్రెసునుగూర్చి ఉపన్యసించినాను; రామచంద్రారెడ్డిగారు జస్టిస్ పార్టీ, వారి ప్రభుత్వం వగైరా విషయాలు చెప్పినారు. ఆయన ఉపన్యాసానికి నేను ఉత్సాహంగా జవాబు యిచ్చినాను. రీడింగ్‌రూము ఆవరణంలో జరిగిన ఆ సభకు కోవూరు, కావలి తాలూకాల్లోని పెద్ద రైతులు దాదాపు రెండువేలమంది హాజరైనారు. సభానంతరం నన్ను కావలి పురవీధులలో ఊరేగింపు చేయడం, అక్కడక్కడా హారతులివ్వడంతో నా ఉత్సాహం మరింత పెరిగింది. ఆ ఊరేగింపులు, ఆ హారతులు ఎన్నికలయ్యేదాకా సాగుతూనే వున్నాయి. ఉదయగిరితాలూకా గ్రామాలలో నేనూహించనంత ఉత్సాహం పెల్లుబికింది. ఆ రోజులలో 'జమీన్ రైతు' పత్రిక నాకు ఎంతైనా సహాయపడింది. అందులో కార్టూన్ లైతేనేమి, సింగిపోడెలు, ఓటుకన్యా వివాహ ప్రకటనలు, ఓటర్లనందర్నీ హాజరు కమ్మని ఆహ్వానించడం—ఇట్లా అనేక విధాలుగా 'జమీన్ రైతు' నాకు ప్రచారం చేసింది. తద్వారా నెల్లూరు వెంకట్రామానాయుడుగారి శక్తి సామర్థ్యాలు బాగా వెల్లడయ్యాయి.

ఫిబ్రవరి 18తేదిన ఎన్నిక జరిగింది. 20తేది నాడు కందుకూరు నియోజకవర్గపు ఎన్నిక జరిగింది. అక్కడ వెంకటగిరి కుమారరాజాతో బత్తిన పెరుమాళ్లనాయుడు పోటీచేశారు. ఆ నియోజకవర్గంలో నేను 19, 20 తేదులలో తిరిగి, ప్రజల ఉత్సాహాన్ని తిలకించినాను. అక్కడనుండే గూడూరుకు- కుమారరాజా ఓడిపోవడం తథ్యం అని- ఒక టెలిగ్రాం యిచ్చినాను. గూడూరులో బద్దెపూడి వెంకటనారాయణరెడ్డిగారు, కుమారరాజా తమ్ముడు రెండవ రాజకుమారుడు పోటీ చేస్తుండినారు. నా టెలిగ్రాం ప్రజలను బాగా ఉత్తేజపరచింది.

ఫిబ్రవరి 23 తేది ఓట్ల లెక్కింపు జరిగింది. నేను, నా ఎలక్షన్ ఏజెంటు మేనకూరు సీతారామరెడ్డి హాజరైనాము. బెజవాడ రామచంద్రారెడ్డిగారు రాలేదు. ఆయనకు 7 వేలా చిల్లర ఓట్లురాగా, నాకు 20 వేలాచిల్లర ఓట్లువచ్చినవి. మొత్తం 84శాతం ఓట్లు పోల్ అయినవి. మద్రాసు రాష్ట్రంలో మరెక్కడా అంత ఎక్కువ ఓట్లు పోల్‌కాలేదు. ఉదయగిరి తాలూకాలో బెజవాడ రామచంద్రారెడ్డిగారికి 1500 ఓట్లు మాత్రం వచ్చాయి; నాకు 5 వేలా చిల్లర ఓట్లు వచ్చాయి. రెండవరకంగా కావలి తాలూకాలో, మూడవరకంగా కోవూరు తాలూకాలో వచ్చాయి.

ఉదయగిరి తాలూకాలో ఎన్నికల సంరంభం వేలంవెర్రిగా వుండింది. కొన్ని గ్రామాలలో నన్ను 'గోపాలస్వామి' అని పిలిచి, ఆడవాళ్ళంతావచ్చి నమస్కారాలు చేసేవాళ్ళు. తాలూకాలోని అన్ని గ్రామాలూ తిరిగాను. ఎక్కడబట్టినా ఊరేగింపులు, కొన్నిచోట్ల హారతులు!

ఆ ఎన్నికలో నేను దాదాపు 250 ఉపన్యాసాలు చేశాను. జిల్లాలో నాల్గుస్థానాలనూ కాంగ్రెసు గెలుచుకొన్నది. నెల్లూరులో ఓరుగంటి వెంకట సుబ్బయ్య గెలిచారు. ఆంధ్రదేశంలో రెండు జనరల్ స్థానాలుతప్ప మిగతవన్నీ కాంగ్రెసుకే దక్కాయి. బందరులో చల్లపల్లిరాజాగారు గొట్టిపాటి బ్రహ్మయ్యను, నర్సాపురంలో జి. వెంకటరెడ్డి నాయుడు కొవ్వలి గోపాలరావును ఓడించారు. తమిళనాడులో ఒక్కస్థానం మాత్రం పోయింది. ముఖ్యమంత్రి బొబ్బిలిరాజాగారు, కౌన్సిల్ అధ్యక్షులైన బెజవాడ రామచంద్రారెడ్డిగారు, పిఠాపురం రాజా, ఆయన కుమారుడు, వెంకటగిరి కుమారరాజా, ఆయన తమ్ముడు – వీరందరూ ఓడిపోయారు; ఒక్క విజయనగరం మహారాజామాత్రం కాంగ్రెసు మద్దతుతో గెలిచినారు. అధికారంలో వుండిన జస్టిస్‌పార్టీకి 16 స్థానాలు మాత్రమే వచ్చాయి. వాటిలోకూడా క్రైస్తవులు, మహమ్మదీయులు, జమీందార్ల ప్రత్యేక నియోజకవర్గాల నుండి ఎన్నికైనవారే ఎక్కువగా వుండినారు.

పార్టీ నాయకత్వానికి టంగుటూరు ప్రకాశం పంతులుగారుకూడా ప్రయత్నం చేశారుకానీ కడపటికి రాజగోపాలాచారిగారు ఏకగ్రీవంగా ఎన్నికయినారు. అప్పుడు పార్టీ ఎన్నికలలో నన్ను 'విప్'గా ఎన్నుకున్నారు.

గవర్నరు తన ప్రత్యేక అధికారాలను వినియోగించబోనని వాగ్దానం చేస్తేతప్ప, కాంగ్రెసు అధికారం స్వీకరించదని వర్కింగ్ కమిటీ తీర్మానించింది. కనుక ఏప్రిల్ 1తేదిన కాంగ్రెసుపదవీ స్వీకరణ నిరాకరించగా, ప్రభుత్వంచేత ఎగువ సభకు నియమింపబడిన సర్ కె. వి. రెడ్డినాయుడు గారి ముఖ్యమంత్రిత్వంలో ఆర్గురు మంత్రులతో ఒకతాత్కాలిక మంత్రివర్గంఏర్పడింది. జూలైనాటికి కాంగ్రెసుకు, బ్రిటిష్ ప్రభుత్వానికి రాజీకుదిరి, గవర్నరు తన విశేషాధికారాలను వినియోగించవని వాగ్దానం చేయడంతో, కాంగ్రెసువారు పదవి స్వీకరించడానికి నిశ్చయించుకొన్నారు.

1937 జులై 14 తేదీన రాజగోపాలచారి మంత్రివర్గం పదిమందితో ఏర్పడింది. ఆంధ్రదేశంనుండి ప్రకాశం, గిరి, నేను, చిత్తూరు మహమ్మదీయ నియోజకవర్గం నుండి ఎన్నికయిన తెలుగువాని యాకూబ్ హుస్సేన్ మంత్రివర్గంలో చేరినాము. నేను మంత్రినవుతానని ఏనాడూ ఊహించలేదు. అసెంబ్లీలో కడప కోటిరెడ్డి, టి. ఎన్. రామకృష్ణారెడ్డి, ఎన్. రంగారెడ్డి, ఎన్. శంకరరెడ్డి, హెచ్. సీతారామరెడ్డి వగైరా 15 మంది రెడ్లు వుండినారు. వారందరిలోనేను వయస్సులో చిన్నవాణ్ణి ఐతే వారిలో నేనొక్కణ్ణే జైలుకు పోయినవాణ్ణి. రాజగోపాలచారి నన్ను జైలులోకూడా గమనిస్తుండే వారని, తర్వాత వారే బహిరంగంగా చెప్పినారు. ఏమైనా, ముప్పయి యేళ్ళయినా రాకముందే నేను మంత్రినయ్యాను; 1920 నుండి ముఖ్యమంత్రి అధీనంలో వుంటుండిన స్థానిక పరిపాలనశాఖ నాకు అప్పగించబడింది.

బ్రిటిష్‌వారు మనతో సంప్రదించకుండా జర్మనీ మీద యుద్ధం ప్రకటించడంవల్ల, ఆరు రాష్ట్రాలలోని కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా చేయడానికి నిశ్చయించినాయి. తొలుత రాజీనామాచేసింది మద్రాసుప్రభుత్వమే. 1937 అక్టోబరు 30 తేదీ నాడు మేము రాజీనామాచేసి, గవర్నరు లార్డ్ ఎర్‌స్కిన్ వద్ద సెలవు తీసుకొని వచ్చినాము. ఆ రోజులలో గవర్నరు మంత్రివర్గ సమావేశాలకు అధ్యక్షత వహిస్తుండేవారు. సెక్రెటేరియెట్‌లో శాఖాధిపతులలో ముప్పాతిక వంతుకు పైగా ఆంగ్లేయులే వుండేవారు. కాంగ్రెసు మంత్రుల రాజీనామా తర్వాత, ముగ్గురు అడ్వయిజర్లు నియమింపబడినారు.

తిరిగి 1946 మేవరకు ప్రజాప్రభుత్వం ఏర్పడలేదు. 1940లో యుద్ధానికి వ్యతిరేకంగా వ్యక్తిగత సత్యాగ్రహం జరిగింది. మంత్రులుగా, శాసనసభ్యులుగా వుండినవారు మళ్లీ జైళ్ళకు పోయారు. యుద్ధానికి వ్యతిరేకంగా జిల్లాలో సత్యాగ్రహం జరి

పినవారిలో మొదటి జట్టులోనే నేనున్నాను. నవంబరు 26తేది బుచ్చిరెడ్డిపాళెంతో మాజట్టు యుద్ధానికి వ్యతిరేకంగా నినాదాలు చేసింది. మమ్మల్ని అరెస్టుచేసి, కావలి డెప్యూటీ కలెక్టరు నాకు ఒక సంవత్సరం కఠినశిక్ష, రు 1000 లు జుల్మానా విధించాడు. మేము మొదట నెల్లూరుకు, తర్వాత తిరుచురాపల్లి జైలుకు తరలింపబడ్డాము.

1941 అక్టోబరు 6తేది రాజగోపాలాచారి, ప్రకాశంపంతులు, నేను విడుదలయ్యాము. రాజగోపాలచారిగారి కడపటి కారాగారవాసం అదే.

1942 ఆగస్టు 9తేది బొంబాయిలో 'క్విట్ ఇండియా' తీర్మానం ఆమోదింపబడింది. ఆ సమావేశంలో నేనూవుండి, తీర్మానానికి అనుకూలంగా ఓటుచేశాను. తర్వాత అన్నిరాష్ట్రాలలో నాయకులందరినీ అరెస్టుచేశారు. కానీ నన్నుమాత్రం చెయ్యలేదు. అందుకు కారణం బహుశా కాంగ్రెసు తీర్మానాన్ని వ్యతిరేకించిన రాజగోపాలాచారితో వున్నానని ప్రభుత్వం భావించి వుండవచ్చు ఐతే జిల్లా బోర్డు, మునిసిపల్, పంచాయితీ సభ్యులను, అధ్యక్షులను యుద్ధానికి సహాయం చేయవద్దని నేను, వంగల్లు కోదండరామరెడ్డి జాబులు వ్రాశాము; దానిమీద అక్టోబరులో మమ్మల్ని అరెస్టుచేసి, ఆరునెలలు కఠినశిక్ష విధించి, బళ్ళారి ఆలీపురం జైలుకు పంపినారు.

జైలునుంచి విడుదలకాగానే, నన్ను గేటువద్దనే తిరిగి అరెస్టుచేసి, వెల్లూరుకు డెటిన్యూగా తీసుకపోయారు. 1943 నవంబరులో నేను ఒక నెల పెరోల్‌మీద విడుదలయ్యాను. మళ్ళీతిరిగి తంజావూరుకు పోయేటప్పటికి విడుదల ఉత్తర్వులు వచ్చాయి. అదే నా కడపటి కారాగారయాత్ర. నా రాజకీయ జీవితంలో ఆరుసార్లు జైలుకు వెళ్ళాను; మొత్తం నాలుగు సంవత్సరాలు జైలులో గడిపాను.

1946 అసెంబ్లీ ఎన్నికలలో నేను తిరిగి పోటీ చేసినాను. నా ప్రత్యర్థి డిపాజిట్టు కోల్పోయినాడు. మళ్ళీ 1947 మార్చిలో నేను మద్రాసు ఆర్థిక మంత్రి నయ్యాను. 1952 జనవరిలో జరిగిన ఎన్నికలలో ఉదయగిరి నియోజకవర్గంలో పోటీచేసి ఓడిపోయేంతవరకు నేను మద్రాసు ఆర్థికమంత్రిగా, రవాణాశాఖమంత్రిగా, శాసనసభా నాయకుడుగా వుంటూ వచ్చినాను. రాష్ట్ర విభజనానంతరం ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు అయ్యాను; 1955 ఎన్నికలలో ముఖ్యమంత్రినయ్యాను. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత, హైదరాబాదులో హోంశాఖ మంత్రిగా కొన్నాళ్ళు, ఆర్థిక శాఖ మంత్రిగా కొన్నాళ్ళు వున్నాను. తర్వాత 1958 ఏప్రిల్‌లో కేంద్రప్రభుత్వంలో మంత్రి నయ్యాను.

1962 పార్లమెంటు ఎన్నికలలో బెజవాడ రామచంద్రారెడ్డిగారితో — నేనప్పుడు జబ్బుగావున్నా— పోటీచేసి గెలుపొంది, కేంద్రమంత్రివర్గంలో క్యాబినెట్ మంత్రి నయ్యాను. తర్వాత 1963 ఆగస్టు 24 తేది 'కామరాజ్ పథకం' క్రింద మంత్రి పదవికి రాజీనామా చేసినాను.

1965లో లాల్‌బహదూర్‌శాస్త్రి గారు ప్రధాన మంత్రిగా వుండగా, నేను కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ ఉపనాయకుడనయ్యాను. తర్వాత 1967మే 1 తేదీ ఉత్తరప్రదేశ్ గవర్నరుగా నియమింపబడ్డాను; ఆ పదవిలో అరవై రెండు నెలలు వున్నాను. నా రాజకీయ జీవితంలో మొత్తంమీద ఇరవై సంవత్సరాలా ఎనిమిది నెలలపాటు అధికారంలో వుండినాను. 1972 జూలైనుంచి రాజకీయాలతో నికట సంబంధం లేకుండా ఉన్నాను.

నా రాజకీయ జీవితానికి పునాది 1921లో నేను స్కూలు వదలడం. తర్వాత అన్ని సత్యాగ్రహోద్యమాలలో పాల్గొనడం, మద్రాసు, కర్నూలు, హైదరాబాదు, ఢిల్లీలలో మంత్రికావడం, ఉత్తరప్రదేశ్‌లో గవర్నరుకావడం—ఇవన్నీ ఆ పునాదిని ఆధారంచేసుకున్నవే. స్కూలు వదలింది మొదలు, పదవి విరమించేదాకా కాంగ్రెసు ఒడిలోనే పెరిగినాను; ఈ నాటికీ కాంగ్రెసులోనే వున్నాను.

దేశ స్వాతంత్ర్యంకోసం ఉద్యమాలలో పాల్గొనడంలో వుండినంత ఉత్సాహం, ఎన్నికల పోరాటాలలో వుండేదికాదు. కానీ నా జీవితంలో ఒక సంఘటన ననుసరించి మరొకటి జరిగాయి. నేనుచేసిన త్యాగాలకన్నా, పొందిన గౌరవాలు, పదవులు ఎక్కువ. ఒకముఠాకట్టి, కొంతమంది అనుచరులను ఏర్పరచుకోవాలని కానీ, నా సొంత పలుకుబడిని పెంచుకోవాలనికానీ నేనెప్పుడూ ప్రయత్నించలేదు. ఇప్పుడు రంగస్థలం నుంచి వైదొలగి, దేశంలో జరుగుతున్న పరిణామాలను— కాంగ్రెసు అభిమానిగా—వీక్షిస్తున్నాను. నాకన్నా పెద్దలైనవారు పదవులలో వున్నారు; రాజకీయాలలో వుంటూ ఎన్నికలలో పోటీచేస్తున్నారు. నేను మాత్రం పండి రాలిన పండుమాదిరిగా పరిస్థితులు గమనిస్తున్నాను.

—ఇదీ సంక్షిప్తంగా నా జీవితగాథ.

# నెల్లూరు నగరమా!

—శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు

ఓసి! నెల్లూర్ నగరమా! న
వ్యాంధ్రి జడలో పూలసరమా!
నిను దలంచిన నా మనస్సున
నిలుచు ఊహలు చెప్ప తరమా?

పెన్నలో జలకమ్ము లాడీ
పెన్నరుల కురులార్చు కొనునొక
నగ్నసుందరి వోలె నా నయ
నమ్ములకు సాక్షాత్కరింతువు

రంగనాయకు మ్రోల నృత్యపు
భంగిమలు జాల్వార్చు ఆచ్చపు
భోగ సతిగా, రాగ రతిగా
సాగి స్వాగతమిచ్చు దానవు

శిరము దర్గామిట్ట కాగా
ఉరము పురమందిరముకాగా
సంతపేటను పీఠిపై కూ
ర్చున్న నీవొక మహారాజ్ఞివి

షాపులన్నీ సన్న జాజులు
మూపురముపై మల్లెమాలలు
ట్రంకురోడ్డే వాలు జడగా
తన్వి! నీ వయ్యారమెంతును

నాడు నెల్లూరనగ నెలజా
జాలకు నిలయమ్మంచు వింటిని
నేడు నిన్నే జాణగా వగ
లాడిగా నేనెన్ను కొంటిని

నెల మొదట మా మనీ పర్సుల
ఘలఘల కవ్వించి, కిలకిల
నవ్వులను రువ్వెదవు-కోర్కెల
త్రవ్వెదవు గద జవ్వనీ!

మాస మధ్యమునుండి మాకవ
మాన కరములు నీదు దృక్కులు
అవును నీవొక పద్మి వెలయా
లంచు చెప్పును నాదు వాక్కులు

అయిన నేమాయెను లతాంగి!
అన్ని దొసగులు మరచు భంగి
నీ పురావర్తనము నాచే
నిండు నివ్వాళులను పొందును

ఒక మహాకవి తిక్కయజ్వను
ఒనరగా గారవము సల్పితి
వదే ఆంధ్రులు నిన్ను మరువని
సుధా సదృశ దివ్యస్మరణము

వర్ధమాన సమాజమను స
ద్వర్తనముగల సాహితీ కే
దారమున కొక నెలవునిచ్చితి
దానికీర్తికి బలము గూర్చితి

వర్తమానపు నవ్య కవితా
వనిత ఎక్కిన మేలి పల్లకి
చేత నెత్తిన మొదటి బోయీ
సుతుడు నీకు పఠాభి భాయీ

అందుకే కాదందుకే కా
దెందులకు నిను పొగడుచుండుట
ఎన్ని కరవులు వచ్చినా నీ
వన్నపూర్ణవు ఆంధ్ర ధాత్రికి

నీదు భాషా నీదు వేషం
నీదు డెందపు దిద్విలాసం
ఉన్న తీరూ, పెన్న నీరూ
ఎవ్వరెన్నడు మరవలేరు

ఓసి! నెల్లూర్ నగరమా! న
వ్యాంధ్రి మెడలో పూలసరమా!
నినుదలంచిన నా మనస్సున
నిలుచు ఊహలు చెప్పతరమా?



# నెల్లూరిసీమ
# ఆధునిక సంస్కృతీ సాహిత్యాలు

"పెన్నదాటితే పెరుమాళ్ళసేవ" అని ఎప్పుడు ఎవరు ఎందుకన్నారోగాని, ధూర్జటి 'సుప్రయోగ'గా పేర్కొన్న పెన్నేరులోనే ఆంధ్రదేశం ప్రాదేశికంగా అంతమౌతుందనే భావం నేటికీ వుంది. 'అరవ' ప్రభావ ముద్ర వేషభాషలపైపడి నెల్లూరు తెలుగుదేశాన్నీ తమిళదేశాన్నీ చెరోచేత కలిపిస్తూ రావడం, ఈ ప్రాదేశికస్థితి ఫలితమే. ఆంధ్రోద్యమ ప్రారంభంలో ప్రత్యేక రాష్ట్రనిర్మాణాన్ని వ్యతిరేకించిన నెల్లూరీయులను గుర్తు చేసుకోవాలి. ఈ స్థితి మంచిచెడ్డ కలనటుంది, ఇలాంటి ఏ కడభూమిలోనైనా మాతృసంస్కృతి పట్ల ప్రదర్శించే అభిమానం దురభిమానంగాకూడా వికటించడమనేది ఒక మనోవిశేషధర్మం. తక్కిన దేశంసమస్తం విడనాడిన వెనకటి ఆచార వ్యవహారాలు ఇలాంటి కడభూమిలో చలామణి అవుతూ వస్తాయి. పాతకింకా రోత ఏర్పడదు. సూక్ష్మంలో చెప్పాలంటే, ఇలాంటి కడభూమి వర్తమానకాలం మీనభూతకాలం ఎక్కికూర్చుని ఉంటుంది. ఇది విపరీత చిత్తవృత్తి.

1927–28లో కాటోలు దువ్వూరి రామిరెడ్డి తన నాటకాన్ని ఎవరో ప్రదర్శిస్తుంటే చూచి తిరిగి వస్తూ, దారిలో వేదం వేంకటరాయశాస్త్రి (వే. వేం. శా.)ను చూచి ఆయన ఏమంటాడోనని ముఖం తప్పించాడట! ఈ సన్నివేశం పూర్తి వైయక్తిక విశేషమేనా? సాంప్రదాయికత సమక్షాన ఆధునికత ఆత్మవిశ్వాసబలంతో కాలూని నిలవలేకపోయిందని అంతరార్థం.

ఏభైఏళ్ళ పిదప నేడు నెల్లూరి పరిస్థితి దాదాపు ఇదే. కవిత్రయుజయంతుల మొదలు వర్ధమాన సమాజ ఆధ్వర్యాన('ఆధ్వర్యవమున' అనమంటారేమో నెల్లూరి కోవిదులు?) ఏటేటా సత్కార సన్మానాదికాలతో చర్విత చర్వణాలతో ఉత్సవ కోలాహల వాతావరణంతో, సుప్రసిద్ధ ఆంధ్ర కవులూ కవయిత్రులలో ఎవ్వరూ తప్పిపోకుండా జయంతులూ వర్ధంతులూ నడుపుతున్నారు. ఆధునికాంధ్ర సంస్కృతి, సాహిత్య నిర్మాతలకే ఇక్కడ ఇంకా గుర్తింపైనాలేదు- గౌరవం మాట దేవుడెరుగు! ఏ నోరి నరసింహశాస్త్రి వంటి వారి ప్రయత్నాల ఫలితంగానో తప్ప, తక్కిన దేశంలో ప్రేతప్రాయంగా కూడాలేని 'నవ్య' సాహిత్య పరిషత్తుకే జీవచ్ఛవంగాతప్ప ఇక్కడ సమాదరణ లేదు. అని తేదంటేనే, కందుకూరి, గిడుగు, గురజాడలు, ఈ భూస్వామిక-పండిత సాంప్రదాయిక దుర్గాన ప్రవేశించేదెలా?

గ్రంథాన్ని సంఘసంస్కరణోద్యమం మీదికి వదిలే యుద్ధంలా విసరడం జరగలేదా? దీనికంతటికీ కారణమేమిటి? తెలుగు భాషాపదాలు ప్రాచీన/చ్యుత రూపాల గురించి సాహిత్య అకాడెమీ నెల్లూరి సభ్యులలో నేటికీ పట్టింపు ఉంటున్నదంటే, ఎందుచేత? మరి దాని అధ్యక్షమహాశయుని 'సంప్రదాయ'/పండితప్రియ అభినివేశానికి సామాజిక మూలాలేవైనా ఉన్నాయా? చివరికి, వేమనయోగి కవిత్వాన్ని (తత్వం మాట దేవుడెరుగు!) చినబుచ్చే కపిత్వాలకింకా సమాదరణ ఉంటూందంటే, కారణం? ఏ సీమలో యాత్రై

## శ్రీ కె. వి. రమణారెడ్డి ఎం. ఏ.

యం. యస్. యం. రైల్వేవేతాక కందుకూరి వీరేశలింగం ఎప్పుడో ఒకసారి నెల్లూరికి వచ్చి వెళ్ళాడనే అనుకుందాం. ఆనాటి యువకులలో ఉత్సాహులు కొందరు పూనికచేసి వీరేశలింగం పేరిట ఒక గ్రంథాలయాన్ని సైతం ఏర్పాటు చేశారనికూడా ఒప్పుకుందాం. వీరేశలింగం ఉద్యమం మాట ఏమిటి?

ఇంటర్మీడియెటు తెలుగు వ్యాసరచనకు విద్యార్థులు వాడవలసిన భాషాశైలి విషయంలో చెన్నపట్నాన గ్రాంథిక, వ్యావహారికాల మధ్య సంకుల సమరం సాగుతున్న సందర్భంలో, (1910-13), తెలుగుదేశపు జమీందార్లతో నెల్లూరి రెడ్లతో కలిసి కొందరు పండితులు ఏ భాషాశైలికి వత్తాసి ఇచ్చినట్టు? వేంకటగిరి, పిఠాపురం రాజాల చేదోడుతో తలెత్తిన ఆంధ్ర సాహిత్య పరిషత్తులో, జయంతి రామయ్య పంతులు గొంతుసైతం వినబడనంతగా గొంతు చించుకున్న వేదం పండితకవే. ఒకప్పుడు 'స్త్రీ పునర్వివాహ దుర్వాద నిర్వాపణమ'నే వివాద సంవత్సరాల కిందటే తనకు "ఆశుకవితాసన్న్యాసమిప్పించుపుమా!" అంటూ వాణిని రాయప్రోలు సుబ్బారావు వేడుకున్నారో ఆ సీమలోనే కళాశాలాపండితు లప్పుడప్పుడు ఆశుకవితాప్రదర్శనలు జరపడానికి ఏమిటి సామాజిక కారణం? నెల్లూరికింకా వెనకబాటు తప్పలేదు. చేసవస్తూ చస్తూ ఉందికాబట్టి పుస్తకింకా రొడ్డుగా ఉంటూంది. ఇది సంప్రదాయాభిమానమైనా మేలే. నిజానికిది సంప్రదాయ దాస్యం

ఈ శతాబ్ది ముఖాన పొద్దుపొడిచేనాటికి నెల్లూరిసీమది ఇంకా నిద్రమంచమే. కొత్తగా రైలుబాట వచ్చి 'పట్నం'తో ముడిగలిపిందిగాని లేకుంటే, ఇంకా చాలాకాలందాకా పల్లెటూళ్ళు 'పెద్దకాపు'ల అదుపాజ్ఞలకు లోబడి ఉండవలసివచ్చేది. 'గెరండాల'కు జతగా 'సారధి'కూడా పడబట్టి కొంత మేలుజరిగింది. కాస్త ముందుగా 'కలి(ని?)గిరి రిజర్వాయరు' సమకూరింది. 'సన్నకూడు' తిని 'ఉన్నమారాజులు' మాత్రం షోకులకూ రోగులకూ

దిగితే, 'సన్నబియ్యం' మాత్రం పద్దిరెడ్లకూ దాగి పంగటిముద్దలకూ మించి తన అంతస్తు పెంచుకో లేదు. మిషనరీ దొరలూ దొరసానులూ రాబట్టిగాని, లేకపోతే మాలమాదిగలు నేటికీ నేలకంటుకున్న వెంపలి చెట్లుగానే ఉండిపోయేవాళ్ళు; 'రెడ్డిదబ్బు' పొన్నగర్రలతో తంగుడ్లతో పిల్లతో తమ్ములతో ఇంకా తన పెద్దరికాన్ని సాగిస్తూ ఉండేది. 'సర్కారుబళ్ళు' రాబట్టిగాని, లేకుంటే 'పెద్దపుస్తకం' (భారతం) ఇంకా మనస్సులపైనుంచి దిగి ఉండేదేనా? అరవవాళ్ళ కాఫీ హోటళ్ళు రాబట్టి గాని, లేకుంటే రెడ్డి గుర్రబ్బండి కట్టించుకుని నెల్లూరూ అల్లూరూ తిరిగేవాడా, ఇంటిపట్టునో పని మందట్లో ఉండిపోకుండా? అయితే, నానా రూపాలతోవచ్చిన ఈ ఆధునికత, నెల్లూరి సీమకు దానైతే వచ్చిందిగాని అది సవ్యతగా మాత్రం మారలేదు. అంటే, ఇది చాలామట్టుకు పీకోలు గాలి లోనికిపోని పైపై మార్పు; అంతస్సు మాత్రం ఇంకా గతం గుప్పెట్లోనే ఉంటూ వచ్చిందన్నమాట. భూస్వామ్యమేకాదు, చాలాకాలంగా నిలిచి ఉండిన ఏ సామాజిక వ్యవస్థావిశేషమైనా, ఒక్క పట్టాన మారదు. సామాజిక వ్యవస్థ మారినా, దానికి సంబంధించిన సంస్కృతిమాత్రం మరికొంత కాలంవరకు వెనకటిలాగానే కొనసాగుతుంది. పొద్దుకూకిన వెంటనే చీకటిపడదు — ఈ రెంటినడుమ 'సంధ్యవేళ' ఒకటి ఉంటుంది. అది పగలూకాదు, రాత్రీకాదు; అదీ ఇదీకూడా. అలాంటి అస్పష్ట భావావస్థలోనే ఒక ఇరవై ముప్పయ్యేళ్ళదాకా నడమంత్రంగా ఉంటూ వచ్చింది నెల్లూరిసీమ.

## 2

'పట్నం' నూరుమైళ్లలోనే ఉండడం నెల్లూరికి అనేక విధాలుగా కలిసివచ్చింది. 'అరవ' దేశానికి అవతలే ఉండడంవల్ల, కొన్ని వందలేళ్ళ క్రితమే ఇక్కడికి నానా 'ద్రావిడ' బ్రాహ్మణ శాఖలు వచ్చి స్థిరపడి, తెలుగువాళ్ళలో తెలుగువాళ్ళు కావడమటుంచి, తెలుగువాళ్ళ తలదన్నేంత తెలుగువాళ్ళు కావడం 'పుదూరి ద్రావిడ' బ్రాహ్మణుల్లో కనిపిస్తుంది. వావిళ్ళ, వేదం, పుదూరి, మామిడిపూడి, అల్లాడి, చదలువాడ కుటుంబాల్లో నుంచి భాషా సాహిత్య సేవకులు, పండిత-కవులు, చరిత్ర రచయితలు, న్యాయవాదులు, యావదాంధ్ర ఖ్యాతినే పొందారు. పట్నానికి రైలుబాట పడిన తర్వాత వర్తకానికేమో వైశ్యులు, వ్యాపారులు, విద్యకు మొదట బ్రాహ్మణులు, తర్వాత బ్రాహ్మణేతర కులాలకు చెందిన వ్యవసాయ సంపదగల కుటుంబాల యువకులు పోవడం, పోయి 'కొత్తబుద్ధులు' 'పట్నమానం' అలవాట్లు వెంటబెట్టుకురావడం మొదలైంది. ఏ వెన్నెలకంటి సుబ్రావ్ లాగానో వల్లె చెంచల్రావ్ లాగానో, మెట్టుమీద మెట్టుగా సర్కారు కొలువులో పైకెక్కిపోయే రోజులు చెల్లుతున్నాయి. వాళ్ళ కొలువూ, చదువూ పెనవేసుకోగా, ఇవిమాత్రం విడివిడిగా ఉండిపోయాయి. వాళ్ళలో రాణించింది కొలువైనంతగా చదువుకాదు. వీళ్ళలో చదువైనంతగా కొలువుకాదు. స్వతంత్రమైన వృత్తులంటూ కొన్ని తలెత్తాయిగదా! ఏ మాత్రం చదువు చదివి దంపూరి నరసయ్య పట్నంలో అంత పేరుమోశాడు? అంత పూవు పూసాడు? అంతటి దక్షులు కాలేకపోయినా, ఈ 'పిల్లకారులు' కూడా తమతమ జీవనరంగాల్లో అంతో ఇంతో ప్రయోజకులైన వాళ్ళే. నెల్లూరే పట్నానికి చిన్నసకిలీగా మారసాగిన రోజుల్లో, మిషనరీ 'ఇస్కూళ్ళ' చదువులు పల్లెటూళ్లలో ఉన్నవాళ్ళ 'అబ్బయ్య'లు రావడమూ మొదలైంది. ఇది డెబ్బయ్యేళ్ళ నాటిమాట. అంటే, భూస్వామ్యం చెక్కుచెదరకుండా ఉంటూండగానే, దిగుమతి సరుకువలె పాశ్చాత్య విద్యాసంస్కృతులలోని ధనస్వామ్య వ్యవస్థాధోరణులు సూదిలా దూరి రాసాగాయన్నమాట.

పాండ్య దండయాత్రలు, చోళ దేవాలయ ప్రతిష్ఠలు, హరిహరాద్వైత భావాలు, ఇంకావస్తే 'అబ్దుల్‌నబీఖాన్ హయాము'లోనో ముందువెనకలుగానో కర్నాటక యుద్ధాలలో ఆ నవాబుకో ఈ నవాబుకో నెల్లూరి నవాబుల అండదండలు. కర్నూలు నవాబు తిరగబడితే ఉదయగిరి నవాబు బోర్లాపడిన ఉదంతాలు క్లైవ్ రోజుల్లోనే దొడ్లా కుటుంబీకుడైన ఒక వ్యక్తి సైన్య సరఫరాదారుగా వ్యవహరించిన ఘటనలు ఇంకా వెనక వెలుగోటి యాచమనాయుడు జీర్ణ విజయనగర సామ్రాజ్య పునరుద్ధరణోద్యమంలో పాల్గొన్న వ్యర్థ ప్రయత్నాలు — ఇవన్నీ నెల్లూరిని తక్కిన దేశంతో కలుపుతూనే వచ్చాయి. ఇప్పుడదికాదు విషయం. ''దేశీయసంఘం''(కాంగ్రెసు)ఏర్పడిన తరుణంలో బొంబాయికి వెళ్ళిన నెల్లూరివాళ్ళెవరైనా ఉన్నారా అనేదికూడాకాదు. నెల్లూరివాళ్ళు లేకున్నా తెలుగువాళ్ళున్నారు. ఆధునిక జీవితప్రవాహంలో నెల్లూరిసీమ ఎప్పుడు, ఏయేవిధాలుగా కాలుమోపిందనేదే


కె. వి. రమణారెడ్డి

నా ప్రమేయం. అందుచేతే 'పట్నం' ప్రస్తావన.

ఆ 'పట్నం'లో ఒకవైపున వేదం వేంకటరాయశాస్త్రి ఏలినవారి వద్దనుంచి 'మహామహోపాధ్యాయ' బిరుదం స్వీకరిస్తూంటే మరొకవైపున నెల్లూరి విద్యార్థులు ఆధునికభావాలతో సంఘటితమౌతూ వచ్చారు. ఇవి రెండూ నెల్లూరి సాహిత్య, సాంస్కృతిక జీవితాన్ని గట్టిగా స్పందింపజేసిన విషయాలే. తన ఒక నాటకంలో జార్జినో, ఎడ్వర్డునో వే. వేం. శా. అభినందించకముందే, విక్టోరియా వజ్రోత్సవ సందర్భంగా ప్రశంసా శ్లోకాలు రచించడంకూడా జరిగింది. కందుకూరి, కొక్కొండ, గురజాడ వగైరాలుకూడా అప్పటికి ఆ ధోరణికి చెందినవాళ్ళే గనక, అది ఒక నేరమని వేలెత్తి చూపడంగాని, అది ఆ నాటి రివాజులెమ్మని ఉదాసీనత చూపడంగాని నా ఉద్దేశం కాదు. మన భూస్వామికమూ దాని 'సాంప్రదాయికమూ', అలాగే మన గ్రాంథిక భాషాభిమానమూ దాని 'సాంప్రదాయికమూ', ఒకదానినొకటి ఆశ్రయించుకుని, ఆ రెండూ వేరే పరాయి ప్రభుత్వాన్ని ఆశ్రయించాయి. మూడింటిలక్ష్యమూ స్వప్రయోజనమే, ముప్పేట పెద్దరికం. అయితే, మెకాలే ప్రవేశపెట్టిన విద్యావిధానం మాత్రం రూపంలో వర్ణంలో తప్ప (ఇవి అప్రధానమైనవి) తక్కిన వాటన్నిటిలోనూ ఆంగ్లేయులను పోలిన మనుషులను తయారించేందుకు వాళ్ళ మనస్సులను మార్చబూనింది. బ్రిటిష్ సామ్రాజ్య దుర్గానికి ఇది రెండో ప్రాకారమౌతుందని ఆశించింది. పైకి మాత్రం మహోదారంగా, ఈ 'నల్లదొరల'ద్వారా పాశ్చాత్య విజ్ఞానం భారతీయ సమాజంలోని అట్టడుగుదాకా, పొరనుంచి పొరగుండా, దూరి

ఉగాది శుభాకాంక్షలతో

శరీర పోషణకు కావలసిన అన్నిరకములైన
విటమిన్లు, ప్రొటిన్లు సమృద్ధిగాగల
"పూర్ణా" వారి మిల్క్ బ్రెడ్. మరియు కేకులు
ఎల్లప్పుడూ వాడండి.

తయారిదార్లు

## పూర్ణా బ్రెడ్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెని

విజయగోపాలపురం - నెల్లూరు-2.

---

With the best compliments from

## RAVI INSTITUTE OF COMMERCE

( Recognised by the Govt. of A. P. )

**16/12, Muttaraju Gopalarao Street,**
**Trunk Road - NELLORE-524001**

The Leading Institute which Imports Best Coaching in

### TYPEWRITING, SHORTHAND & ACCOUNTANCY

**P. Ravindranath Reddy,**
**PRINCIPAL.**

ఇంకిపోవాలనడం జరిగింది. అట్టడుగుపూట ఎక్కడెరుగుగాని, నట్టనడిమిభాగందాకా ఇది ఇంకకారింది. కాబట్టే నెల్లూరి 'పిల్లకాయల' మద్రాసు చదువు ఇలా భిన్న సామాజిక వ్యవస్థలకు చెందిన భిన్న సంస్కృతులు ముఖాముఖి అయ్యాయి.

తిలక్, గాంధీ శకాలకు ముందే నెల్లూరిసీమ సాంస్కృతికంగా కదంతొక్కడానికి దోహదంచేసిన శక్తి 'దివ్యజ్ఞాన సమాజం', వ్యక్తి అనీ బిసెంటు. ఆల్కాట్‌తో కలిసి బిసెంటమ్మ నెల్లూరికి వచ్చిన సందర్భాన, ఛాందస పండితులు కొందరు వాళ్లను ఢీకొన్నప్పటికీ, మధ్యతరగతి కొత్త భావాల మనస్సులు మాత్రం మంత్రముగ్ధమయ్యాయి. పైగా 'దివ్యజ్ఞానసమాజం' కొత్త వేషం వేసుకు వచ్చిన పాత హైందవమే కాబట్టి, అనేకులకు ఇది 'నగిందినట్టు'గా ఉంటూ వచ్చింది. అందుచేతనే సాంప్రదాయిక శక్తులనుంచి దీనికి నిజమైన, బలమైన, ప్రతిఘటన రాలేదు. బెంగాలులో రామకృష్ణ పరమహంస పాదాలముందు మోకరిల్లని ఆధునికుడు లేడన్నట్టుగానే, దివ్యజ్ఞాన సమాజపు కొత్త వాదస్త్రాన్ని తన పాతవాదస్త్రంతో సమాధానపెట్టుకోని ఆధునికులు అట్టే ఉండేవాళ్ళుకాదు. అయితే వీళ్ళ ఆధునికత నవ్యతమాత్రంకాదు. దివ్యజ్ఞాన సమాజానికి తోడుగా వివేకానందుని ఉపదేశాల ప్రభావంకూడా మద్రాసునుంచి నెల్లూరు మీదికి తోలింది. ఎటొచ్చీ, బ్రాహ్మసమాజానికి చెందిన స్వేచ్ఛాభావప్రసారం, సంప్రదాయ విమర్శా దృక్పథం, హేతువాద వైఖరి. ఇక్కడికి జోరుగా రాలేదనాలి. ఉత్తరతీరాంధ్రదేశానికి దక్షిణ తీరాంధ్రదేశానికి సంస్కృతి విషయంలో ఒకానొక ముఖ్యమైన భేదం ఇది. గూడూరులాంటి చోటనే 'వివేకానందాశ్రమం'వంటి సంస్థలు తలెత్తాయంటే, నెల్లూరిలోకూడా వత్తి ఉండాలి.

బిసెంటమ్మ తనవంతుగా దక్షిణాది రాష్ట్రాలలో ప్రారంభించి నడిపిన 'హోమ్ రూల్' ఉద్యమం తాకిడి నెల్లూరికి బలంగానే తగిలింది. అప్పటికే బెంగాలీ 'టెర్రరిస్టు' ఉద్యమం వైపుకి ఉత్సాహవంతులూ ఆవేశపరులూ అయిన దేశాభిమానులు కొద్దిమంది తలలు తిప్పి ఉండేవారు. మదరాసులో కామరాజు లక్ష్మణరావుతో, మల్లంపల్లి సోమశేఖరశర్మతో పరిచయ సంబంధాలుండిన చతుర్వేదుల వెంకటకృష్ణను ఈ సందర్భంలో స్మరించక తప్పదు. గూడూరు రైల్వేస్టేషనులో మందుగుండు సామగ్రితో నిండిన పెట్టె ఒకటి రైలుపెట్టెలో కనిపించిన విషయం గ్రంథస్థమై ఉంది. తిలక్ పేరే వెన్నెలకంటి రాఘవయ్యలాంటి అలనాటి నూనూగు మీసాల నవయువకులకు వీరావేశం తెప్పిస్తూ, ఆయుధాలు చేతికందిస్తూ వచ్చిందనేదికూడా వాస్తవం. అప్పుడప్పుడే మొగ్గ విప్పసాగిన దువ్వూరి రామిరెడ్డి కవి-వ్యక్తి 'సింహప్రబోధం', 'మాతృశతకం' వంటి రచనలు చేసేందుకు ఇవన్నీ బహిఃప్రేరణలు. అలాగే, హోమ్‌రూలు ఉద్యమప్రభావం 'నా దేశాటనం డైరీ'లో కనిపిస్తుంది. ఆమంచర్ల సుబ్బకృష్ణరావుగారి రాజకీయజీవితం జిల్లాబోర్డు నుంచి శాసన మండలివరకు విస్తరించిన కాలంకూడా దాదాపుగా ఇదే. ఇంతకంటె గమనించదగిన విషయం, రాజాల, 'పెద్దగాపుల', ఘనీబుల, పండితుల ప్రాభవానికి ప్రభుత్వానికి పట్టసాగిన క్షీణత. అయితే ఇది రాత్రికిరాత్రి జరిగిన మార్పువంటిదికాదు. గునుపాటి యానాదిరెడ్డి వంటి పండిత పక్షపాతులు, దొడ్ల వెంకటరామిరెడ్డి వంటి స్వయంపండితులు ఒకవైపున, దువ్వూరి రామిరెడ్డి, ములుమూడి ఆదిశేషాద్రిరెడ్డివంటి ఆధునికులు, ఇలా బ్రాహ్మణేతర వర్గాలకు చెందిన వ్యవసాయోపజీవుల కూటమిలోనే తరాల అంతరం నానాటికీ స్ఫుటం కాసాగింది. ఇంకొకవైపున, పొట్లపూడిలో 'సుజనరంజని సమాజం' ఏర్పడి రాయప్రోలు సుబ్బారావు వంటి నవకవులను బయటినుంచీ, నెల్లూరి వెంకట్రామానాయుడు వంటి వారిని లోపలినుంచీ ఆకర్షిస్తూ వచ్చింది. మార్పువేసిన తొలిపిందెలైనా, ఇవీ ఇలాంటివీ సమాజ రంగస్థలంమీదికి వచ్చి గొంతు సవరించుకోసాగిన ఒక కొత్త పాత్ర హంగులు కాబట్టి సార్థకమైనవి. కులం ఏదైనా, సాంప్రదాయిక లౌకికాధికారానికి దూరమై ఉండిన మధ్యమవర్గం త్రిశంకువే కావచ్చు, ఉట్టికీ స్వర్గానికీ కాకుండాపోవచ్చు, ఏమైనా ఆనాటికి అదే పదివేలు.

నిజానికి, కులంకూడా ముఖ్యమైనదే. కులమూ వర్గమూ భిన్నాలైనా, కులంపేరుతో మందిమార్బలాన్ని కూడగట్టి వర్గ వ్యత్యాసాలను కులం వేదిక మీద బలిగాపెట్టింది తద్వారా తమ పబ్బం గడుపుకునేందుకు, సంఖ్యాబాహుళ్యమూ వ్యవసాయికమైన ధనాధిక్యమూ గల బ్రాహ్మణేతర కులాలతో పెనుకదలిక ఒకటి వచ్చింది. స్వసంఘ సంస్కరణను అపేక్షించి, శాఖాభేదాలను అతిబాల్యవివాహాలను అవిద్యను నిరసించేంతవరకు అది మంచే చేసింది గాని, పులిని జూచి నక్క వాతలుపెట్టుకున్న చందంగా అగ్రవర్ణ ఆచార వ్యవహారాలను అనుకరించ బూనిందికూడా. అటు జస్టీస్ మంత్రివర్గం రాజకీయంగా, అప్పటికే ప్రభుత్వోద్యోగాలలో హెచ్చుభాగం అనుభవిస్తూ ఉండిన బ్రాహ్మణులపై బ్రిటిష్ ప్రభుత్వం అనుమానాలూ భయాలూ పెంచుకోవడం, ఆ ఉద్యోగాలకై కిందివర్ణాలు ఆత్రులుకావడం, రెండూ ఒకదానినొకటి పోషించుకుంటూ వచ్చాయి. నెల్లూరి సీమకు సంబంధించి ఈ కులసంఘాల ప్రాబల్యం, సాహిత్యంలోనూ సంస్కృతిలోనూ తెచ్చిన మార్పులు చెప్పుకోదగినవేమీలేవు. గుంటూరు, కృష్ణామండలాల్లోలాగా ఇక్కడ స్వసంఘ పౌరోహిత్యాలవంటి, సద్భ్రాతృ వర్గాన బ్రాహ్మణ విరుద్ధ స్వీకారంవంటి పనులు జరగలేదు. దువ్వూరి రామిరెడ్డి 'నలజారమ్మ' వంశాభిమానంతోనూ, 'కృషీవలుడు' వృత్తిగౌరవంతోనూ చేసిన రచనలైనంతగా బ్రాహ్మణదూషణకు ఉద్దేశించినవికావు. రెడ్డి జన సంఘం ఇచ్చిన ప్రోత్సాహం. ప్రోత్సాలాలుమాత్రం! విస్మరించ వీలు లేనివి. అయితే బ్రాహ్మణ్యమూ పాండిత్యభేషజమూ రెండూ ఒక్కటిగా పెనవేసినప్పుడు, తాను వాటిని నిరసించడమో పరిహసించడమో మానలేదు కూడా. రాజకీయంగానైతే, ఈమార్పు ఆమంచర్ల సుబ్బకృష్ణరావుగారి చేతినుండి వెంకటగిరిరాజా వంటి జమీందారుల చేతికేగాక, అంతకంటే తక్కువస్థితి గలిగినా ఆ తానులోని తుంటలే అయిన కాటంరెడ్డి ఆదినారాయణరెడ్డి, బెజవాడ రామచంద్రారెడ్డి, పెళ్లేటి వెంకటసుబ్బారెడ్డి వంటి వాళ్ళ చేతులకు, పెద్దరికాన్ని దానివెంట ప్రాపంచిక లాభాలనూ మార్పిడిచేసింది. కులసంఘాలలో కులంలోని సంపన్న కూటమి రాజకీయాధికారలబ్ధికి సాధనప్రాయాలైనంతగా, తతిమాకూటాలవారి స్థితిని మెరుగుపరచేందుకు తోడ్పడలేదు.

3

నెల్లూరిసాహిత్య, సాంస్కృతిక జీవితంమాత్రం ఏ బయటితోపునైనా సహించకుండా, చాలావరకు తన గాడిలోపడి నడుస్తూవచ్చింది. వే. వెం. శా. శేషజీవితం ధనాభావంతో గడిచినా, ఏ యాదేంద్రుడో మరి యే కొత్తజమీందారుడో, పాతమోతుబరిరైతో గ్రంథ ప్రచురణకు సాయంచేస్తూ ఉడతాభక్తి చూపించేవాడు. పైగా 'ధాత్రసాహస్ర ప్రచారంబు'గా, 'జంకు కళంకులేని' వే. వెం. శా. తన నాటకాలను ప్రదర్శింపచేస్తూకూడా మరింత అనుచర బృందాన్ని సమకూర్చుకోగలిగాడు. ఆయన తమ్ముడైన వేదం వెంకటాచలయ్య తిరే

నేరు. అగాధమైనదేగాక ఆయన పాండిత్యం దుర్వగాహమైనదికూడా. అయినా అది సాహిత్య కల్పనకుగాక, చారిత్రక పరిశోధనకు, ముఖ్యంగా నుత, మహాకావ్యరూపాల మూలాన్వేషణకు అంకిత మైంది. 'అభినవ తిక్కన' బిరుదాంకితుడైన దుర్భా సుబ్రహ్మణ్యశర్మ ఒకొక పీఠాధిపతిగాగా, ఇరు పండిత కూటాలమధ్యసాగిన ముద్రిత వాగ్వాదాలు కేశఖండనచణమైన పాండిత్య ప్రకర్షలో ఎకసెక్కెం దూరే బిరిబిరిన నేరారోపణలకు దూషణలకు ఖండనమండనలకు రణగొణలకు – పాండిత్య వ్యక్తం వేసిన కుక్కమూతి పిందెలు–దాఖలా. గాంధీశకం అవతరించేనాటికి, స్థూలంగా ఇలా గుండేది సాంస్కృతికంగానూ సాహిత్యకంగానూ, జంతువూ మనిషికాని దశలో, సింహవిక్రమ పుర మనే నెల్లూరు.

దక్షిణాఫ్రికానుంచి తిరిగివచ్చిన కొత్తల్లోనే మద్రాసుదాకా దిగివచ్చిన గాంధీని (అప్పటికింకా మహాత్మాగాంధీ కాలేదు) నెల్లూరికి పట్టుకొచ్చి తమ నడుమ కూర్చోబెట్టుకుని ఫోటో దిగినవాళ్లలో ఏ ఒక్కరూ తమ తర్వాతి జీవితంలో సుప్రసిద్ధ గాంధేయులుగా పరిణమించలేదు. అంటే, గాంధి తత్వం అప్పటికింకా మతసన్నిభం కాలేదన్నమాట.

సత్యాగ్రహోద్యమాల పేరిట జాతీయవాదం ఉద్యమరూపం ధరించాక మాత్రం, నెల్లూరుసీమ జస్టిస్‌పార్టీనికూడా కాదని చాలా ఉత్సాహంతో త్యాగంతో ముందుకు వచ్చింది. ప్రభాత భేరీలు, నగర సంకీర్తనలు, కల్లుగళ్ళ వేలంపాటల బాయ్‌కాట్‌లు, పికెటింగులు, లాఠీదెబ్బలు, శ్రీకృష్ణ జన్మస్థానయాత్రలు–అదొక సందడి. ఇది పల్లెలకూ వ్యాపించింది. రైతాంగంలో పై భాగాలన్నీ తట్టి లేపింది. కులాల అడ్డాలనూ, తరాల అంతరాన్నీ తోసివేసింది. పాతబుద్ధుల కొత్తకారుకు చెందిన దీపాల పిచ్చయ్యశాస్త్రివంటి వాళ్ళుకూడా గుప్త నామాలతో స్వరాజ్య ఉద్యమ కావ్యాలను రచింప సాగితే, కొత్తబుద్ధుల కొత్తకారుకు చెందిన దువ్వూరి రామిరెడ్డి ఊరకున్నాడా? ఇక, వీరిద్దరికంటె తక్కువ తినలేదు కొమాండూరు పార్థసారథి అయ్యంగారు. జాతీయవాద సాహిత్యం గుణంలోనూ, రాశిలోనూ బాగానే సృష్టి అయింది. అయినా, ఆ ఉద్యమస్థాయికి సరితూగలేదనడం నిజం. నిరంతరం ప్రవాహప్రాయం కాలేదనడమూ అంతే

“డిప్రెషను ఱంపకోత” వచ్చిపడి జాతీయోద్యమానికి జతగా వామపక్షభావాలను చేర్చడం వల్ల, రైతుమహాసభలు సైతం యుద్ధరంగాలైన ఘటనలు నెల్లూరిసీమలో మెండౌతూ వచ్చాయి. కూలిరక్షణ సంఘమూ, రైతురక్షణ సంఘమూ, వ్యవసాయకూలీ సమ్మెలు, యువజన సంఘాలు, ఇవన్నీ మొలచాయి. మార్క్సు–ఎంగెల్సుల 'కమ్యూనిస్ట్ మేనిఫెస్టో' కు మొదటి తెలుగు తర్జుమాకూడా నెల్లూరిదేనంటారు. బెజవాడ గోపాల రెడ్డికి వామపక్షం ఎదుర్దీ పుచ్చలపల్లి సుంద రయ్య ఇందరు జాతీయకళాశాలనుంచి శాంతినికేత నానికి ఎదిగిన గోపాలరెడ్డి తిరిగి వచ్చీరాంగానే జాతీయోద్యమంలోకి దిగి ఇంతా త్వరగా నాయక స్థానానికి ఎక్కిపోయాడు కాంగ్రెసు జస్టిస్‌పక్షాలు ఇప్పుడు పెద్దపెద్ద భూస్వాముల కుటుంబాలను ఆశ్రయించింది. పరువుకూ ప్రతిష్ఠకూ సంబంధించిన విషయాలయ్యాయి. దువ్వూరి రామిరెడ్డి 'కాంగ్రెస్ వాలా' రాసిననాటి ఆదర్శబలం క్రమేపీ పలచబడి, ఆ పేరూ ప్రఖ్యాతీ వంచన కావడానికి చాలా కాలం పట్టలేదు. 'ప్రోచేంజరు–నో చేంజరు' వైరుధ్యాలు పల్లెపాడు. గండవరం. పొట్లపూడి వగైరా స్థలాలలో ఆశ్రమాలనో 'సూత్రయజ్ఞ' శాలలనో సృష్టించిన రోజులూ చూస్తూ ఉండగానే వెనక్కు వెళ్ళిపోయాయి. లవణోద్యమమూ ఆకర్షణ కోల్పోయింది. అధికార వ్యామోహం క్రమంగా దూరి జాతీయ తమఫలాన్ని కబళించ డానికి శాసనసభాప్రవేశం (1937) చాలాతోడ్ప డింది. ప్రకాశం–పట్టాభి, ప్రకాశం–రంగా, ప్రకాశం–గోపాలరెడ్డి – వ్యక్తి స్పర్ధకు నిలయం కాసాగిన దశలో ఉద్యమంగా ఉంటూవచ్చినదల్లా పార్టీగా మారింది–పాత, కొత్త స్థితిపరుల పార్టీ. ఓడిన జమీందారీ, భూస్వామిక వర్గాలు కడుపు మంట, తలవంపు తగ్గాక, కాంగ్రెసులో దొడ్డిదారిన దూరిపోయాయి. నెహ్రూగారి పేరు, పటేలుది పెత్తనం. ఎన్నిక గెలుపు ఉదాసీనతను ప్రవేశపెట్టింది వామపక్షశక్తులపై కన్నెర్రచెయ్యడంకూడా మొద లైంది. ఈలోపల మరొక ప్రపంచయుద్ధం బయటి నుంచీ, 'మరో ప్రపంచం'కోసం పోరాటం లోపట్నుంచీ.

“దొరతనమొక్కవంక, తెగదోచు వణిగ్గణ మొక్కవంక, తిరుగలి రాళ్ళమధ్యబడి” కృషీవలుని జీవితచిత్రం అబద్ధంలాంటి ఆదర్శీకరణ ధోరణిని విడిచి, వచ్చినట్టు కటికనేలకు దిగివచ్చింది. ఎన్ని కల సంబరానికిముందు జమీందారీ రైతులపోరాటం, తర్వాతనేమో 'రైతుదండు' పద్యాలు నెల్లూరి వెంకటరామానాయుడి లేఖినికి పదును పెట్టాయి. 'అముద్రిత గ్రంథ చింతామణి' నడిచినచోట 'జమీన్ రైతు' వెలసింది. దాని కాంగ్రెసు పాక్షికతకు పోటీ జస్టిసు పక్షపత్రిక 'స్వతంత్ర'. ఉగాది బిరుదావళులు, బ్రహ్మ వ్యంగ్య చిత్రాలు, విమర్శ ప్రతివిమర్శలూ, ఇవన్నీ రాజకీయాన్ని రచ్చబండ కెక్కించడమో బురదగుంటలో ముంచడమో అయింది, పల్లెపట్టుకు వ్యాపింప జేశాయి. ఈమారు రాజకీయాల ప్రభావం మధ్య తరగతి సమాజానికికూడా సోకింది. లేకుంటే 'మద్రాసు కుట్రకేసు' అనబడేదానిలో ముద్దాయి లైన నెల్లూరివారిలో హెచ్చుభాగం ఈ కూటమికి చెందివుండేవారా? ఇలాంటివారే కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికీ వ్యాప్తికీ నడుంకట్టారు. వీరి మధ్య వర్గబాంధవ్యం (సాంకర్యం?) మాత్రమే గాక భావసంబంధంకూడా ఉంటూవచ్చింది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ సభ్యులుగా అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యత్వంవరకు ఎగబాకిపోయి, అక్కడ వల్లభాయిపటేలుతో ఢీకొనకముందే, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘంలో పట్టాభి సీతారామయ్యతో పేచీపడిన ఫలితంగా వీరిమీద గాంధీ దాకా ఫిర్యాదులమీద ఫిర్యాదులు వెళ్ళాయి. నారప రెడ్డి రామిరెడ్డి వంటి వామపక్షాభిమానులైన సాదా రైతుకుటుంబీకులు ఇటు రాజకీయాన్ని అటు సాహిత్యాన్ని అభిమానించేనాటి పరిస్థితి ఇదీ.

వేదం పండితుడంటే భయభక్తులూ, దుర్భా పండితుడంటే భయగౌరవాలూ – ఇలా ఇద్దరు తల్లుల ముద్దుబిడ్డలాగేవుంటూ, తన సొంతగొంతు విప్పుకున్నాక యావదాంధ్ర ప్రఖ్యాతికి ఎదిగో హించిన 'కవికోకిల' కలరుతాలను అనుకరిస్తూ పరిస్థితుల ప్రోద్బలం మూలంగా చరిత్రగతితో శ్రుతి కలిపిన నెల్లూరి కవుల్లో నారపరెడ్డి స్మరణీయుడు. వామపక్ష ఉద్యమాల వృద్ధిక్షయాలతో పెరిగి విరి గిన కవి – వ్యక్తిత్వం తనది. నెల్లూరి పల్లెల పేద సాదల జీవితఖండాలను, అనుభవ శకలాలను కథానికలుగా లోకానికి ఎరుకపరచిన 'కరుణ కుమార' ఉద్యోగరీత్యామాత్రమే ఈ మండలానికి చెందినమనిషి. మరొకవైపున, 'జమీన్‌రైతు'ద్వారా పత్రికారచనలో అభ్యాసం పొందిన ఆత్రేయ నాటక రచనకు ఉపక్రమించి, వెంకటగిరి అమెచూర్స్ పక్షాన హోటు–ఘాటు ఇతివృత్తాలుగల నాటికలను ప్రదర్శిస్తూవచ్చాడు. జానపద జీవితంలోని అచ్చదనాన్ని ఆదర్శీకరిస్తూ 'శృంగార' పరమైనా

# మా సంస్థలను సందర్శించండి-
# అభాగ్య బాలబాలికలను ఆశీర్వదించండి!

"...వాకాడు సంస్థలను చూచినవారెవరైనా ఇచ్చటి వాతావరణానికి ముగ్ధులుకాక తప్పదు. తల్లిదండ్రుల ఆదరణకు నోచుకోలేని ఎంతోమంది అభాగ్యులకు ఆశ్రయమిచ్చి, వాడిపోయిన మొక్కలకు నీరుపోసి, చక్కని గులాబీలలా బిడ్డలను పెంచుతున్న వీరి కృషిని అభినందించని కఠిన హృదయులెవరూ వుండరు"

—శ్రీమతి రాజ్యం సిన్హా

డైరెక్టరు, సమాచార పౌరసంబంధశాఖ.

**హరిజన విద్యార్థి ఉద్ధారక సంఘం - వాకాడు**

సామాజిక ప్రయోజనం పూర్తిగా లోపించని ఇతివృత్తంతో చంద్రశేఖర శాస్త్రి రచించిన 'ఇదా ప్రపంచం' నాటకం, 'మీరాబాయి', 'బొబ్బిలి', 'కబీరు'వంటి నాటక ప్రదర్శనలకే ఎక్కువగా చెవులు కోసుకుంటూ వచ్చిన నెల్లూరికి కొత్తే. మరి, పులిగండ్ల రామకృష్ణయ్య "తుఫాను" నాటకం, నెల్లూరియాసను ఆశ్రయించిన హాస్యంవిషయంలో, దానికదేసాటి. ఫన్ డాక్టర్ చంద్రశేఖరం 'క్విక్ చేంజి' వేషాల్లాగే దీనికి విస్తారమైన ఆదరణ లభించింది. రామాఫిలిం కంపెనీ, ప్రతిభా పిక్చర్సు, నెల్లూరీయుల తొలి సినీ ప్రయత్నాలు. ఇలా అడుగడుగ్గా నెల్లూరుసీమ ఆధునికతలోకి నడిచింది.

ఆధునికత కాలికమైన విశేషం. నవీనత అలా గాదు; చిత్తవృత్తికి, భావవైఖరికి, సంబంధించిన విశేషం. పఠాభిలాంటి కవుల నవీనత 'వైచిత్రి'కి అంకితమైనంతగా సామాజిక ప్రయోజనపరత్వానికి కాలేదు. దానిలో ఉలిపికట్టెతనం పూర్తిగా వీగ లేదు. అయినా పఠాభి నిలిచి వెలిగిన సాహిత్య దీపంగాగాక, నాలుగు మెరుపులు మెరిసి మళ్ళీ కారుచీకటి—మిరుమిట్లుగొన్న కళ్ళకు వెనకటిచీకటే మేలనిపించే కారుచీకటి—విడిచివెళ్ళుతూ వచ్చాడు. మెరుపు ఆకర్షించినంతగా, ఎవరినైనా దీపమెలా ఆకర్షించగలుగుతుంది? గేయానికి వచనకావ్యానికి అసల్పను దువ్వూరి రామిరెడ్డిగారే చూడగలిగిన నారపరెడ్డిని పఠాభినీ ఈ రెండు విషయాలలో తలకెత్తుకోవలసిందే.

'సరసకవి' మోచర్ల రామకృష్ణయ్య, గుర్రం వేంకటసుబ్రహ్మణ్యం, మునిపర్తి కొండమాచార్యులు అవపదత్తప, మరుపూరు కోదండరామిరెడ్డి వంటి వారిద్వారా ఇప్పటివరకున్నూ పండిత సంప్రదాయం కొనసాగుతూంది. తిక్కవరపు రామిరెడ్డి ధర్మమా అని కవిత్రయ జయంతులూ అంతే. వాటి అనుకరణలెన్నెన్నో! ఈ సంప్రదాయానికి ఆమరణం జీవంపోస్తూవచ్చిన నేలటూరి రామదాసు అయ్యంగారేమి, ధరణికోట వేంకటసుబ్బయ్యేమి, పిల్ల పండితులు మరెందరో! పిలకలొక్కటే పాత బడ్డాయి గాని, పిలక సంప్రదాయం తలల్లోపల నిలిచి ఉంది.

పౌరాణిక నాటక ప్రదర్శనలు కాస్త పాతబడ్డాయేమోగాని, పూర్తిగాపోలేదు. నెప్టా, నెఫ్కాల ద్వారా ఆధునిక నాటకరంగం నెల్లూరినొక తిరుణాళ్ళస్థలం చేస్తూంది. నెల్లూరిసీమ సినీనిర్మాతలు పౌరాణికచిత్ర నిర్మాణంలో నెరజాణలేగాని వై.వి. రావు నెలకొల్పిన సామాజికచిత్ర సంప్రదాయానికి ఒకరిద్దరైనా మందివారసులు లేకపోలేదు.

'అముద్రిత గ్రంథ చింతామణి' వెలసినచోట ఈనాడు మూడు నాలుగు చిన్న చిల్లర మల్లర పత్రికలున్నాయి.

స్థూలపులకంగా ప్రస్తావించిన ఈ విడిఅంశాలను కూడగట్టితే కనిపించేదేమిటి?

నెల్లూరుసీమ రెండు సామాజిక వ్యవస్థల ద్వార బంధంమీద కాలుమోపి ఒక అడుగు అందులో, ఒక అడుగు ఇందులో పెట్టిఉంటున్నది. సామాజికంగా చాలామార్పులు వచ్చాయి. పరిశ్రమలేరాగా, వ్యవసాయంకూడా పెట్టుబడిదారీ పద్ధతులను అనుసరించడం వింతకాదు. అయితే భూస్వామ్యం చింత చచ్చిందనుకున్నా దాని సంస్కృతి పులుసింకా ఉంటూంది. ఇది ఏల్నాటిశని. బండినాగరాజా వంటి యువపండితకవులే దీనినుంచి పూర్తిగా బయటపడజాలకపోవడం, అంతటి ప్రతిభా వ్యక్తులు పూరా విప్పారి ఆధునిక సామాజిక దృష్టితో అలరారే అవకాశాలు ఈ సీమలో లోపించడమే.

నెల్లూరిసీమ సంస్కృతి, సాహిత్యాలు ముందడుగు వేస్తున్నాయి. అయితే ఈ వేగం చాలదు. గమ్యంకూడా నిర్దిష్టమూ నిర్దుష్టమూ కావాలి.

# నగరాలు నందనవనాలు

అనగా అనగా ఒకనగరం. ఆ నగరంలో ఏడు మేడలు. ఒకరోజు వాన కురిసింది. నగరం అంతా తడిసింది. మేడలు తడవలేదు. మేడా మేడా ఎందుకు తడవలేదు అంటే పూరి గుడిసెల్ని అడగమన్నాయి. తాము తడవలేదుగదా అని మేడలు మురిసిపోతున్నాయి. మురికివాడలు మౌనంగా చూస్తున్నాయి, మంచిరోజులకోసం. ఈలోగా ఇంద్రధనస్సువేసి 20 రంగులు విరిశాయి. అందులో ఒక రంగు పట్టణ ఆస్తులమీద పరిమితి విధించింది.

పట్టణప్రాంతాలు అసలే లక్షలాది జనంతో క్రిక్కిరిసి వుంటాయి. ఆస్తులున్నవారు దేవేంద్ర భవనాలకోసం వున్నస్థలమంతా ఆక్రమించుకుంటే లేనివారికి నిలువనీడలేదుగదా.

1976 ఫిబ్రవరి 17-వ తేదీనుండి దేశంలో పట్టణఆస్తుల పరిమితిచట్టం అమల్లోకి వచ్చింది. ఇది మన రాష్ట్రానికికూడా వర్తిస్తుంది. ప్రస్తుతం అధికజనాభావున్న. హైదరాబాదు, విశాఖపట్టణం. విజయవాడ, గుంటూరు, వరంగల్లు నగరాలకు యీ చట్టాన్ని వర్తింపచేస్తున్నారు.

లక్షనుంచి 2 లక్షలవరకూ జనాభావున్న మరో 8 పట్టణాల్నికూడా యీ చట్టం పరిధిలోకి తెస్తున్నారు.

పట్టణ ఆస్తుల పరిమితిచట్టం అమలును పరిశీలించేందుకు వొక ట్రిబ్యునల్ పనిచేస్తున్నది.

చట్టం అమలుచేసేందుకు ప్రత్యేకసిబ్బందిని నియమించారు. పట్టణాలలో కార్మికులు, వృత్తిపనివారు, బడుగువర్గాలవారు గుడిసెలు వేసుకొని కోకొల్లలుగావున్నారు. వీరికి గృహవసతిసౌకర్యం కల్పించబడుతూంది. మన రాజధాని హైదరాబాదును అభివృద్ధిపరచేందుకు నగరాభివృద్ధిసంస్థ ఏర్పడింది. ముఖ్యమైన యితర పట్టణాలకుకూడా యిటాంటి సంస్థలు ఏర్పాటుచేస్తున్నారు.

---

సమాచార పౌర సంబంధశాఖ - హైదరాబాదు.

DIPR No 25/76-77

# ప్రతాపరుద్రీయ నాటకం హనుమకొండ కైఫీయతు

శ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తి ఎం. ఏ. బి. ఎల్.

నాటక రచనకు వస్తువుకావాలి. ఏదో విషయాన్ని తీసికొని దానిని మార్పులు కూర్పులుచేసి, చూడతగిన వాటిని దృశ్యంగా నిబంధించి, వినతగ్గ వానిని చెప్పించి, నేర్పుతో సహృదయ హృదయాలలో రసాన్ని కవి పుట్టించాలి. అట్టి నాటక ప్రయోగం సామాజికుల హృదయాలను ఉత్తేజపరచి వారిలో రసాన్ని ప్రకోపింపచేస్తుంది. ఇదే నాటక సిద్ధి.

ఈ వస్తువును ఎక్కడినుంచి తీసికోవాలి అనే ప్రశ్నకు జవాబు భరతమునే నిర్ణయించి పెట్టాడు. రామాయణ, భారత, భాగవతాలనుండి ఆఖ్యానాలు, బృహత్కథనుండి ప్రశస్త చరిత్రులైన వారి జీవితాలను నాటకకర్త వస్తువుగా గ్రహించవచ్చును. ఆ వస్తు సంవిధానాన్ని, తన నాటక నిర్మాణం కోసం మార్చి, కూర్చి సరిదిద్ది రమణీయంగా మలచాలి. ఈ నేర్పు శిఖరస్థాయి నందుకొన్నప్పుడు, నాటకకర్త కీర్తికిరీటాన్ని ధరిస్తాడు. నాటకాన్ని చదివినవారు, ప్రయోగాన్ని చూచినవారు 'సాధుసాధు' అను పొగడ్తలను వ్యాపింపచేస్తారు.

నాటకానికి ఏ వస్తువు స్వీకరించాలి అనే విషయంలో సామాన్యంగా పైన పేర్కొన్న గ్రంథాలు గాక, సంప్రదాయంగా జనశ్రుతిలో ఆబాల గోపాలానికి తెలిసిన కథనే, కవి చేబట్టి, తన మేధాశక్తితో రూపకాన్ని అల్లుతాడు. పాశ్చాత్యులలో షేక్స్పియర్ వ్రాసిన 35, 36 నాటకాలకు వస్తువు అనేక గ్రంథాలనుండి, చరిత్రనుండి, పరదేశాల సాహిత్యాలనుండి, సంప్రదాయ కథలనుండి తీసికొనట్లు ఋజువైంది. జర్మన్యా దేశీయుడైన గోథే (Goethe) తన ఫాస్టు అనే నాటకానికి జనశ్రుతిలో అనుశ్రుతంగా వ్యాప్తిలో వున్న వస్తువును స్వీకరించారు. ఇట్లే మహామేధావులయినవారు పూర్వగాథలను నాటకీయంజేసి ప్రజావళికి మోదాన్ని గూర్చారు.

సింహపురిలో ప్రసిద్ధికెక్కిన నాటకం 'ప్రతాపరుద్రీయ నాటకము'. నాటక కర్త వేదము వేంకటరాయశాస్త్రి. వీరు ఈ నాటకాన్ని 1897 లో ప్రచురించారు. అనాటికి వీరు రచనకొరకై ఏ కథను అనుసరించారు అనేవిషయం పరిశీలనార్హం.

1) చరిత్ర : తుఘ్లక్ ప్రభువు అనేకమార్లు ఓరుగల్లుపై దండెత్తి, చివరిసారి తన సర్దారుల నంపినాడు. వారు ముట్టడిచేసి, కాకతీయులనోడించి ఓరుగల్లు రాజ్యాన్నేలే ప్రతాపరుద్ర మహారాజును బందీగా ఢిల్లీకి కొనిపోయారు.

2) బృహత్ కథకు ప్రతిరూపమైన కథా సరిత్సాగరంలో, వత్సరాజు కథలు మెండుగా ఉన్నాయి. అందొకదానిలో వత్సరాజు, వేటకై పోతాడు. ఆ రాజు గొప్ప వైణికుడు; పైగా ఎంతటి క్రూరమైన ఏనుగునైనా లొంగదీయగల మేటి వేటరి. మోసంచేసి, వైరిరాజు సేనలకు బందీ అవుతాడు. ఈ సంగతి తెలిసిన మంత్రి యౌగంధరాయణుడు, తన చాణక్య తంత్రంతో తనరాజును మరల రాజధానికి చేరుస్తాడు. అందుకై ఆ మంత్రిశేఖరుడు వైరిరాజు పట్టణంలో పిచ్చివాడుగా తిరిగి, తన పగను సాధిస్తాడు. ఈ కథలనే శ్రీ శాస్త్రిగారు తెనిగించారు. వీరికి కథాసరిత్సాగరం, అందులోని కథలు, కరతలామలకాలు. ఈ కథనే, (బహుశః బృహత్కథలోనున్న దానిని) భాసుడు ప్రతిజ్ఞాయౌగంధరాయణమని, ప్రకరణంగా దిద్ది తీర్చినాడు. కాని ఈ రూపకం 1910 వరకు లోకానికి తెలియలేదు. కాబట్టి కథాసరిత్సాగరంలోని వత్సరాజీయము 1897 నాటికి తెలిసి ఉండవచ్చును.

3) మెకంజీ కైఫీయత్తులలోని హనుమకొండ కైఫీయత్తునందుండే కథ ముఖ్యమైన సాధన సంపత్తి మెకంజీ పనుపున శ్రీ నారాయణరావు 1816 నవంబరు, 20 తేదీన జనశ్రుతంగా ఉండే కథను వ్రాసి ఉంచారు. (ధాతునామ సం. కార్తీక బహుళ 30) దీనివిషయం చదివిగాని, విని గాని శాస్త్రిగారు తన నాటకవస్తువునకు దోహదం చేసుకొన్నారనవచ్చు. అందులో వ్రాసిన ఖండిక ఇట్లా ఉంది. ★

"ఈ ప్రతాపరుద్రునితో ఢిల్లీ సులతాని యుద్ధంబుచేసి, ఢిల్లీకి తీసికొని పోయ్ని దిన్ని తిరుగా రావడకున్ను జనములు ప్రసిద్ధిగా దేశములయందు వాడుకొనేది ఎట్లంటే; ఢిల్లీసులతాని బలంబులు గూర్చుకొని యేకశిలా నగరంబునకు ముట్టడులువేశి యేడు మార్లు యుద్ధంబుచేసి ఢిల్లీసులతాని ప్రతాపరుద్రుడ్ని పట్టుకొని ఢిల్లీకిం తీసికొనిపోయ్ను, అక్కడ వుండినంతట ప్రతాపరుద్రుని ప్రధానిఅయ్ను శివదేవయ్య యితనికే

★ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, మెకంజీ కైఫీయత్తులు సంపుటం VI (26, 29, 31) లో. పే. 97 నుండి 100 వరకు.

ISI

# ఫీల్డ్ మార్షల్

## ఆయిల్ ఇంజన్లు

ఎండలు ముదిరినా ఎడగారుకు బెడదలేదు.

**ఫీల్డ్ మార్షల్**
పుష్కలమైన నీటిని అందించి పైరును ఏపుగా పెంచి బంగారు పంటను యిస్తుంది!




5/6 H. P. 7/8 H. P.

తయారుచేయువారు:

**పటేల్ మాన్యుఫాక్చరర్స్**
రాజ్ కోట్




సోల్ డిస్ట్రిబ్యూటర్స్:
బాట్లిబాయ్ అండ్ కంపెని
ప్రైవేట్ లిమిటెడ్.,
మద్రాసు-600001.

**రాధాకృష్ణా ఎంటర్ ప్రైజస్**
సుబేదారుపేటరోడ్డు - నెల్లూరు.
ఫోను: 1594

యుగంధరుడని పేరు. యీ యుగంధరుడు
ఢిల్లీకిజని వెర్రివాడనిపించుకొని ఆ ఢిల్లీ
పట్టంబున, రాజవీధులలో ఢిల్లీ సుల్తానుని
ప్రతాపరుద్రుండు పట్టుకొని వోరుంగంటికి
బేడీలువేసి వుంచినాడని అరుస్తూరాగా,
అక్కడవుండే జనులు యిపుడు ఢిల్లీ
సుల్తాని ప్రతాపరుద్రుడు పట్టుకొని
ఢిల్లీలో వుంచినాడు. అదినేమి యెరుగక
యీలాగున అంటావుయని ప్రతాపరు
98-ద్రుణి ఢిల్లీశ్వరుండు పట్టుకొని గిరవు
వుంచినాడని అనమని యెన్నివిధాల
బోధించినాను, యితడు వినక ఢిల్లీశ్వరుణ్ని
ప్రతాపరుద్రుండిన్ని పట్టుకొని వోరగంటికి
బేడీలువేశి, చెరలోవుంచినాడని అరుస్తు
రాగా, యీ సమాచారము చారుల చే
ఢిల్లీశ్వరుండెరింగి, అతణ్ని విరిచి అడుగగా
అతండు ఢిల్లీశ్వరుని సముఖంబుననున్ను
వెర్రివాని నడకలు అగుపరచి ఢిల్లీ సుల్తా
నిని, ప్రతాపరుద్రుండు పట్టుకొని వోరుం
గంటిలో బేడీలువేశి చెరలో వుంచినాడని
అరవగాను, నిష్కారణంగా యితణ్ని
దండించడం అధర్మమని; అతనికి ఎరుక
లేకుండా కొందరు జనులను యితడు
భోజనం యేవిధంగా చేశేదిన్ని, యెవ్వ
రితో విహితంగా మాట్లాడేదిన్ని కనిపెట్ట
మని ఆజ్ఞాపించగాను, ఆవారు కనిపెట్టి
వుండగా; వొకనాడు యీ వెర్రివేషం ధరిం
చినవాడు, అరుస్తు వొక ఖాండం తీసుకొని
పట్నానికి వెలపట వొక ప్రదేశంలో మహా
రమ్యమయిన్ని వనాంతరం వుండగా అక్క
డికి పోయి జనులు సంచారంలేని చోటుగా
జూచి, అక్కడ సమీపమందు బావి
వుండగా అక్కడ వంట చేసేటందుకు
బియ్యంబెట్టి అన్నం సిద్ధం అవుతుండగా
సుల్తాని యొక్క చారులు యితని యెరుక
లేకుండా వచ్చి వొక్క వృక్షాన్నియెక్కి
యీయనయొక్క చరియలు చూస్తుండగా,
యింతలో అన్నం సిద్ధం అవు
తూండగా ఆవలింత వచ్చిన దాయను
అందుకు ఆచోద్యం బొందినవాడై వింతలేక
ఆవలింతలు రాదని చతుర్ దిక్కులంజూచి
ఆలోచన చేస్తూండగా, ఢిల్లీశ్వరు చాయలు
దాగి వున్నది జూచిన వాడై యిందువల్ల
ఆవలింతలు వచ్చినదని దిగ్గునలేచి అన్న
ఖాండం మీద వకరాతితో పగులగొట్టి
అందులో మూత్రపురుషాదులు చేశి కలిపి
నాలుగుదిక్కులచల్లి అక్కడనుంచి అరస్తు
పట్నానికి వచ్చెను. అంత ఆచారులు
యితని చెరియలు ప్రత్యక్షంగా చూచిన
వారై ఢిల్లీశ్వరుని సముఖంబునకుం బోయిన
తె(లి)చిన వృత్తాంతంబు విన్నవించినంతట
యితడు కేవలం వెర్రివాడని నిశ్చయించి
నారు. యీ ప్రకారం కొన్ని దినములు జరి
గిన తర్వాత వెర్రివేషముతో వుండిన
యుగంధరుడు ఏకశిలానగరము
99 నుండి వొక వర్తకుని నవరత్నాలు అతిశ
యమైనమువ విలి తీసుకొని వాడ శిద్ధం
చేసి యమునానదిలోనుంచి ఢిల్లీకి తెప్పించి,
ఢిల్లీశ్వరుని అందులో కొన్ని నవరత్నాలు
యిప్పించినంతట, ఢిల్లీశ్వరుండు తన
పట్నంలోవున్న వర్తకులను పిలిపించి ఆ
రత్నాలు జూపించితే ఆ వర్తకులు జూచిన
వారై. అయొక్క రవలు దేవమణులు
సమానమయ్యెదిగను, ఢిల్లీశ్వరుండు ఆ
వర్తకుల్ని పిలిపించినంతలో
ఆ వర్తకుండు మేము పట్టణానికిరాము
మీకు రత్నాలు కావలశి వుండి నట్టయితే
వాడకు వచ్చి వాటి వెల తీర్చుకోవచ్చునది
అనిచెప్పినంతట ఢిల్లీశ్వరుండున్ను కొంత
వర్తకులున్ను వాడకు పోయేటందుకు
ప్రయాణమయి, రత్నాలు చక్కగా యెవ్వ
రికి తెలుసును అని అడుగగాను, ఆ వర్తక
ముసు కగు వారలున్ను రత్నాలపరీక్ష
మాకు చక్కగా తెలియదు ప్రతాపరుద్రు
నకు తె(లు)సును అనిచెప్పగా, ఢిల్లీశ్వ
రుండు ప్రతాపరుద్రునికి వెంటపిల్చుకొని
యమునానదిలో నిల్చివున్న వాడకు వచ్చిరి.
వీరివెంబడి వెర్రివేషంతో యుండిన యుగం
ధరుకున్ను ఢిల్లీశ్వరుణ్ణి, ప్రతాపరుద్రుండు
పట్టకపోయిన యేకశిలానగరం యందు
బేడివేసి వుంచినాడనిచెప్పి ఆవాడకువచ్చిన
వాడుయను ఢిల్లీశ్వరుడున్నూ ప్రతాపరుద్రు
డున్నూ వాడ ప్రవేశమైన తరువాత
ఢిల్లీశ్వరునికి బహుసన్మానము చేసి రవలు
అన్నీ చూపుతావుండి, వాడ నడపించి
బందరు దగ్గరకు వచ్చిరి. అక్కడ ప్రతాప
రుద్రుని దళంబులు ఎదురుగా వచ్చినది.
ఈ దళంబులు ఢిల్లీశ్వరుండుజూచి బహు



నేలనూతల శ్రీకృష్ణమూర్తి

ఆశ్చర్యంబు అయితే ధైర్యాన్ని పొందిన
వాడాయెను. అక్కడనుంచి ఢిల్లీశ్వరుణ్ని,
యుగంధరుడు యేకశిలానగరమునకు
ప్రతాపరుద్రునితో తీసుకొనివచ్చి ఢిల్లీశ్వ
రుణ్ని సింహాసనంబునన్ కూర్చుండన్‌చేసి
నవరత్న సాపితంబగు సువర్ణము చేసిన
సంకెళ్ళు తీసికొనివచ్చి ఢిల్లీశ్వరుణ్ని
ముందరనునిచి, ముకుళితహస్తుండై నేను
మీ పట్నంయందు ప్రతాపరుద్రుండు
ఢిల్లీశ్వరుణ్ని బేడీలువేసి వోరగంటిలో
ఉంచినాడని చెప్పి సాటిచినా బంద్దిన్ని
నాయొక్క యుక్తితో మమ్ముల తీసుకు
100 వస్తిని, అని విన్నవించి బహుమాన
సన్మానములు అనేక ద్రవ్యంబులున్ను,
మణులు, హారములు యిచ్చి ప్రతాపరు
ద్రుని అనుమతిన చతురంగబలాలు వెంట
ఇచ్చి, ఢిల్లీశ్వరుణ్ని ఢిల్లీకిన్ మరుడ
వంపింపినవాడాయెను. అని ఇదేశముల
యందున్నూ జనులు బహు ప్రశిద్ధిగా
వాడుకున్నారు. అయితే గ్రంథములయందు
తిర్గి సుల్తానుని వోరగంటికి తెచ్చినట్టుగా
లిఖితంలోలేదు.''

ప్రతాపరుద్రుని మంత్రి శివదేవయ్య. వీరే గణపతి సార్వభౌముని పాలనాకాలంలో ఉండి నెల్లూరి తిక్కనసోమయాజికి గొప్ప స్వాగతం, సన్మానం ఘటిల్లచేశారు.

ఢిల్లీసేనలు తనరాజును బందీగా గొనిపోయి నారనుసంగతి తెలిసి యుగంధరుడని పేరు పెట్టు కొని పిచ్చివానివేషంలో ఢిల్లీకిపోయి ఢిల్లీసుల్తాన్‌ను

# ది నెల్లూరుజిల్లా సహకార కేంద్రబ్యాంక్ లిమిటెడ్ నెం. 2523 ర నెల్లూరు.

స్థాపితము: 1918

టెలిగ్రామ్: నెల్ బ్యాంక్ టెలిఫోన్: నెం. 44 రు

## హెడ్ ఆఫీసు: నెల్లూరు

బ్రాంచీలు: గూడూరు, కావలి, ఉదయగిరి, ఆత్మకూరు, రాపూరు, సూళ్ళూరుపేట, వెంకటగిరి

**భీమా చేయబడ్డ బ్యాంకు**

**రూ. 20,000 ల పరిమితివరకు డిపాజిట్లు భీమా చేయబడినవి.**

| | |
|---|---|
| అనుమతిపొందిన మూలధనము | రూ. 100 . 00 లక్షలు |
| చెల్లించబడిన మూలధనము | రూ. 76 . 73 లక్షలు |
| క్షేమనిధి | రూ. 7 . 78 లక్షలు |
| ఇతర నిధులు | రూ. 7 . 38 లక్షలు |
| వ్యాపార ధనము | రూ. 488 . 01 లక్షలు |

మీ డిపాజిట్లు అధిక ఆహార ఉత్పత్తికి, గ్రామీణాభివృద్ధికి, జాతీయ ఆదాయమును పెంపొందించుటకు సహాయపడును. అన్ని ప్రదేశములకు చెక్కులు, డ్రాఫ్టులు తక్కువ కమీషనతో పొందవచ్చును.

నూతన గృహనిర్మాణము–కుమార్తెల వివాహములు–పిల్లల విద్యవంటి ఆలోచనకలవారికి కల్పలతయైన

**శ్రీనిధి డిపాజిట్ పథకంలో చేరండి, 34% వడ్డీని పొందండి.**

ఇరవది సంవత్సరములలో డిపాజిట్ చేయబడిన పదివేలరూపాయల మొత్తమును 79,490 రూపాయలుగా అభివృద్ధిగాంచునట్టి క్రొత్తపథకంలో చేరండి.

## సరసమైన మా వడ్డీ రేట్లు

కరంటు డిపాజిట్లు ½ శాతం. సేవింగ్స్ డిపాజిట్లు 6 శాతం.

### ఫిక్సెడ్ డిపాజిట్లు

| | |
|---|---|
| 5 సంవత్సరముల పైన | $10\frac{1}{2}$% |
| 3 సంవత్సరములు, 5 సంవత్సరములలోపు | $9\frac{1}{2}$% |
| 1 ,, 3 ,, | $8\frac{1}{2}$% |
| 9 నెలలు, 1 సంవత్సరములోపు | $7\frac{1}{2}$% |
| 6 నెలలు, 9 నెలలులోపు | $6\frac{1}{2}$% |
| 91 రోజులు అంతకుపైన మరియు 6 నెలలలోపు | 6% |
| 46 రోజులనుండి 90 రోజులు | 4% |
| 15 రోజులుమొదలు 45 రోజులు | $3\frac{1}{2}$% |

నేడే మా బ్యాంకులో ఖాతాను ప్రారంభించండి. అత్యుత్తమసేవను అందించగలమని హామీ యిచ్చుచున్నాము.

ఆనం భక్తవత్సలురెడ్డి
ఛేర్మన్.

యం. ఏ. కృష్ణారెడ్డి
కార్యదర్శి.

బందీగాచేసి, ప్రతాపరుద్రుడు ఓరుగల్లు తీసికొని పోయాడని, రాజవీధులలో అరచి, తాను అసలు పిచ్చివాడుగా ప్రవర్తించాడు. దారుల గుప్తపరీక్షకు లొంగలేదు. సుల్తాను పిచ్చివాడేనని నిర్ణయించుకొన్నాడు. గూఢచారులనుపంపి, రత్నవర్తకులను ఓరుగల్లునుండి ఓడలలో రప్పించి సుల్తానును ఓడలలో రత్నపరీక్షకై ప్రవేశింపచేసి. వారిని బందరుకోస్తాకు చేర్పించాడు. ఈ కైఫీయత్తులోని ముఖ్యాంశాలుకొన్ని శాస్త్రిగారి నాటకంలో కనబడుచున్నవి–

1) 'యుగంధర' అనుపేరు నాటక పాత్రకు పెట్టడం. 2) రాజును బందీనుండి విముక్తి చేయుటకై వెర్రివేషంతో ఢిల్లీ పురవీధులలో తిరగడం. 3) దారులకంట్లలో దుమ్ముపైచుటకై తాను వండిన సిద్ధాన్నాన్ని మట్టిపాలు చేయడం. ఆవులింత–వింత లేక రాదనడం. 4) రత్నాల వర్తకుల యాన తంత్రం; ప్రతాపరుద్రుడే రత్నాలకు మదింపు చేయగలడనడం. 5) బంగారుసంకెళ్ళ ప్రస్తావన. శాస్త్రిగారు వారి పితామహిద్వారా ఈ కథ విని యుండవచ్చు కదా! లేక మద్రాసు అముద్రిత గ్రంథభాండారంలో ఈ కైఫీయత్తును చూచియుండ వచ్చుకదా!

కాని శాస్త్రిగారి నాటకంలో గోప్యతనం, విద్యానాథుని కార్యదక్షత, ప్రభుభక్తి పరాయణత్వం, మంత్రి యుగంధర రాజ్యతంత్రానికి దోహదమివ్వడం, చెకుముకిశాస్త్రి ప్రతిభ-పేరిగానిపాత్ర. ఇవేచాలు శాస్త్రిగారిని నాటక కర్తలలో శిఖరస్థానంలోనే స్థాపించడానికి.

---

# గొర్రిల్లా

–శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

రా, సోదరా! ఇది గొర్రిల్లా యుగం!
విస్తట్లో తుఫానులు వడ్డిస్తాను తిందామురా...
తిందాం మనకోసం నిరీక్షిస్తున్న తరుణపు బ్రహ్మరాక్షస పరిమాణాలు అందుకుందాం.
అవి వెన్నెల కిరణాలు కాదు–వెన్నెల దూలాలు, నెత్తిమీద పడతాయి రక్షించుకో

ఆ ఒంటరిగా కూర్చొని ఉన్న కోకిలల్ని ఓదారుస్తూ గిలిచిపోకు!
ఎగిరేతోటల్లో పుప్పొడి పూసుకుని పరుగులెత్తే గాలి వక్షం బరువే మోస్తుందో
పాటల బరువే మోస్తూందో తెలీకుండా నీ
చైత్రానికిమాత్రం ఏడవడానికక్కూడా తీరిక లేదు.

అదుగో వస్తున్నాడు గట్లమీద తిరుగుతూ పిల్లకాలువలకు పాటలు నేర్పేవాడు;
ఆ పాటలుతిని కిశోరజలాలు గర్జిస్తూ దూకుతున్నాయి అరణ్యాల్లోకి–

హేమంతవనాల్లో చివరి ఆకు కొమ్మకు వేలాడుతూ గాలిలో తన బ్రతుకును తూచుకుంటోంది,
వచ్చే వసంతం తనకేమవుతుందో తలపోసుకుంటూ–
వరిచేలల్లో వెన్న ఉదయించిందో లేదో చలి గజగజవణుకుతూ పారిపోయింది-

నలుదిక్కులనుంచీ ముసురుకొస్తున్న నూతన వాయువులు నా శరీర రంధ్రాలన్నిటిలోకి దూరి
నా ఎముకలన్నీ పిల్లనగ్రోవులై నా నరాలన్నీ సితారులై పాటలగోల రేపుతున్నాయ్

నా కన్నుల్లో కనుపిస్తున్నాయి భావితరాలు ప్రభాతం రాల్చిన కిరణాల గింజలు
ముక్కుతో పొడుచుకు తింటున్న కోడిపుంజుల కుటుంబాల్లా–

# ఆంధ్రదేశంలో ఇంటింటా విజ్ఞానదీపం వెలిగించిన వావిళ్ల ప్రచురణ సంస్థ

శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి

## ఆంధ్రలో ద్రావిడులు

వావిళ్లవారు పుదూరుశాఖ ద్రావిడ బ్రాహ్మణులు. ఎప్పుడో చాలాకాలానికిముందు, ద్రావిడ దేశంనుంచి కొన్ని బ్రాహ్మణ కుటుంబాలు ఆంధ్ర దేశానికి వలసవచ్చినవి. ఇక్కడకువచ్చి మూడు శాఖలుగా చీలినారు. పుదూరు-దండిగుంట నెల్లూరు మండలశాఖలు, ఆరామశాఖ గోదావరి కోనసీమ చేరినది; ఈ మూడవశాఖకు కోనసీమ- పేరూరు వారని నామాంతరాలు. ఈ వంశవృక్షపుపాది కుంభకోణందగ్గర, కంద్రమాణిక్యమనే అగ్రహారం. ఇంచుమించు ఏడువందల ఏండ్లకుముందు వీరు తెనుగునాట ప్రవేశించినారట. కొందరు కర్ణాటకమునకుగూడ వ్యాపించినారు.

వీరంతా వేదవేత్తలు-తపస్సంపన్నులు. పోయిన రోజుల్లో ఈ విద్యాధనమే వారి జీవనయాత్రకు పెట్టుబడి అయినది. నెల్లూరుజిల్లాలో నాయుడుపేట దగ్గర పుదూరు ( = కొత్తవూరు)లో చేరినవారు పుదూరు ద్రావిడులైనారు. ఇక్కడకు రాగానే తెనుగు సంప్రదాయంప్రకారం ఇంటిపేర్లు పెట్టుకొన్నారు. వేదం పురాణం అనే పౌరుష నామధేయాలు కాకుండా, ఊర్ల పేర్లు ఇంటిపేర్లు అయినవి. వావిళ్ల, దండిగుంట, నేలటూరు, నాగమాంబాపురం, వరకవిపూడి, మామిడిపూడి మొదలైన గ్రామాలలో వీరు విద్యా గురువులు. చెన్నపట్టణం అందరికీ కేంద్రం. ఇప్పుడు రెక్కలు వచ్చిన పక్షులవలె, దేశదేశాలకు పాకినారు. పుదూరువారు వన్నెకెక్క రాణించని విద్యారంగమే లేదంటే అతిశయోక్తిగాదు.

కోవూరు తాలూకా దండిగుంటలో చేరిన ఈశాఖ, కేరళ శబరిమలై అయ్యప్పను సేవిస్తారు. మంత్ర విద్యా ప్రవీణులు నిరతాగ్నిహోత్ర దేవతా కార్య నిర్వాహకులు అయినవీరు కృష్ణదేవరాయల మన్ననలందినారు. మూడవది ఆరామశాఖ.

## వావిళ్ళవారు

వావిళ్లగ్రామం కోవూరు తాలూకా వాగర్తన వున్నది. మొదట వావిలి చెట్లు ఎక్కువగా ఉండినందున వావిళ్ల అనేపేరు వచ్చినదట.

వావిళ్ళ రామస్వామిశాస్త్రి-తెనుగు పుస్తకాలను అందమైన రూపంలో శుద్ధపాఠాలతో ఆంధ్రులకు అందజేసి, స్తన్యమిచ్చిన తెనుగుతల్లి మన్నన అప్పును దీర్చుకొను ఈ ద్రావిడ పుత్రుడు 1812లో వావిళ్ళలో జన్మించినాడు. ఈ సంవత్సరం దక్షిణ దేశ గ్రంథ ప్రచురణ చరిత్రకు శ్రీకారం చుట్టిన శుభతరుణం. ఈ సంవత్సరంలోనే చెన్నపట్నంలో కుంపిణీ ప్రభుత్వం ఫోర్టుసెంట్ జార్జి కాలేజిబోర్డును స్థాపించినది. రామస్వామయ్య తండ్రి వెంకటేశ్వర శాస్త్రి; తల్లి-మంగమ్మ. ఈ దంపతులకు నలుగురు మగ, ఒక ఆడబిడ్డ కలిగినారు. వారిలో కడగొట్టువాడు రామస్వామయ్య.

రామస్వామి పెద్దన్న - వెంకటరమణశాస్త్రి ఇంగ్లీషు నేర్చి ఉద్యోగిచేరి కలెక్టరు ఆఫీసులో క్రమేణా శిరస్తదారుడయినాడు. రెండవ అన్న-సుబ్బరాయశాస్త్రి, ఆంధ్ర గీర్వాణములనుమాత్రం నేర్చి దండిగుంటలో తండ్రి దగ్గరనేవుండి సేద్యం చూచుకొంటుండినాడు. ఇక దగ్గరి అన్న-అనంత నారాయణయ్యతో విద్యాభ్యాసానికి నెల్లూరు చేరినాడు.

## రామస్వామిశాస్త్రి

రామస్వామి, అనంతనారాయణయ్య నెల్లూరులో, ఆనాటి ప్రఖ్యాత అధ్యాపకులు-గట్టుపల్లి శాస్త్రి, కృష్ణశాస్త్రి దగ్గర వేదాధ్యయనం గావించినారు. తర్వాత ఈ ఇద్దరన్నదమ్ములు గోదావరి ద్రాక్షారామక్షేత్రంచేరి, వైయ్యాకరణ చక్రవర్తి-పాపయ్యశాస్త్రి శుశ్రూషలో వ్యాకరణం చదివినారు. దీంతో తృప్తిపడక విద్యాదాహంతో చెన్నపట్నం చేరినారు. ఆనాడు మదరాసు అగ్నిశాఖలకు కేంద్రంగా వెలసివుండినది. అప్పుడు ఉత్తర మదరాసు-చాకలిపేట తండియారుపేటలు ఆంధ్రులకు సాంస్కృతిక కేంద్రాలు.

అప్పటికే, తండియారుపేటలో తంజావూరు రామానాయుడు సంస్కృత పాఠశాల తెనుగువారికి సొంతపల్లెటూరై యుండినది. వెంకటనారాయణశాస్త్రి, రామస్వామిశాస్త్రి ఈ విద్యాలయంలో చేరి, తమ సాహిత్య-విద్య రీతులకు మెరుగులు బెట్టుకొన్నారు. వీరి చదువు దగ ఇంకా తీరలేదు. మైసూరు చేరినారు. అక్కడ ముమ్మడి కృష్ణరాయ ఒడయరు స్థాపించిన ఉన్నత కళాశాలలో తమ విద్యలను కాగా, ఇద్దరన్నదమ్ములు పెంచుకొన్నారు. ఇప్పుడు ఈ వావిళ్ల సోదరులు నిండు శాస్త్రుల్ళు అయినారు:

## ముద్రణోద్యోగం

వావిళ్ళసోదరలు మైసూరులో ఉన్నప్పుడు కొందరు మిత్రుల సహాయంతో ఒక ముద్రాక్షర శాలను నెలకొల్పి కొన్ని కన్నడ పుస్తకాలను వెలువరించినారు. ఆప్రెస్ సరిగా సాగలేదు. వావిళ్ళ సోదరులు మదరాసు చేరి ముందుకథ యోచించినారు. ఒకబంధువు సహాయంతో "వివేక రత్నాకర" అనేప్రెస్సును నెలకొల్పినారు. దీనిని నడుపుతూనే, మరికొందరి భాగస్థులతో "హిందూ భాషాసంజీవిని" ముద్రణాలయాన్ని స్థాపించినారు.

## ప్రచురణాలయ ధర్మోద్దేశం

1869లో ఈ అచ్చుకూటమును స్థాపించుటకు వావిళ్ళ సోదరులను హిందూధర్మము గీర్వాణాంధ్ర ప్రీతి ప్రేరేపించినవి. ఈ శాఖలకు సంబంధించిన గ్రంథాలు అచ్చువేసి, ఆర్యధర్మప్రచారం చేసి, ఈ రెండుభాషల పుస్తకాలను ముద్రించి ఆంధ్రావళికి విజ్ఞానాన్ని పంచిపెట్టాలన్న ధర్మ

సంకల్పము దీక్ష ఈ కార్యకర్తల లక్ష్యమై యుండి నది. ఇది లాభాపేక్షలేని ప్రయత్న మనవచ్చు.

ఈ ప్రెస్సులో ఇద్దరు నాయుళ్ళుగూడ భాగ స్వాములై యుండినారు. ఇది ఆనాటి కలమత సామరస్యంగల వాతావరణం. కాని ఈ సంస్థ రెండేళ్ళమాత్రమే నడిచినది. అనంతనారాయణ శాస్త్రి సంస్కృత అధ్యాపకుడుగా మైసూరు వెళ్ళి పోయినాడు. రామస్వామిశాస్త్రి ఒంటరిగా డైనాడు. పాత వివేకరత్నాకరమనే ప్రెస్సును, మిణుకు మిణుకుమంటూ రామస్వామిశాస్త్రి సాగిస్తూనే ఉండినాడు.

అయినా, ఇంకొక ప్రెస్సును స్థాపించే ప్రయత్నం శాస్త్రి మానుకోలేదు. ఇతనికి సరస్వతీ తిరువెంగళాదాసు అనే నెల్లూరాయన జత దొరికినాడు. ఇద్దరూ కలసి—

## సరస్వతీ నిలయం

అనే ఇంకొక క్రొత్తప్రెస్సును అమ్మినారు. ఇది వావిళ్ళవారికి నాలుగోది. దీనికీ పురిటిసంధి కొట్టినది. అదారి నెల్లూరు చేరినాడు, శాస్త్రి మరల అచ్చుపని ఎడారిలో ఏకాకి అయినాడు. అచ్చు కూటపు పిచ్చి శాస్త్రికి బాగా తలకెక్కి వున్నది.

మదరాసు తండియార్ పేట హైరోడ్డులో సొంత ఇంట సొంత ప్రెస్సును 1854లో "ఆదిసరస్వతి ముద్రణాలయం" పేర నెలకొల్పినాడు. ఇదే ఈనాటివరకు అదేచోట ఒక మర్రిచెట్టయి సాగి వస్తున్నది. ఒక ఫర్లాంగు నలుచదరపు లోగిలిలో, అనేక భవనాలుగల రొంపిలో, ఈ నూట ఇరవై ఏండ్లు సాగినది. రామస్వామిశాస్త్రి కుమారుడు—వెంకటేశ్వరశాస్త్రి దీనిని "వావిళ్ళ ప్రెస్"గా మార్చినాడు. ఈ "వావిళ్ల" ముద్ర-చక్కటి అచ్చు క్వాలిటీ బైండుతో ఆంధ్రదేశంలో ఇంటింట సరస్వతీ దీపం అయినది. ఇంకొక ఆంధ్రుడు — కాశీనాథుని నాగేశ్వరరావు అమృతాంజనం దీనిమాదిరే దేశంలో నానుడి అయిపోయినది.

## వెంకటేశ్వరశాస్త్రి

వెంకటేశ్వరశాస్త్రి, రామస్వామిశాస్త్రి ద్వితీయ కళత్రం—జ్ఞానమ్మ కన్న బంగారు పంట. ఈయన జననం పంట ల్లూరు శివాలయంలో అని. రామస్వామిశాస్త్రి మొదటి భార్య—జానకమ్మ; ఈమెకు మంగమ్మ అనే ఒకే కూతురు. ఈమె చదలవాడ సుందరరామశాస్త్రి భార్య.

వెంకటేశ్వరశాస్త్రికి ఇద్దరు చెల్లెండ్రు. మొదటి ఆమె—జానకమ్మ, కాళహస్తి రామనాథం తల్లి. వెంకటేశ్వరశాస్త్రి మేనమామ దగ్గర సంస్కృతం అభ్యసించినాను. ఈయన ఎనిమిదవ ఏటనే తండ్రి చనిపోయినాడు. ఒక చేరిచెట్టి ఈయనకు గార్డియన్‌గా ఉండటం గమనించదగిన సంగతి. శాస్త్రి కొన్నేండ్లు ఇంగ్లీషు కళాశాలలో చదివి, వ్యాపార కార్యభారంవల్ల చదువు మానుకొన్నాడు. వెంకటేశ్వరశాస్త్రి, అల్లూరు- భువనపల్లి సీతారామయ్య పెద్దకూతురు — సుబ్బమ్మను పెండ్లాడినాడు. ఇది ఒడ్డికలేని దాంపత్యము; దీనికితోడు సంతానం లేదు. ఈ దుష్ఫలితమే ఈసంస్థ నాశనానికి దారి తీసినది.

## మదరాసులో ప్రింటింగ్ ప్రెస్సులు

1752 ప్రాంతాన మదరాసులో ఎస్. పి. సి. కె. ముద్రాక్షరశాల నెలకొల్పబడినది. ఈ క్రైస్తవ సంస్థయే బహుజనపల్లివారి శబ్దరత్నాకరాన్ని సంకలనం చేయించి ముద్రించినది. వేపేరిలో ఇంకొకటి ఉండినది. దీనితో ఇక్కడ గ్రంథ ముద్రణం ప్రారంభమైనది. మొదట ఇవి ఇంగ్లీషు తమిళమునే ముద్రించేవి. తెనుగు అచ్చు వెనుకబడే ఉన్నది.

## తెనుగు అక్షరాల పోత

కలకత్తా దగ్గర సేరాంపూర్‌లో ఒక పెద్ద ప్రెస్ ఉండినది. ఇది క్రిస్తానీ మతప్రచారకులదే! అక్కడ వివిధ భారతీయ భాషల అక్షరాలు చేయబడినవి. డాకర్ కేరీ, తెనుగు మొదలైన భాషలు బాగా నేర్చుకొని, వాటిలోకి బైబిల్ ట్రాన్సులేట్ చేయను మొదలుపెట్టినారు. తెనుగుముద్రణకుగా ఇతడు 407 కరువులను (మ్యాట్రిక్సెస్) ఇంగ్లండు నుండి తెప్పించినాడు. ఇతడే 1813లో మొదట తెనుగు వ్యాకరణాన్ని ముద్రించినాడు. బళ్ళారి విశాఖపట్నంలోగూడ క్రైస్తవుల అచ్చుకూటాలు పనిచేయసాగినవి. ఇట్లా ఆంధ్ర ముద్రణోద్యోగమంతా మొదట క్రైస్తవులదిగానే ఉండినది.

బ్రిటీషు కంపెనీ ప్రభుత్వం, కలకత్తాలోను మదరాసు ఫోర్ట్ సెంట్ జార్జిలోను, తమ ఆఫీసర్లకు స్థానికభాషల జ్ఞానం అలవరచేదానికి కాలేజీలు స్థాపించి, ఆయాభాషలలో కొన్ని గ్రంథాలు ప్రచురించినది. సర్ థామస్ మన్రో మదరాసు గవర్నర్ కాగానే దేశభాషలలో ప్రచురణం ఎక్కువ చేసినాడు.



మరుపూరు కోదండరామరెడ్డి

1831 లో మదరాసు ప్రభుత్వ ప్రెస్ ఏర్పరుపబడినది. దీనితో గజిట్ ప్రచురణ ప్రారంభమైనది. దీనితర్వాత. తెలుగు పునరుత్థాన జనకుడు—ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను ప్రయత్నపరచిన మార్గాన నడచి, ఆంధ్రభారతిని రక్షించి పోషించి వర్ధిల్ల జేసిన ప్రథమ జాతీయ సంస్థ-వావిళ్ళ ప్రెస్!

దీనితో సమానంగా మరికొన్ని భారతీయ ప్రెస్సులుగూడ ఉండినవి.

## సి. పి. బ్రౌను శాశ్వత సేవ

ఈ ఇంగ్లీషుదొర 1825లో మదరాసులో కుంపినీ ఉద్యోగిగా చేసినాడు. ఇదే ఆంధ్రభాషా వికాసానికి ముద్రణకు అంకురార్పణ. తెనుగు బాగా నేర్చుకొని, బ్రౌను చాలా తాళపత్ర గ్రంథాలను సేకరించి-శోధించి-శుద్ధ ప్రతులు వ్రాయించి-జూలూరు అప్పయ్యశాస్త్రి మొదలైన మహాపండితులచేత వ్యాఖ్యానాలు వ్రాయించి, కొన్నిటిని ముద్రించినాడు. ఈయన మొదటి ప్రచురణ-వేమన పద్యాలు. స్వవిరచిత ఇంగ్లీషు అనువాదాన్ని చేర్చినాడు (1824). "ఆంధ్ర వాఙ్మయ దీపం ప్రమిదలో మిణుకు మిణుకని ఆరిపోబో తుంటే నేను ప్రాణంబోసినాను" అని ఆదొర సగర్వంగా చెప్పుకొంటున్నాడు.

దీనితర్వాతనే గుజలీ చేటభారతాలు బయలుదేరినవి. ఈ కాలంలోనే నెల్లూరు రంగనాయకులపేటలో రెండు ప్రెస్సులు ప్రచురణలు సాగించినవి.

వావిళ్ళవారితోగూడ నెల్లూరు నుండి మరి కొందరు పుదూరు ద్రావిడులు-వేదం, పురాణం, వదలవాడ-మదరాసు చేరి ప్రచురణం ప్రారంభించిరి. చీరాల ప్రాంతంనుండి కొందరు దేవాంగులు గూడ మదరాసు చేరి ప్రెస్‌లని ప్రారంభించినారు. తండియార్ పేటలో ఇలా చాలా దేవాంగుల ప్రెస్సులు ఉన్నవి.

## వావిళ్ళ ప్రచురణాలయం

''చేతివ్రాత పుస్తకములు చదువుకొనే ఆ దినాలలో శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు ముద్రణాలయమును స్థాపించి, చదువరుల కష్టములు నివర్తిచేసిరి'' అన్న-సి. పి. బ్రౌన్ ప్రశంసే వావిళ్ళ సంస్థకు శాశ్వత కీర్తిఫలకం!

## గ్రంథప్రచురణం

వావిళ్ళ రామస్వామిశాస్త్రి సంస్కృతాంధ్ర భాషల వ్యాప్తికి, హిందూ ధర్మగ్రంథ ప్రచురణకు పూనుకొని కొన్ని ప్రెస్సులుబెట్టి చివరకు ''ఆదిసరస్వతీనిలయము''గా నిలదొక్కినారు. 1854లో ఈయన ఈ సొంతప్రెస్సులో ప్రచురణ ప్రారంభించినారు. అది ఆయనకు నలభైరెండో ఏడు. 1891 వరకు-ముద్రాపకుడుగా, రచయితగా, వ్యాఖ్యాతగా ఆంధ్రభారతిని సేవించి ధన్యజీవులైనారు. 1854-62 మధ్య తెనుగు లిపిలో 17 సంస్కృత గ్రంథాలను, ఇతర పుస్తకాలు యాభైయింటిని ఎంతో వ్యయప్రయాసలకోర్చి వెలువరించినారు. ఈసేవకు లండన్ మ్యూజియం గ్రంథాలయం కొనియాడినది.

## రామస్వామిశాస్త్రి భూరిప్రయత్నం

బ్రౌను పడిన శ్రమ ఫలితాన్నంతా కార్యరూపంలో గ్రంథరూపంలో రామస్వామిశాస్త్రి పెట్టగలిగి, ఆంధ్రభారతికి సుందర గ్రంథరూపం కల్పించినాడు ఈయన స్వయంకృషిగూడ మిక్కుటంగా ఉన్నది. ప్రాచ్యలిఖిత గ్రంథాలయమందలి గ్రంథాలకు ప్రతులు వ్రాయించి శోధిత శుద్ధరూపాలను చేయించి పెట్టినాడు. చాలావాటికి ప్రెస్ కాపీలుగూడ సిద్ధం చేయించినాడు.

రామస్వామిశాస్త్రి స్వయంగా వసుచరిత్ర ఆముక్తమాల్యదకు వ్యాఖ్యానం వ్రాసి ప్రచురించినాడు ఆముక్తమాల్యద వ్యాఖ్యాన విషయంలో వేదం వేంకటరాయశాస్త్రి ఒక అభాండాన్ని సృష్టించినారు. వావిళ్ళశాస్త్రి ఇది వ్రాయలేదని, నెల్లూరు ఆదారి ఒకరు వ్రాసి అచ్చువేయుమని ఇస్తే ఈయన సొంతం చేసుకొన్నాడని-వేదం వారి ఆరోపణ. కాని, కన్నెమర లైబ్రరీలో బ్రౌను సంతకం వరదిపెట్టిన మూడు ప్రసిద్ధ వ్యాఖ్యానాలను, మరికొన్ని ప్రతులను పరీక్షించి, మంచి పండితుడైన రామస్వామిగారే దీనిని వ్రాసినారని చాలామంది పండితులు నిర్ధారణచేసి ఉన్నారు.

## సంస్కృతరామాయణ భారత ప్రచురణ

ఎంతో వ్యయప్రయాసలకోర్చి రామస్వామయ్య సంస్కృతంలో వాల్మీకి రామాయణం, భారతాన్ని ముద్రించినారు. ఈ మహత్కార్యానికి చెన్నపురి పౌరులు శాస్త్రిని ఘనంగా సన్మానించినారు. ఆ రెండు గ్రంథాలను అంబారీ ఏనుగుపై పెట్టి మేళతాళాలతో నగరవీధులలో పెద్ద ఊరేగింపు జేసినారు. రామస్వామిశాస్త్రిని గౌరవించడంలో స్వస్థానం నెల్లూరుగూడ వెనుకపడలేదు. 9-11-1944 నాడు పురమందిరంలో ఆయన రూపపటం ఆవిష్కరింపబడినది. ఆ పెద్దసభలో పలువురు పండితులు వావిళ్ళవారి సాహిత్యసేవను కొనియాడినారు.



వావిళ్ల రామస్వామిశాస్త్రులు

## నూతన ముద్రణ రీతులు

రామస్వామిశాస్త్రి పొడగరి-పసిమిఛాయ-అందగాడు. కాబట్టే తన పుస్తకాలకు గూడ అందం చేకూర్చినాడు. బ్రౌను చూపిన మార్గాను వృద్ధిచేసినాడు. పద్యపాదాల విడదీయించినాడు. పుస్తకాల సైజులు మార్చినాడు. అచ్చుతప్పులను పారద్రోలినాడు. పూర్వపు పుస్తకాల తొలి ముఖపత్రం పీఠిక గద్యల తోను విషయాలతో నిండి ఉండి కొంత చికాకుగా ఉండేవి. ఇవి ఇంగ్లీషు పుస్తకాలలోగూడ చేరి ఉండినవని బ్రౌను వేమన పద్యాలను అచ్చువేస్తూ, ముక్తసరిగా మూడు పంక్తులలో ముగించినాడు (గ్రంథ-గ్రంథకర్త నామాలు, ప్రచురణాలయం పేరు). ఈ పద్ధతి వావిళ్ళ సొంతం చేసుకొని పాఠకుల యాతనను పోకార్చినారు.

టైపుల విషయంలో రామస్వామిశాస్త్రి కొత్తతోవ త్రొక్కినారు. వాటి రూపాలను (ఫేసు)మార్చినాడు. ఇంగ్లీషుబాడీ అనే 14 పాయింటు టైపును స్వయంగా సృష్టింపజేసినాడు. దీనికిగా వావిళ్ళవారు సొంత ఫౌండ్రిని (పోత కర్మాగారం) నెలకొల్పుకొన్నారు. ఆంటిక్ అనే ముద్దు అక్షరాలు గూడ ఈయనవనే.

## వెంకటేశ్వరశాస్త్రి- ప్రచురణ కార్యక్రమం

రామస్వామిశాస్త్రి వావిళ్ళ సంస్థ అనే చిన్నమొక్కను నాటినాడు. ఆయన కొమారుడు-వెంకటేశ్వరశాస్త్రి దానిని పెంచి, ఊడలుదిగిన ఒక మహా వటవృక్షంగా చేసినాడు. సంస్కృతం, నాగరలిపి సంస్కృతం, తెనుగు ఇంగ్లీషు, అరవంలో వేయి గ్రంథాలను ప్రచురించినాడు. కొన్నిటికి పెక్కు సంపుటాలు ఉండేవి.

వెంకటేశ్వరశాస్త్రి ప్రచురణ చరిత్ర అద్భుతం; దాని వివరణ కొంత-

## పీఠికలు - విమర్శలు

గుజిలీ ప్రతులలోనే విషయసూచికలు ప్రారంభమైనవి. ఇంగ్లీషులోవలె గ్రంథపీఠికలు విమర్శలు వావిళ్ళ పెంచిపెద్దజేసిన పూలకొమ్మ. వెంకటేశ్వరశాస్త్రి ప్రతిపుస్తకానికి ఆనాటి పెద్దలచేత విమర్శాత్మక పీఠికల వ్రాయించి ప్రచురించినారు. అందు గ్రంథకర్త విషయం, అందలి కవితా విమర్శలుండి పాఠకుని తగిన త్రోవలో పెట్టేవి. నేటి తులనాత్మక విమర్శలకు అదే బీజావాపము. ఇంతకు ముందు కాశీభట్ల బ్రహ్మయ్య, కందుకూరు వీరేశలింగం దీనిని ప్రారంభించినా, వీరు ఇందు ప్రత్యేక స్థానమాక్రమించుకొన్నారు.

డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి ఆక్స్‌ఫర్డులో చదువుచున్నప్పుడే, ఆయన చేత వెంకటేశ్వర శాస్త్రి కళాపూర్ణోదయానికి పెద్ద పీఠిక వ్రాయించి ముద్రించినారు. ఈ వ్యాసమే కవిత్వతత్త్వ విచార రూపంలో ఆంధ్రవాఙ్మయరంగంలో ఒక బాంబు వంటిదై విప్లవమార్గాన్ని చూపినది.

హిందూధర్మ గ్రంథ ముద్రణభారం ఎక్కువగా వావిళ్ళవారిపై బడినది.

## మత వాఙ్మయం

ఈ బాధ్యతను మహిమోపేతంగా వావిళ్ళ-తండ్రి కొడుకులు నిర్వహించినారు. ఆంధ్రులకు ఇదే శరణ్యమైనది; ఈ పనికి ఈ పెన్ను విని మయం చేయబడినదనవచ్చు. మతానికి, తత్త్వ శాస్త్రానికి, సాహిత్యానికి, వైదిక కర్మ కలాపానికి సంబంధించిన- అవసరమైన ప్రతి సంస్కృత పుస్తకం ప్రచురించినారు. ఇందు లాభాపేక్షవారికి కలుగనేలేదు. కాబట్టే కొన్ని శాస్త్ర గ్రంథప్రతులు వేయి, వెలపోను నలభైఏండ్లు పట్టేది. ఏ చిన్న మతాంతరశాఖగూడ తమ స్మార్త గ్రంథము వావిళ్ళలో లభించలేదన్న నిస్పృహ జెంది ఎరుగదు. ఇది వావిళ్లవారికి గుత్త అయిపోయినది.

వేదం, ఉపనిషత్తులు, ఇతిహాసాలు, వైదిక గ్రంథాలు ఎన్నిటినో ప్రచురించినారు. సంకలన గ్రంథం (అకారాది) ఇంగ్లీషులో అమూల్యపద్ధతి. దానిని వీరు చేపట్టినారు. "బ్రహ్మవిద్యాదీపిక" (1891 - రామస్వామిశాస్త్రి మరణించిన సంవత్సరం) చాల ప్రశస్తమైనది. "అష్టోత్తరశతోపనిషత్" ఇంకొక పెద్ద సంకలనం.

## నవ్యరీతులు

వీటితోబాటు, ఆంధ్రసాహిత్యంలో ఎన్నో నవ్య రీతులను వీరు చేపట్టినారు. కాని అవి హిందూధర్మ ప్రదీపకాలుగానే ఉండిలీరాలి. అయినా అధునాతన గ్రంథాలను వదలిపెట్టలేదు. కార్ అనే ఇంగ్లీషు సైనికోద్యోగి ఇంగ్లీషు అనువాదంతో సంకలనం చేసిన తెనుగు సామెతలను, బ్రౌను వేమన ఇంగ్లీషు తర్జుమాను అచ్చువేసినారు. నెపోలియన్ చరిత్ర, స్కాట్ నవలలు, యవనయామినీ కథలు, దర్వేషుల కథలు—వీరి విజాతీయ ప్రచురణలు. వినోద కథా కల్పవల్లి, కాశీమజిలీల కథలు ప్రజారంజకాలు.

## కావ్య పురాణాదులు

ఆంధ్రభారత భాగవతాలు, ఉన్న పురాణాలు, బయటపడిన ప్రబంధాలు, తెనుగులో తత్త్వ గ్రంథాలు—ఒకటి వదలకుండా, పరిశోధించి ప్రచురించినారు.

## జాతీయాభిమానం

వెంకటేశ్వరశాస్త్రి ఎంతటి హిందూధర్మాభిమానో, అంతటి శుద్ధ జాతీయవాది. లోకమాన్య బాలగంగాధర తిలక్ దగ్గరిశిష్యుడు. వందేమాతర గీతాన్ని భారతజాతికి ప్రసాదించిన బంకించంద్రుని ఆనందమఠ్‌ను 1908 ప్రాంతాననే తెలుగులో వ్రాయించి (ఒ. వై. సి. దొరసామయ్య) ప్రచురించినారు. భారతీయ నాయకుల సంగ్రహ జీవిత చరిత్రల ప్రచురించి ఉత్తేజం కలిగించినారు.

రవీంద్రనాథ ఠాగూరు గ్రంథాలు చాలా వ్రాయించి ప్రచురించినారు. వీరి షడ్భాషామంజరి- అనేదే వివిధ భాషలు నేర్చుకొనేవారికి పట్టుకొమ్మగా వుండినది.

## ఆంధ్ర టీకలు

ప్రాచీన ఆంధ్ర ప్రబంధాలకు పండితులచే వ్యాఖ్యానాలు వ్రాయించి విద్యార్థులకు మహోపకారం చేసినారు. వాటి అచ్చుపని వావిళ్ళవారు పూర్తిచేసినారు. ఇది ఒకసాటి గ్రంథ కామక్షన లుగాగూడ ఉండనది.

శతక వాఙ్మయము, కవుల చరిత్ర, వచన గ్రంథాలు, అనేకాలు వీరి క్యాటలాగులోనివి, చాలా ఉపయుక్తకరములు. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర వ్రాయించినారు. శతక వాఙ్మయచరిత్ర, కవుల చరిత్రగూడ

సంస్కృతాంధ్ర నిఘంటువులకు లెక్కేలేదు. సూర్యారాయాంధ్ర నిఘంటువుకు ప్రతిపక్షిగా "వావిళ్ళ" నిఘంటువును (4 సంపుటాలు) వెలువరించినారు. వైద్య గ్రంథాలు, జ్యోతిష పుస్తకాలు పెక్కులు అమూల్యాలు.

వీరు ముద్రించి ప్రచురింపని శాఖలేదంటే అతిశయోక్తిగాదు.

## నాగరలిపి సంస్కృత గ్రంథాలు

ఇవన్నీ తెనుగులిపిలోవున్నా, నాగరలిపిలో గూడ 50 గ్రంథాలకుపైన సంస్కృతంలో ప్రచురించినారు. అందు 1933 లో 18 సంపుటాలలో ప్రచురించబడిన సంస్కృత మహాభారతం దేశమందంతటా పేరుదెచ్చుకొన్నది. మహా విమర్శక పండితుడు- ప్రొఫసర్ పి. పి. సుబ్రహ్మణ్యశాస్త్రి (ఎం. ఎ, ఆక్సన్) దీనికి సంపాదకుడు.

వావిళ్ళ ఆంధ్ర భారతానికి ఒక ప్రత్యేక స్థానమున్నది - ఉస్మానియా యూనివర్సిటీ 5 లక్షల వ్యయంతో అనేక పండిత ప్రకాండుల సహాయంతో ఇరువైఏండ్లు శ్రమించి ఆంధ్రభారత సంశోధిత ప్రతిని వెలువరించినారు. వారికి మూలపాఠగ్రంథం (వల్‌గేట్) వావిళ్ళవారి ప్రతి. యూనివర్సిటీవారి పనివల వావిళ్ళవారి కృషి విలువ - పరిమాణం మదింపు వేయవచ్చు.

## తమిళ ప్రచురణాలు

వావిళ్ళవారు తెనుగుచదువుల తల్లిని సేవించిన ద్రావిడ పుత్రులు కాబట్టినీ, చెన్నపట్నం తమిళుల తెలుగుల సమష్టిభాగం కాబట్టి తమిళసాహిత్యాన్ని గూడ పోషించినారు. తమిళంలో 50కి పైన పుస్తకాలు ప్రచురించినారు.

వెంకటరాజులు రెడ్డియార్ అనే తమిళ విద్వాంసుడు వీటికి సంపాదకుడు. ఈ రెడ్డి ఆంధ్ర సంస్కృత కన్నడ మళయాళములలోగూడ గట్టి పండితుడు. ఈ మధ్య చనిపోయ్యేదాక, ఈ భాషల పరస్పర సన్నిహితత్వానికి పెద్దబాటగా ఉండినాడు. ఈయనపూర్వులు మన-ఊదూరినుండి, నాంగునేరికి పోయినారు.

తమిళ ప్రచురణాలలో ఎన్నదగినది—తొల్కాప్పియం అను తమిళ ప్రథమ వ్యాకరణం. క్రీ. శ. మొదటి శతాబ్దపు ఈ వ్యాకరణాన్ని దేశభక్తపరాయణుడు-ప్రథమ భారతీయ నౌకావాణిజ్య జనకుడు-విప్లవవీరుడు-వి. ఓ. చిదంబరం పిళ్ళై సంస్కరించి ఎడిట్ చేసినాడు. రెండవది—అతిప్రఖ్యాతిగన్నది-శిలప్పదికారం (మ తీకగాథ). బాలవినోదిని అనే తమిళ బాలుర పత్రికనుకొంత కాలం ప్రచురించినారు. దీని సంపాదకుడు—తమిళనాటికి జాతీయభావవైతాళికుడు – సుబ్రహ్మణ్యం భారతి.

## వార్తాపత్రికలు

దక్షిణాదిన అరవలకువలెనే ఆంధ్రులకు ఆధునిక బలవత్తర సాధనమైన పత్రికారంగమున మంచి చొరవ ఉన్నది. వెంకటేశ్వ శాస్త్రి లోకమాన్యతిలక్ రాజకీయపక్షీయుడు. అందువల్ల మిత వాదధోరణి కలిగిఉండిన తిలకు ఆనిబిసెంటు ఉద్యమాలను బలపరచినారు.



## శ్రీ వెంకటేశ్వర ఎంటర్ ప్రైజస్

(సూపర్ మార్కెట్ సమీపం)

**17,61 ట్రంకురోడ్డు - నెల్లూరు**

మావద్ద అతిసులభమైన వాయిదా పద్ధతులలో మరియు రొఖమునకు మీకు కావలసిన

**స్టీలు బీరువాలు, 6 X 3 డైనింగ్ టేబుల్స్, టేబిల్ ఫ్యాన్సు, సీలింగ్ ఫ్యాన్సు, ట్రాన్సిస్టర్లు**

మొదలగునవి లభించును: విచ్చేయండి.

---

కొరతలేని మందులతో
క్రొత్తగా ప్రారంభించబడి
డాక్టర్ల ప్రోత్సాహముతో
ప్రజాదరణ పొందుతున్న



## కుమార్ మెడికల్స్

నెం. 11 జలగం వెంగళరావు బిల్డింగ్సు.

స్వతంత్రపార్కు దగ్గర

నెల్లూరు

---

ఉగాది శుభాకాంక్షలతో

## సుగుణా ఎంటర్ ప్రైజస్

నెం. 13 జలగం వెంగళరావు బిల్డింగ్సు

స్వతంత్రపార్కువద్ద - నెల్లూరు.

**Dealers in all steel and wooden furnitures.**

**Stockists for ALANKAR steel products**

**Vjayawada-2**

## త్రిలిఙ్గ

అక్కిరాజు ఉమాకాంతంగారి సంపాదకత్వాన త్రిలిఙ్గ అనే ఆంధ్ర వారపత్రికను వీరు నడిపినారు. ఈ పత్రిక 1941లో పెద్దఎత్తున రజతోత్సవం జరుపుకొన్నది. అధ్యక్షతవహించిన పూనె కేసరి పత్రికాసంపాదకులు-నృసింహ చింతామణి కేల్కర్ శాస్త్రి సేవలు కొనియాడినారు.

## FEDERATED INDIA

ఈ పేరుతో ఒక ఆంగ్ల పక్ష రాజకీయపత్రికను చాలా ఏండ్లు ప్రచురించినారు. దీనికి ప్రసిద్ధులు—వ్యాసరరావు సంపాదకులు.

## వెంకటేశ్వరశాస్త్రి-పార్శ్వదృష్టి

వెంకటేశ్వరశాస్త్రి తండ్రివలెనే మంచి పండితుడు. ఇంగ్లీషులో తెనుగులో చాలావ్యాసాలువ్రాసి ప్రచురించినారు. వీరు మంచి జాతీయాభిమానులు. చెన్నపట్నంలో సాంఘిక రాజకీయ రంగాలలో మంచి పలుకుబడి, సర్వపక్ష వాల్లభ్యత కలిగి ఉండినారు. ఆనాటి జస్టిస్‌పార్టీ ప్రముఖులు ఎంతటి సన్నిహితులో, ఆంధ్ర స్వరాజ్య నాయకులుగూడ ఈయనకు అంతటి దగ్గరివారు. ఆంధ్ర ఉద్యమానికి నాయకులకు ధారాళంగా చందాలు ఇచ్చేవాడు.

## సభలు-సన్మానాలు-బిరుదాలు

వెంకటేశ్వరశాస్త్రి చేసిన భాషాసేవకు తగిన మర్యాదలే జరిగినవి. 1919లో నెల్లూరులో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్తు సమావేశంలో ఒకసువర్ణ పతకం బహూకరింపబడింది: నెల్లూరు పురమందిరంలో రూపపటం ఆవిష్కరింపబడినది.

కాశీక్షేత్ర విద్వన్మండలి వీరికి "శాస్త్ర ప్రచార భూషణ" అని బిరుదమిచ్చినది. ఆంధ్ర పండిత లోకం కడపలో సమావేశమై "భాషోద్ధారక" అనే బిరుదమిచ్చినారు. చెన్నపురి గోఖలే హాలులో శాస్త్రి రూపపటం ఆవిష్కరింపబడినది. చివరన 1955లో ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదమిచ్చినది.

త్రిలిఙ్గ రజతోత్సవ సందర్భంలో తెనుగు-ఇంగ్లీషు భాషలందు మంచి వ్యాసాలతో పెద్ద సంస్కరణ సంచికలు వెలువరింపబడినవి.

## ప్రాసిక్యూషన్

ఇట్లా వావిళ్ళసంస్థ ఎదిగి ఎదిగి దిగంతవ్యాప్తి నొందినది. దీనితోడు కొందరు బ్రహ్మసామాజికులను శాస్త్రి వైదికధర్మసేవ గిట్టలేదు. గోటేటి కనకరాజు గవర్నమెంటు ట్రాన్స్‌లేటర్‌గా ఉన్న కాలంలో, ఈ సంఘ సంస్కరణ పరాయణుడు వావిళ్ళవారు బూతు పుస్తకాలు అచ్చువేశారని వారిపై ప్రాసిక్యూషన్ దెప్పించినారు. 1911లో బ్రిటిషుప్రభుత్వం శృంగార కావ్యాలు ప్రచురించరాదని చేసిన శాసనం క్రింద ఈకేసు మోపబడినది. దీనిపైన దేశంలోగల పెద్దలు—రాజకీయవాదులు—పండితులు సభలుచేసి, కేసు వదులుకోమని ఒత్తిడి చేసినారు. కేసు ఉపసంహరించుకొన్నారు.

ఈలోపల శృంగార పద్యాలచోట చుక్కలు పెట్టి మనప్రబంధాలు వచ్చినవి. 1937లో రాజగోపాలాచారి కాంగ్రెసు ప్రభుత్వంగూడ; ఈ విషయం పట్టించుకోలేదు. 1947 లో ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు ప్రభుత్వం ఈ ఆంక్షను తొలగించినది.

## నేటిక్షీణస్థితి

ఇట్లా నూటఇరవై ఏండ్లు పెరుగుదల చూసి, 1000 పుస్తకాలు వెలువరించి, హిందూధర్మాని, భాషాదేవులను సేవించిన వావిళ్ళ ప్రచురణకు కడగండ్లు వచ్చి దానికీర్తి దీపం ఆరిపోతున్నది.

శాస్త్రి ఒకరిని దత్తు తీసుకున్నట్లు ఒక వ్యాజ్యం వచ్చినది. ఈ లోపల బిడ్డలులేని భర్త మరణానంతరం, భార్యకు ఆస్తి అంతా సంక్రమించే శాసనం వచ్చినది. దీనితో శాస్త్రి భార్య-సుబ్బమ్మ సంస్థను స్వాధీనంచేసుకొని, ధర్మసంస్థగా వ్యవహరిస్తూ, తన చెల్లెలి అల్లుడికి స్వాధీనం చేసినది. ప్రచురణలు వస్తూనేవుండినవి.

దత్తస్వీకారపు కేసు కొట్టివేయబడినది. శాస్త్రి ఇంకొక చెల్లెలుకొడుకు, సంస్థ బాగా జరగడం లేదని, ధనం దుర్వినియోగం అవుతున్నదని, మదరాసు కోర్టులో దావా చేసినాడు. విచారణలో అబందరలు జరిగినవని రుజువైనది. భార్య చనిపోయినది. శాస్త్రి విల్లు శాస్త్ర రీత్యా సరిగాలేదని, ఎక్కువభాగం సంక్రమించే సంగతి స్పష్టంగా లేదని, సంస్థ ప్రభుత్వ స్వాధీనం (ఎస్‌చీట్) అయిపోయినది.

బ్యాంకులు చాలా బాకీగా నిలిచిపోయినవి. ప్రభుత్వ రిసీవరు ప్రచురణాలయాన్ని, స్థిరాస్థిని అంతా స్వాధీనం చేసుకొని పుస్తకాలు-ప్రెస్-ఇండ్లు అమ్మి ప్రభుత్వ బాకీలను చెల్లువేసుకొంటున్నాడు. ఇట్లా పోను మిగిలింది, తమిళనాటి ప్రభుత్వ బొక్కసంలో లీనమైపోతున్నది. ఆంధ్రులసంస్థ నామరూపాలు లేకుండాపోతున్నది.

★

## సాహిత్య పత్రికారంగంలో నెల్లూరి కీర్తిపతాక-
## పూండ్ల రామకృష్ణయ్య సారస్వతసేవకు శాశ్వతప్రతీక

# అముద్రిత గ్రంథచింతామణి

డాక్టర్ కాళిదాసు పురుషోత్తం ఎం. ఏ., పిహెచ్. డి.

ఆంధ్రదేశంలో పత్రికోద్యమం గత శతాబ్ది లోనే ఆరంభమైనా, ఆనాటి తొలిపత్రికల ఆనవాలుకూడా మిగలకుండా పోయింది. తొలి తెలుగు పత్రిక విషయం ఈ నాటికీ వివాదాస్పదంగానే ఉండిపోయింది. నెల్లూరు మండల పత్రికోద్యమం కూడా ఇందుకు భిన్నంగాలేదు. 1865 ప్రాంతాలలో దంపూరు నరసయ్య మొదలగు వారికేతుల్లో పురుడు పోసుకున్న నెల్లూరు పత్రికోద్యమానికి సంబంధించిన తొలిదాఖలాలేవీ ఈనాడు మిగల లేదు. ఇప్పుడు లభ్యమయ్యే నెల్లూరు తొలి తెలుగు పత్రిక పూండ్ల రామకృష్ణయ్యగారి 'అముద్రిత గ్రంథ చింతామణి.'

అయితే ఈ ఒక్కవిషయం చేతనే ఈ పత్రిక స్మరణీయంకాదు. 19వ శతాబ్ది చివరి పాదంలో ఆంధ్రదేశంలో సాగిన భాషాకృషికీ, సారస్వత సంచలనానికీ, చెలరేగిన పండిత వివాదాలకూ అముద్రిత గ్రంథ చింతామణి పట్టిన దర్పణం. ఆ నాటి సారస్వతేయుల అభిరుచులకూ విమర్శనా పద్ధతులకు ఈ పత్రిక కంటె మరొక సజీవ సాక్ష్యం లేదు. ఆ నాటి సాహితీపరులందరూ ఏదోవిధంగా ఈ పత్రికతో సంబంధం పెట్టుకున్న వాళ్ళే; ఈ పత్రికలోరేగిన వివాదాలలో పాల్గొన్న వాళ్ళే. కొందరు కవులు, రచయితలు ఈపత్రికలో తమ రచనలు ప్రకటించి, సుప్రసిద్ధులయ్యారు. వారికీర్తికి ఈ పత్రిక ఒక సోపానమయింది.

1885 నుండి దాదాపు 20 ఏళ్ళు ఈ పత్రికా వ్యవసాయం సాగింది. రామకృష్ణయ్యగారు ఈ సాహిత్యసవన నిర్వహణమే తమ జీవితాశయంగా చేసుకున్నట్టు కన్పిస్తుంది. ఆయన 23 వ ఏట ఆరంభించి, చివరిదాకా పత్రికను కొనసాగిస్తూనే వచ్చారు. పత్రికను కొనసాగించేందుకు తగినంత సాధన సంపత్తులున్నవారు కారాయన. ఏ రోజుకా రోజు ఇల్లు గడవడమే కష్టంగా ఉన్న ఆర్థిక స్థితిలో ఉన్నారు. అయినా ఆ పేదరికమూ, కష్టాలూ ఒక లెక్కలోకి రాలేదు. సంపన్నుల సహాయంతో, మిత్రుల సహకారంతో అముద్రిత గ్రంథ చింతామణిని నిర్వహించారు. ఈ నాటికీ, పండితులు, పరిశోధకులు చిన్నదానికి, పెద్దదానికి అముద్రిత గ్రంథ చింతామణిని ఆకరగ్రంథంగా ఉపయోగించుకుంటూనే ఉన్నారు. గత శతాబ్ది తుదిపాదంలోని ఆంధ్ర సాహిత్య వికాసాన్ని పరిశీలించగోరేవారికి అముద్రిత గ్రంథ చింతామణి ఒక గొప్ప ఆకరగ్రంథం.

1865 ప్రాంతాలకే తెలుగు వృత్తాంత పత్రికలలో సారస్వత విషయాలు, మత విషయాలు చోటు చేసుకున్నాయి. బళ్ళారి నుండి వెలువడే 'యక్షిణి' అనే పత్రికను తమ బాల్యంలో ఎంతో ఆసక్తితో చదివినట్లు వీరేశలింగం పంతులుగారు పేర్కొన్నారు. 'చిన్నయసూరి మొదలగువారు ముద్రించుచుండిన సుజనరంజని'లో విద్యాసారస్వత విషయాలు అనేకం ఉండేవని తెలుస్తూంది. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు 1871లో ఆంధ్రభాషా సంజీవనిని ప్రారంభించి పన్నెండేళ్లు నడిపారు. ఆ రోజుల్లోనే బందరునుండి పురుషార్థ ప్రదాయిని, స్వధర్మప్రకాశిని మొదలైన పత్రికలు వెలువడుతున్నాయి. రాజమహేంద్రవరం నుండి వీరేశలింగం పంతులుగారు వివేకవర్ధినిని నడిపారు. కాకినాడ, విశాఖపట్నం, మద్రాసు మొదలగు పట్టణాలనుండి అనేక పత్రికలు వెలువడుతూండేవి. ఆనాటి ఈ పత్రికోద్యమమే నెల్లూరి వారికికూడా ప్రేరణనిచ్చి ఉండాలి. కలెక్టరాఫీసు ఉద్యోగి అయిన ఉల్లిగొండం రామచంద్రరావనే మధ్యపండితులొకరు 1882 లో నెల్లూరులో విద్యార్థి కల్పభూజమనే పత్రికను ప్రారంభించి కొద్దికాలం నడిపారు. ఇదే నెల్లూరులో పుట్టిన తొలి సారస్వత పత్రిక. ఈ పత్రిక 1883లో నిలిచిపోయింది. పన్నెండేళ్ళు అవిచ్ఛిన్నంగా నడచిన 'ఆంధ్రభాషాసంజీవని'కూడా ఆ యేడే ఆగిపోయింది.

తర్వాత సాహిత్యానికే అంకితమైన పత్రిక మళ్లీ ఒకటి కొనసాగితే బాగుంటుందనే అభిప్రాయం పూండ్ల రామకృష్ణయ్యగారికి కలిగి ఉండాలి. పైగా ఉల్లిగొండం రామచంద్రరావు ప్రేరణ, తోడ్పాటు ఆయనకు ఉంది.

అముద్రిత గ్రంథ చింతామణి ప్రారంభించే నాటికి రామకృష్ణయ్యగారికి పట్టుమని పాతికేళ్ల కూడా లేవు. □ అప్పర్ ప్రైమరీ స్కూలు విద్యాభ్యాసం ముగిసినతర్వాత, ఆయన స్వయంకృషితో తెలుగులో 'నిరూఢమగు' సాహిత్యాన్ని గడించారు. జన్మతో కొంచెం నత్తి వచ్చినా, పుస్తకాలు 'నిరంకుశధారతో' చదివేవారు. అదేవిధంగా ఉపన్యసించేటప్పుడూ ఆయనకు నత్తి అడ్డం వచ్చేది కాదు. అప్పుడప్పుడే జీవితంలోకి అడుగు

---

□ 1860 జూలై, 14 రామకృష్ణయ్యగారి జననం. నెల్లూరుకు సమీప గ్రామం దువ్వూరు స్వగ్రామం. నియోగి బ్రాహ్మణుడు.

With the best compliments from:

## M/s. BALAJI AGENCIES And INDUSTRIES

15/529 R. R STREET, NELLORE-1

Phone No. 1049

**Distributors INTERNATIONAL TRACTORS, LAMBRETTA, MAC SCOOTERS and TRI-WHEELERS**

---

Phone Nos. 780 & 790 Grams: EXTRACTION

## INDIA OILS & FERTILISERS CORPORATION

NAVALAKH GARDENS, NELLORE-2 (A. P.)

Producers and Exporters of Rice Bran oil, Neem oil, De-oiled Rice Bran and De-oiled Neem Cake.

పెరుగుతున్న రామకృష్ణయ్యగారికి హిందూ వర్నాక్యులర్ స్కూల్ ఆంధ్ర పండితులు ఒడయారు వీరనాగయదేవరతో స్నేహం కుదిరింది. * ఇద్దరూ కలిసి 1885 జూన్ 1వ తేదీన 'అముద్రిత గ్రంథ చింతామణి'ని ప్రకటించారు. ఈ పత్రిక 16 పుటలతో వెలువడేది. మొదటి నాలుగు పుటలలో వేదోవ్యాకరణాది శాస్త్ర విచారం, గ్రంథవిమర్శ సమస్యాపూరణం, వసుచరిత్ర మనుచరిత్రాది ప్రాచీన ప్రబంధములందలి కఠినపద్యములకు అర్థ నిరూపణము, భిన్నప్రతులలో పాఠాంతరములున్నచో కవిహృదయ నిర్ధారణ, లక్షణ విరుద్ధములగు శబ్ద సమాసములకు ఆక్షేపణ, పూర్వపక్ష సిద్ధాంతము, చాటు పద్య ప్రచురణ, విద్యా విషయికమైన లేఖలు మున్నగు అనేకాంశాలు ప్రచురించేవారు. తక్కిన పుటలలో అముద్రిత గ్రంథాలను సేకరించి, పరిష్కరించి ముద్రించేవారు. నిరాదరింపబడి నశించిపోతున్న తాళపత్ర గ్రంథాలను సముద్ధరించడం ఈ పత్రిక ప్రధానాశయం. ఈ విషయాన్నే—

జతనంబు మీఱంగ నము
ద్రిత సద్గ్రంథముల సేకరించి కడు పరి
ష్కృతములుగావించి యథా
మతిఁ బత్రికఁ గూర్చెదము క్రమంబుగ వానిన్.

అని మొదటి సంచికలోనే చెప్పుకున్నారు.

అముద్రితగ్రంథ చింతామణి మొదటి రెండేళ్లూ అవిఘ్నంగా కొనసాగింది. ఆటుతర్వాత రామకృష్ణయ్యగారు రోగగ్రస్తులైనారు. అయిదారునెలలు ఆయన జీవితాశ విడిచిపెట్టి, మంచం పట్టడంవల్ల మూడోసంవత్సరం ప్రచురణ కొనసాగలేదు. స్వస్థత చేకూరిన తర్వాత 1887 అక్టోబరులో మూడో సంపుటం ఆరంభించినా అనేక అవాంతరాలు వచ్చిపడ్డాయి. సహాయంగా ఉండిన వీరనాగయ కవి, పత్రికవల్ల ఏ సహాయమూ లేదని నెల్లూరు విడిచిపెట్టిపోయారు. ఈ అదనులోనే రామకృష్ణయ్యగారిపై సివిల్ వ్యాజ్యం ఒకటి వచ్చిపడింది. అది పూర్తయేటప్పటికి ముద్రాక్షరశాలాధిపతి మరణించాడు. ఇన్ని ఆపదలు గడచి, మూడో సంపుటాన్ని 1890 డిసెంబరుకు పూర్తి చేశారు. ఈ కాలంలోనే రామకృష్ణయ్యగారికి ఇంకో సమస్య వచ్చిపడింది. తమ రచనలు ప్రచురించడంలేదని, వృత్తాంతాలు కొత్తగా వెయ్యడంలేదని కొందరు చందాదారులు పత్రికపై కినుక వహించారు. వార్తలు ప్రకటించకపోతే పత్రిక వన్నెకెక్కదని చందాదారులు, మిత్రులు సలహా యిచ్చారు. ఏమి పాలుపోక, పత్రికాపోషకులలో ఒకరూ, ఆనాటి సుప్రసిద్ధ హైకోర్టున్యాయవాది, సాహితీ బంధువూ అయిన రావుబహదూర్ పనప్పాకం అనంతాచార్యులను రామకృష్ణయ్యగారు సంప్రదించారు. ఆయన 'వృత్తాంతాది విషయములు నిండు వ్రాయ వలదనియు నిట్టి విద్యావిషయిక పత్రిక యొకటి యుండవలయుననియు నాంగ్లేయభాషయందు "ఆశీనియం" అను దీనింబోలు పత్రిక యొకటి వెలయుచున్నదని' దానిమాదిరే దీన్ని నడపమనీ ఆదేశించారు. వృత్తాంతాపేక్షకులు 'ఆంధ్రప్రకాశికా'ది పత్రికలు చూచుకుంటారని ఆయన సలహా యిచ్చారు. అంతట వార్తలు వ్రాయకూడదని, అముద్రితగ్రంథ చింతామణిని విద్యావిషయ పత్రికగానే కొనసాగించాలనీ రామకృష్ణయ్యగారు తీర్మానించుకున్నారు. "ఎన్ని విఘ్నములు గలిగినను మా శరీరయాత్ర యంతయు నిందే గడుపవలయునని నిశ్చయించుకొని నారము" అని పత్రికలో ప్రకటించుకున్నారు. 1891 జనవరినుండి నాలుగవ సంపుటి ఆరంభమైంది. ఆనాటినుండి రామకృష్ణయ్యగారు ఆమరణం పత్రికా ప్రకటన, పుస్తక ప్రచురణలకే జీవితాన్ని అంకితం చేశారు.

రామకృష్ణయ్యగారు ఒకవైపు పత్రికను కొనసాగిస్తూ, మరొకవైపు తాళపత్రాలను పరిష్కరించి పుస్తక ప్రచురణ చేస్తూవచ్చారు. మిత్రవిందా పరిణయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, తిమ్మన భర్తృహరి నీతిశతకము, ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసము, చంద్రాంగద చరిత్రము, భోగినీదండకము, ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము, వసుంధరా పరిణయము, యాదవ రాఘవ పాండవీయము మొదలైన ప్రాచీన గ్రంథాలను పరిష్కరించి, చక్కని పీఠికలనుచేర్చి అచ్చువేశారు.



డాక్టర్ కాళిదాసు పురుషోత్తం

ఈ విధంగా అముద్రిత గ్రంథాలను ముద్రించడమనే తమ పత్రిక ప్రధానాశయాన్ని సార్థకంచేసుకున్నారు. ఈ గ్రంథాలకు రామకృష్ణయ్యగారు వ్రాసిన సుదీర్ఘమైన పీఠికలు ఆయన పరిశోధనా దృష్టికీ, పాండిత్యానికీ నిదర్శనాలు. తాళపత్ర గ్రంథాల సేకరణ, పాఠ పరిశోధన ఆయనకు వినోదాలు. మద్రాసు వెళ్ళినప్పుడల్లా ప్రాచ్యపరిశోధనాలయంలో అడుగుపెట్టకుండా వచ్చేవారు కాదు. ప్రతిపుస్తకాన్ని పరిష్కరించే ముందు అనేక వ్రాతప్రతులను సంపాదించేవారు. సందేహనివృత్తి కోసం ఎక్కడెక్కడికో వ్రాసి పాఠభేదాలు తెప్పించుకునేవారు. "ఆ మూల్య గంథములకంటె వానికిఁ బాండ్ల రామకృష్ణయ్య వారొనర్చిన పీఠికలు మిక్కిలి చక్కగానున్న" వని కొక్కొండ వెంకటరత్నముపంతులు ప్రశంసించారు.

మండపాక పార్వతీశ్వరకవికి రామకృష్ణయ్యగారిచ్చిన ప్రాముఖ్యం మరెవ్వరికీ ఇవ్వలేదు. అర్వాచీన కవులలో ఓగిరాల జగన్నాథకవి కవిత్వమూ, పార్వతీశ్వరశాస్త్రి కవిత్వమూ ఆయన ఎక్కువగా మెచ్చినవి. శ్రీమత్ త్రైపదేంద్ర గురుచరిత్రము, ప్రబంధ సంబంధ బాధ నిబాధన గ్రంథము, శ్రీ కృష్ణాభ్యుదయము మొదలగు పార్వతీశ్వరకవి కృతులను ప్రచురించారు. పార్వతీశ్వర కవి ఆత్మకథను, హరిహరేశ్వర శతకమను పేర వ్రాయించి అచ్చువేశారు. ఆయన జీవితాన్ని, కృతులను అముద్రిత గ్రంథ చింతామణిలో

* వీరనాగయ వీరశైవ మతస్థుడు. 15-7-1875లో నెల్లూరు హిందూవర్నాకులర్ స్కూలులో సంస్కృతాంధ్ర పండితుడుగా ప్రవేశించాడు. శివరాత్రి మాహాత్మ్యమనే చిన్న ప్రబంధాన్ని వెంకటగిరి ప్రభువు కంకితం చేశాడు. 1880లో గవర్నర్ బకింగ్‌హామ్ నెల్లూరు వచ్చినపుడు "శ్రీ బకింగ్ హాం సింహపురీ సందర్శన"మనే చిరుకావ్యాన్ని రచించాడు. పిడుపర్తి సోమన బసవపురాణాన్ని పరిష్కరించి, సంస్కృతంలో ఒక పీఠిక వ్రాశాడు. వావిలపాడు తాలూకా శివరామపురమను స్వగ్రామంలో ఖరసంవత్సర ఫాల్గుణ మాసంలో శివసాయుజ్యాన్ని పొందాడు.

పూండ్లవారు వ్యాసంగా వ్రాశారు. సమకాలికులైన వడ్డాది సుబ్బరాయుడుగారి ముకుంద శతకాన్ని, మచ్చ వెంకటకవి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్రాన్ని, మండపాక పార్వతీశ్వర కవి కుమారుడు కామశాస్త్రి ప్రాస్తారిక పద్యాలను ప్రచురించారు. ఇట్లా ఆయన ప్రచురించిన గ్రంథాలింకా పేర్కొనదగ్గవి చాలా ఉన్నాయి.

రామకృష్ణయ్యగారు స్వయంగా ఏ గ్రంథమూ రచించినట్లు లేదు. ఆయన అముద్రిత గ్రంథ చింతామణిలో అప్పుడప్పుడు కొన్ని పద్యాలు వినోదంగా వ్రాశారు. వావిలికొలను సుబ్బారావు గౌరవ పురస్సరంగా ఒక 'గణమాల'ను వ్రాశారు. ఇవే ఆయన పద్యాలు.

రామకృష్ణయ్యగారికి చాటు పద్యాల సేకరణపై మంచి ఆసక్తి ఉండేది. వంద పైచిలుకు చాటు పద్యాలు సేకరించి అముద్రిత గ్రంథచింతామణిలో ప్రచురించారు. ఆయన ప్రకటించిన చాటుపద్యాలలో కొన్ని వేటూరివారి సంకలనంలోనూ, మరికొన్ని దీపాలవారి సంకలనంలోనూ చోటుచేసుకున్నాయి. పూండ్లవారిని మాత్రం చాటుపద్య సంకలనకర్తగా ఎవరూ స్మరించలేదు. 'ఆరింటికి తా' అను వ్యాసంలో తిట్టు కవిత్వాన్నిగూర్చి వ్రాస్తూ, అప్పకవి మొదలైనవారు ఉదాహరించిన తిట్టు పద్యాలన్నీ వెలికితీసి చూపించారు. ఈ వ్యాసాన్ని సాహిత్య ఎకాడమీవారు తమ వ్యాస సంపుటిలో ముద్రించుకున్నారు. ※

అముద్రిత గ్రంథ చింతామణి ఆదిలోనే వెంకటగిరి ప్రభువు రాజగోపాల కృష్ణయాచేంద్రుని ఆదరాన్ని సంపాదించుకుంది. వెంకటగిరి వారితో పాటు నూజివీడు, ముత్యాలంపాడు మొదలైన జమీందార్లు అముద్రిత గ్రంథచింతామణి పోషణ బాధ్యతను వహించారు. వీరితోపాటు రావుబహదూర్ పనప్పాకం అనంతాచార్యులు, బెజవాడ రామచంద్రారెడ్డి, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, సమర్తి రంగయ్యసెట్టి, అయ్యనకోట పార్థసారథిసెట్టి, నరహరి రాజామణిసెట్టి మొదలగు సాహితీపరులు, విద్యాధికులు పోషకులుగా ఉన్నారు. ఇంతమంది అండ ఉన్నా ఈ పత్రిక ఆర్థికస్థితి ఏనాడూ సుకరంగా ఉన్నట్లులేదు. ఈవిషయాన్నే రామకృష్ణయ్యగారిట్లా వ్రాశారు. "ఇది వృత్తాంత పత్రిక కానందున ఎల్లరకు సుబోధకముకాదు.



పూండ్ల రామకృష్ణయ్య

దీనిప్రాశస్త్యముగోరువారు సహజముగ పండితులే. బాకీపడినందుననే పండితులకు పత్రిక పంపకుండుట సరసము కాదుగద. ఒక్క భాషాభిమానియగు జమీన్‌దారు గారికి దీని స్థితిగతుల విన్నవించి యున్నారము." వెంకటగిరి జమీందారు రాజగోపాలకృష్ణ, ఆయన తమ్ముడు వెంకటకృష్ణయాచేంద్రుడు, జటప్రోలు జమీందారు, మొదలగువాళ్లు అముద్రిత గ్రంథచింతామణి అప్పులపాలై పోకుండా కాపాడారు. వీరిచ్చిన ఆర్థిక సహాయం వల్లనే రామకృష్ణయ్యగారికి ఆఖరిరోజులలో గొప్ప ఆత్మస్థైర్యం ఏర్పడినది.

వెంకటగిరివారికి రామకృష్ణయ్యపై గొప్ప అభిమానం ఉండేది. ఆయన "చరమస్థితిలో స్మృతి దప్పి యుండినటులరిని యపుడును శ్రీవారు కొంత ద్రవ్యము సహాయముచేసి శ్రీ వెంకటగిరి రాజావారు పంపినారని దిక్కులు పిక్కటిల్లునట్లు ముమూర్షువునకుగూడ శ్రవణగోచరమగునట్లు పెద్ద ధ్వనితో వారి చెవిలోఁజెప్పుమని యాజ్ఞచేసిరి". ఆంధ్ర కవిపండిత సంఘాన్ని రామకృష్ణయ్యగారు వేదంవారితోకలిసి ఎదుర్కొన్నప్పుడూ పరోక్షంగా ఈ రాజాగారే మాటకూ మంచికీ అండగా నిలచారు. ⁑

వేదం వేంకటరాయశాస్త్రి, వీరేశలింగం పంతులు, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, వెల్లాల సదాశివశాస్త్రి, వావిలికొలను సుబ్బారావు, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, వడ్డాది సుబ్బరాయుడు, నడకుదుటి వీరరాజు, కొక్కొండ వెంకటరత్నంపంతులు, గురజాడ రామమూర్తి, నాగపూడి కుప్పుస్వామయ్య మొదలగు అనాటి తెలుగు కవిపండిత సంఘమంతా అముద్రిత గ్రంథచింతామణిలో ఎప్పుడో ఒకప్పుడు రచన చేసినవారే. మండపాకవారినిగూర్చి చెప్పనేవనిలేదు. అముద్రిత గ్రంథచింతామణి పుటలలో పాతికభాగం ఆయన పద్యమాలికలకే కేటాయించారంటే అతిశయోక్తికాదు. పార్వతీశ్వరకవికీ పూండ్లవారికీ తటవర్గ బిందుపూర్వక యతివిషయంలో అభిప్రాయభేదం వచ్చి, ఆఖరకు వారి మిత్రత్వానికే భంగం కలిగేంతదూరం వరకూ వచ్చింది. వావిలికొలనువారు, ధర్మవరంవారూ అముద్రిత గ్రంథచింతామణివల్ల అధికంగా ప్రచారాన్ని పొందినవారే.

కొక్కొండవారి విశ్వేశ్వరీయాన్ని రామకృష్ణయ్యగారు ఎంతో సహృదయంతో సమీక్షించినా, ముందుగానే తమకు కలిగిన సందేహాలను పంతులుగారికి సముఖంలో వినిపించినా, ఏ సమాధానమూ చెప్పక పరుషంగా సంజీవనిలో సమాధానం చెప్పడంతో అది పెద్ద యుద్ధంగా

※ తిట్టుకవిత్వంపై పుస్తకం వ్రాసి అకాడెమి బహుమతి పొందిన శ్రీ రావూరి దొరస్వామిశర్మగారివ్యాసాన్ని చూచినట్లులేదు. చూచి ఉంటే పూండ్లవారు సేకరించి, ఉదాహరించిన "ఊరునాకు క్రొత్త, ఊరికినేఁగ్రొత్త! మాఁతొత్త నీ విమానమెత్త" అన్న పద్యశకలాన్ని విడిచిపెట్టి ఉండేవారుకాదు.

⁑ కవిపండిత సంఘ చరిత్ర తత్త్వము అన్న పుస్తకాన్ని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, కోపూరు సుబ్బరామయ్య, గుండ్లపూడి సుబ్బయ్య, సి. దొరసామయ్య కలిసి 1899 లో ప్రకటించారు. ఆంధ్ర కవిపండిత సంఘ ప్రతారణము అన్న పుస్తకాన్ని 1899 లోనే మంగు వెంకటరామానుజరావు ప్రచురించారు. ఈ రెండుపుస్తకాలు పూండ్లవారి వర్గాన్ని సమర్థిస్తూ వ్రాసినవి. వీటి ప్రచురణకు ఆర్థికసహాయం వెంకటగిరి వారు చేసినట్లుంది. ఇప్పటికీ ఈ పుస్తకాలు వందలసంఖ్యలో వెంకటగిరి వారి సరస్వతీనిలయ గ్రంథాలయంలో మూలుగుతున్నాయి.

మారింది. ఇరువైపులా వాదాలు, ప్రతివాదాలు, దూషణలు జరిగాయి. కట్టమంచి వారన్నట్టు, ఆ విషయాలన్నీ మనసుకు తెచ్చుకోవడంకూడా తగనన్నంతదూరం పోయాయి. వావిలికొలను సుబ్బారావు, ఆర్. వెంకటసుబ్బయ్య, ధర్మవరం మొదలగువారు లోపల్లోపలే పూండ్లవారిని ఈ వివాదంలో ప్రోత్సాహపరిచారు. పైకిమాత్రం తటస్థంగా ఉన్నట్టు నటించారు. అయితే కథ అడ్డం తిరిగింది. కోలాచలంవారి నాటకాలన్నీ అముద్రిత గ్రంథచింతామణిలో తీవ్రంగా విమర్శింపబడ్డాయి. వావిలికొలనువారి కుమారాభ్యుదయాన్ని విమర్శిస్తూ రొద్దం హనుమంతరావు వ్రాసిన విమర్శ గ్రంథాన్ని రామకృష్ణయ్యగారు ప్రకటించారు. ఆర్. వెంకటసుబ్బయ్యగారు పరిష్కరించిన కాళహస్తి మాహాత్మ్య పరిష్కరణపై వేదంవారు రచించిన విమర్శ గ్రంథాన్ని ఆయన ప్రకటించారు. ఇట్లా ఆనాటి సమకాలిక పండితులు, కవులు వేదం వారితోపాటు, రామకృష్ణయ్యగారికి బద్ధశత్రువులయ్యారు.

వేదంవారు నాగానంద నాటకంలోనూ, ప్రతాపరుద్రీయ నాటకంలోనూ పాత్రోచితభాషను ప్రవేశపెట్టారు. కొక్కొండవారు, ధర్మవరంవారు, వావిలికొలనువారు, కోలాచలంవారు, ఆర్. వెంకటసుబ్బయ్యగారు అంతా ఏకమై పాత్రోచితభాష పనికిరాదన్న ఒక ఉద్యమం ఆరంభించారు. 1897లో బళ్ళారిలో ధర్మవరంవారి సారథ్యంలో తొలిఆంధ్ర కవి పండిత సంఘసమావేశం జరిగింది. ఈసభకు 32మంది ప్రతినిధులు హాజరైతే అందులో వేదం వేంకటరాయశాస్త్రి, పూండ్ల రామకృష్ణయ్య, నేలటూరు పార్థసారథయ్యంగారు, కోవూరు సుబ్బరామయ్య, అయ్యనకోట పార్థసారథిసెట్టి మొదలగువారు నెల్లూరువారు. ఈ సమావేశంలో అసలు రంగు బయట పడకపోయినా, కృతివిమర్శనోపసంఘాన్ని ఈ పండిత సంఘం ఏర్పాటు చెయ్యాలనే ఆలోచన మద్రాసులో రెండోపండిత సభ జరిపేలోపలే, అప్పుడప్పుడూ సెలవేస్తూ వచ్చింది. కృతివిమర్శనోపసంఘాన్ని ఏర్పాటుచేసి, ఆ సంఘంచేత కృతివిమర్శ చేయించాలని, తద్వారా వేదంవారి, రామకృష్ణయ్య విమర్శలకు అడ్డుకట్ట వెయ్యాలని ధర్మవరంవారు ఆలోచన చేశారు.

1888-89లో రెండవ మహాసభ మద్రాసులో జరిగింది. ఆనాటి పండితుల నిజరూపాన్ని పూండ్లవారు 'అముద్రిత గ్రంథ చింతామణి పత్రికాధిపతికి వ్రాయబడిన విద్యావిషయికమైన జాబులు' అనే చిన్న పుస్తకాన్ని అచ్చువేసి బయట పెట్టారు. వావిలికొలను సుబ్బారావు, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, ఆర్. వెంకటసుబ్బయ్య మొదలగువారు కొక్కొండవారిని పరిహసిస్తూ, తమకు అంతరంగికంగా వ్రాసిన 35 జాబులను అందులో ప్రకటించారు. ఈ చిన్న పుస్తకం పండితులలోని నైచ్యాన్ని, రెండునాల్కల ధోరణిని చక్కగా బయట పెట్టింది. అంతటితో పూండ్లవారి విరోధులు నిరుత్తరులై పోయారు. మళ్ళీ నెల్లూరులో జరపాలనుకున్న మూడవ కవిపండితసభ జరగకుండానే నశించిపోయింది.

అముద్రిత గ్రంథచింతామణి జీవితంలో 1890-1900 మధ్యకాలం అత్యున్నతదశగా అనుకోవచ్చు. 1900 నాటికి పత్రికకు మిత్రులకంటె శత్రువులే అధికమయ్యారు. దానికితోడు ఆర్థిక దుస్థితి. పత్రిక ప్రచురణ 1899 నాటికే కుంటుపడసాగింది. రామకృష్ణయ్యగారి మాటలలోనే ఆనాటి పరిస్థితిని తెలుసుకోవచ్చు. "ఈ నడుమ మేము భాషావిషయమై విశేషముగ శ్రమపడుచునే యున్నారము. భాషను గాపాడవలయునని మా యుద్దేశముగాని దాని నాశనము గావింపవలెనని మా యభిప్రాయము గాదు. ఇది మా పత్రికా మయూఖమువలన మీకు గోచరించియుండునుగదా! కొందఱొక్కటిగాజేరి భాషయందు మార్పులు చేయవలయునని ప్రయత్నింపగా నది మంచిపని గాదని ప్రకటించినగాని లోకము మేలుకొనదని ఎంచి, మేము సొంతపనులైనమాని, భాషారక్షక విషయమై కాలముంగడిపితిమిగాని, దానిని వ్యర్థపరుపలేదు. మేము భాషాదేవతకై పడిన ప్రయాసము సూర్యాలోకమను పత్రికయందు మీరు చూచియుండవచ్చును * భాషాసంజీవనివలె నీ పత్రికయు పండ్రెండేడులు నెగడి, స్వకీయ ద్వాదశాబ్ద మధ్యమున గొంతకాలము విరామము గొనినను శాణఘృష్టరత్నమువలె లలివెలయగల-



"వేదాద్రిశిఖరాన వెలిగిన్న జ్యోతి"-
నెల్లూరు తాలూకాలోని వేదగిరి నరసింహస్వామి కొండమీదనుండి సూర్యోదయదృశ్యం
-ఫోటో: పి. బి. ఎస్. రెడ్డి

* అముద్రిత గ్రంథచింతామణి ఆర్థిక దుస్థితివల్ల 1899 ఆగస్టు మొదలు 1900 మార్చిదాకా వెలువడలేదు. ఈ కాలంలో మద్రాసునుండి ప్రకటింపబడే సూర్యాలోకమనే వారపత్రికలో రామకృష్ణయ్యగారు వ్రాస్తూవచ్చారు. ఈ వారపత్రిక వేదంవారికి సంబంధించినది.

దని నమ్ముచున్నాము". "-యదృష్టమ్-తన్నష్టమ్- దీనందరెరింగియే యుందురు. పుట్టుటగిట్టుటకొరకు వసుధాగ్రముతో నశించునట్టి వర్ధనములగు పత్రికల విషయమడుగనేల. తన్నాశనమునకు మార్గము లనేకములు. అట్టివానిలో నీ పత్రిక కిప్పుడు వ్యాధిబాధ యొక్కటియయ్యె. అప్పటికి తిరుగుడువడు నవుశేరైనఁ జేటాది యాతనియందో నడుగఁజుటకు సందియమెందుకు? ఈ పత్రికావరి గ్రహీతలలో పెక్కురు విద్యావంతులేకాని ధనవంతులుగారు. వచ్చుబడి చాలక యిది ఋణగ్రస్తమైనది. ఇదియు యిది పుట్టినదొట్టి యార్జించిన యార్జనం. అర్థబలమే యంగబలము; మొదటిది తగ్గినచో నిదే రెండవది తగ్గునని వేరుగ నుగ్గడింపవలయునా? ఉత్తమర్ణులైన నీ యథమర్ణతను తొలగించి దీని ముప్పు దప్పించుకొనగాత."

నెల్లూరులో వేదంవారికి రామకృష్ణయ్య వంటి అనుచరలున్నట్టే వ్యతిరేకులూ ఒక కూటమిగా ఏర్పడి ఉన్నారు. 1899లో వెంకటగిరిరాజా ఉన్నత పాఠశాల పండితుడు కొమండూరు రామానుజశర్మ సంపాదకత్వాన 'వాగ్వల్లి' అనే మాస పత్రిక నెల్లూరులో ఏర్పడింది. ఈ పత్రిక 1901లోనే నశించిపోయింది. ఆ కొద్దికాలంలోనే వేంకటరాయ శాస్త్రి వ్యతిరేకుల కూటంలోచేరి అముద్రిత గ్రంథ చింతామణిపై విరుచుకు పడింది. పూండ్ల వారిని వెటకారాలుగా పరిహసించింది. పూండ్లవారు ఆ చివరి రోజుల్లో ఎదుర్కొన్న చిక్కులను, దుస్థితిని వాగ్వల్లి ఇట్లా వ్యంగ్యంగా ఎత్తిపొడిచింది. "మా పత్రిక మాకు జీవనాధారముకాదు. ముద్రాక్షరశాలాధిపతులకు మేమప్పుపడి మొగముదప్పించి తిరుగుచుండుట లేదు. మా పత్రిక ఋణగ్రస్తులు కాదు".

వెంకటగిరివారి సహాయంవల్ల అముద్రిత గ్రంథ చింతామణి ఆగిపోకుండావచ్చింది. ఐనా కుటుంబ సమస్యలు, పేదరికం ఆయన్ను ఎంతగానో కుంగదీశాయి. ఆరోగ్యం నాశనమయింది. 1902మార్చిలో వేదంవారికి ఒక జాబులో తన అప్పటి పరిస్థితిని ఎంత దయనీయంగా వ్రాసుకున్నారో చూడండి. "నేను రోగినైతిని. దూరము నడువలేను. ఎండ సోకగూడదు. ఎట్లు జీవించగలనో దిగులుగానున్నది. రాజైశ్వర్యములు వలసియున్నవి. అర్జనసున్న, కడుపుపాటు చిక్కుటలేదు. చిత్తచాంచల్యము మెండుగానున్నది. ఇందుచేఁ బక్షవాయువు వచ్చునట్లు తోచుచున్నది. ఏది వచ్చినను ననుభవింపక తీరదుకదా!"

రామకృష్ణయ్యగారికి ఆనాటి పండితులందరితో సత్సంబంధాలుండేవి. ఉత్తర ప్రత్యుత్తరాలుండేవి. 1897లో విక్టోరియారాణి అరవదేళ్ళ పాలన పూర్తి అయిన సందర్భంలో రాజమండ్రిలో సభజరిగింది. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు ఆ సభలో చదివిన ప్రశంసాపద్యాలు చింతామణిలో అచ్చుపడ్డాయి. "నా పద్యములు చూచినతోడనే నాంధ్రదేశమున నానాభాగములనుండి బహూకరణ లేఖలు నాకు వచ్చినవి. 'అముద్రిత గ్రంథ చింతామణి' పత్రికాధిపతులగు పంతులుగారు నన్నును, నా కవిత్వమును మెచ్చుకొనుచు నెల్లూరునుండి యొకలేఖ వ్రాసిరి." అని చిలకమర్తివారు తమ జీవిత చరిత్రలో ప్రత్యేకంగా వ్రాసుకొన్నారు. ఇట్లా హార్దికమైన స్నేహసంబంధాలు కలిగిన వ్యక్తులెందరెందరో ఉండేవారు. రాజా మంత్రి ప్రగడ భుజంగరావు గారికి రామకృష్ణయ్యగారిపై మంచి అభిమానం. ఆయన నెల్లూరు వచ్చినప్పుడు ఒక సన్మానసభ ఏర్పాటు చేసి రామకృష్ణయ్యగారిని సన్మానించారు.

హరిశ్చంద్ర నలోపాఖ్యానాన్ని పరిష్కరించి ప్రకటిస్తూ, భట్టుమూర్తి, రామరాజ భూషణుడు వేరువేరనే వాదాన్ని రామకృష్ణయ్యగారు ప్రతిపాదించారు. ఆ సందర్భంలో వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రను తీవ్రంగా విమర్శించారు. తర్వాత కాలంలో తాము తొందరపాటున అంత పరుషంగా వ్రాశామనీ, మన్నించవలసిందనీ పత్రికాముఖంగానే ప్రకటించుకున్నారు. పూండ్లవారు కోరగానే వీరేశలింగపంతులుగారు రెండవ పర్యాయం 80పై చిలుకు గ్రంథాలను పంపి గౌరవించారు. వీరేశలింగంపంతులుగారు ఎంత పేరు ప్రఖ్యాతి వహించిన వారైనా అవసరమైనపుడు ఆయనను విమర్శించడంలో పూండ్లవారు ఏమాత్రం వెనుదీయలేదు. రామకృష్ణయ్యగారు ప్రకటించిన గణపవరపు వేంకటకవికృత ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసాన్ని చింతామణిలో వీరేశలింగం పంతులుగారు సమీక్షించారు. ఆ విమర్శలో బంధగర్భ కవిత్వ గ్రంథాలు గ్రంథకర్త అతికష్టపడి వ్రాశాడని సంతోషించడమే తప్ప, వేరేవిధంగా ఉపయుక్తం కావని పేర్కొన్నారు. చిత్రబంధకవిత్వం చూచి సంతోషించేకాలం పోతూందనికూడా ఆయన వ్రాశారు. 'ఒజ్జల పుచ్చకాయ' అన్న శీర్షికతో రామకృష్ణయ్యగారు ఈ మాటలను పరిహసించారు. పంతులుగారి రసికజనమనోభిరామము, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధాల్లో ఉన్న చిత్రబంధ కవిత్వాన్ని చూపి, ఇది ఒజ్జల పుచ్చకాయ సామెతగా ఉందన్నారు. వీరేశలింగం పంతులుగారి జీవితచరిత్రను, ఛాయాచిత్రంతోకూడా పత్రికలో ప్రకటించడమేకాకుండా, ఆయన కవులచరిత్రను అత్యంత ప్రామాణిక గ్రంథంగా పేర్కొని స్తుతించారు.

వేదంవారికి పూండ్లవారికి స్నేహం ఏ సందర్భంలో కలిసిందో తెలియదు. వేదంవారిపైన పూండ్లవారికి మంచిగురి ఉండేది. అముద్రిత గ్రంథ చింతామణి అన్ని విషయాల్లోనూ వేదంవారికొమ్ము కాసింది కొంతవరకూ ఈ కారణంచేతే ఆనాటి పండితుల ఆగ్రహానికి పత్రిక గురికావలసివచ్చింది. "అముద్రిత గ్రంథ చింతామణి పత్రికాధిపతులయిన పూండ్ల రామకృష్ణయ్యగారున్న వేదం వేంకటరాయశాస్త్రులవారున్ను జట్టుగా ఉన్నట్లు తోస్తుంది" అని గిడుగు రామమూర్తిపంతులుగారు వ్రాసింది ఈ సందర్భంలో గుర్తుచేసుకోవచ్చు. వేదంవారి జీవితంలో పూండ్ల రామకృష్ణయ్యతో పరిచయం ఒక గొప్ప సంఘటన ఐనట్లు వేదం వారి జీవిత సంగ్రహంలో ఆయన మనుమలు శ్రీ వేంకటరాయశాస్త్రి పేర్కొన్నారు. "శ్రీశాస్త్రుల వారి జీవితమున అముద్రిత గ్రంథ చింతామణి పరిచయమొక గొప్పస్థానముగా నున్నది"- అని ఒంగోలు వెంకటరంగయ్యగారుభావించారు. వెంకటగిరి రాజాగారితో వేదంవారికంటె పూండ్ల రామకృష్ణయ్యగారికే ముందుగా పరిచయం. బహుశా పూండ్లవారే వేదంవారిని వెంకటగిరి సంస్థానం వారికి పరిచయం చేసిఉంటారు. వేదంవారి నాటకాలను ప్రత్యేకంగా ఆడడానికే రామకృష్ణయ్యగారు ఆంధ్రభాషాభిమాని సమాజాన్ని 1899, మార్చి, 30 తారీకున నెల్లూరులో స్థాపించారు. మద్రాసులో ఆంధ్ర భాషాభిమాని సమాజంవారు నాటక ప్రదర్శనలియ్యడానికి వెళ్ళినప్పుడు, అముద్రిత గ్రంథచింతామణి ప్రచురణనుసైతం కట్టిపెట్టి సమాజంతోపాటుగా ఆయన మద్రాసు వెళ్ళేవారు. వేంకటరాయశాస్త్రిగారు తమ రచనలో ఎక్కడా పూండ్లవారిని ప్రస్తావించినట్లు కనపడదు.

రామకృష్ణయ్యగారి విమర్శ సంప్రదాయరీతిలోనిది. సాధారణంగా శాబ్దిక విచారమే ఎక్కువగా ఉండేది. శకటరేఫ విచారము, పరమేశ్వర శబ్దవిచారము, శ్యమంతక శబ్దవిచారము, క్షకారము సంయుక్తాక్షరమా? వటుడు శబ్దము ప్రయోగార్హమా?

Phones: GUDUR: Office: 288, Factory: 268 Res: 275

# Rao Insulating Company (Pvt.) Limited

**Regd. Office:**
**WHITE FIELD P. O.**
**Bangalore Dt.**
**(Karnataka)**

**Mica works**
**GOGINENI PURAM**
**Gudur.**
**Nellore Dt. (A. P.)**

Fabricators & Suppliers of all Types of Electrical Insulating Materials and Components.

---



గ్రామ్సు : ఒం.    వివరములకు    ఫోన్ : 1032

## లతా ట్రాక్టరు వర్క్సు

జేమ్సు గార్డెన్ - నెల్లూరు.2

# హర్ష

## T. 25 A-I

రష్యా వారి సాంకేతిక సహకారంతో డి. టి. 14-బి నమూనాతో అన్నిరకముల వ్యవసాయపనులు చేసేందుకు వీలుగా తయారుచేయబడినది.

మరియూ హెల్వీడ్యూటి

## హిందుస్థాన్ ట్రాక్టర 50 H. P.

వ్యవసాయ రంగానికి వరప్రసాదం.

—ఆథరైజ్డు డీలర్లు—

**నవభారత్ అగ్రికల్చరల్ అండ్ కమర్షియల్ కార్పొరేషన్**

ప్రకాశం రోడ్ - విజయవాడ.2.

కళంకు శబ్దవిచారము, ఓష్ఠ్య నిరోష్ఠ్య విచారము, నాటకములందు గ్రామ్య భాష ఉపయోగింప తగునా? చాటుపద్యముల స్థితిగతులు, తిట్టు పద్యములు మొదలగు వ్యాసాలు రామకృష్ణయ్యగారి విమర్శ విధానాన్ని వివరిస్తున్నాయి. ఆనాడు ఉత్తమ రచనలుగా పేరుపొందిన కన్యాశుల్కము, ప్రతాపరుద్రీయము, ధర్మవరమువారి నాటకములు, కవులచరిత్ర, కవిజీవితములు, మున్నగు గ్రంథాలను ఆయన చక్కగా సమీక్షించారు. ◆

పూండ్ల రామకృష్ణయ్యగారు జీవితమంతా సాహిత్యసేవలో గడిపారు. స్వార్థం, మనాతనా ఇవేవీ ఆయనకు అడ్డంరాలేదు. ఎందరో మిత్రులకు, హితులకు ఈ కారణంగానే ఆయన దూరమయ్యారు. తట వర్గ బిందుయతి (అను స్వారసంబంధ యతి) విషయంలో పార్వతీశ్వరకవి చూపిన ప్రయోగాలను పూండ్లవారు ప్రామాణికమైనవిగా అంగీకరించలేదు. సుదీర్ఘమైన వాదం జరిగింది. ఈ విషయాన్నిగూర్చి రామకృష్ణయ్యగారు వ్రాస్తూ తన హృదయావేదనను ఇట్లా వ్యక్తం చేశారు.

“పార్వతీశ్వరకవిగారి వ్రాతను గని మేము చింతించుచున్నాము. ఇప్పటికినీ మాకు వారి కవనమునందత్యాదరముగలదు. మాపత్రికవలననే వారిపేరు లోకమంతయు వెల్లివిరిసియున్నది. వారి చరిత్రమంతయు గ్రంథరూపముగ వారిచేతనే వ్రాయించి ప్రకటించినారము. వారి మఱికొన్ని పుస్తకములను ప్రకటించియున్నారము. ప్రకటింతుము. ఇట్టిస్థితిలో వారియందుగల యనురాగము వీడునా? వారట్లు వ్రాయుటవలన మేమొకవిషయమును స్థిరీకరించుచున్నాము. మనవారిలోనుండు పండితులనుగాని, కవులనుగాని యేయాక్షేపణ చేయక స్తుతించునంతవఱకు వారిలోతును గుణమును దెలియదు. అది తప్పినచో నన్నియు బట్టబయలవును. దీనొకరిద్దరి విషయమున, బరీక్షించియున్నారము. లక్షణములను, లక్ష్యానుసారములగు ప్రయోగములను జూపుచు నాక్షేపించినను శ్రీ శాస్త్రులవారొక్క మా విషయమై యొక సీసమాలిక వ్రాసిరి. మాలికలు వ్రాయుటకేమి, అవని వారికవలీలమై యున్నది.

రామకృష్ణయ్యగారు 1904 సెప్టెంబరు 1 తేదిన నెల్లూరులో మరణించారు. అంతకుముందే అముద్రిత గ్రంథచింతామణి జూలైనెల సంచికనుకూడా వెలువరించారు. 1900 మార్చి సంచికలో ఆయన ఇట్లా వ్రాశారు. “మాకితర వ్యాయామములులేవు. విద్యావిషయిక వ్యాయామమునందే మా జన్మ కడతేరవలయునని శ్రీ శ్రీధరు నెల్లప్పుడు ప్రార్థించుచుందుము.”

నిజమే! పూండ్లవారి కోరిక ఫలించింది. ఆయన జీవితం సాహిత్యసేవకూ, పత్రికానిర్వహణకూ పూర్తిగా అంకితమైంది. ఆయన మరణంతో నెల్లూరు పత్రికోద్యమంలో ఏర్పడ్డ శూన్యం మళ్ళీ ఎన్నో ఏళ్ళకుకూడా పూరింపబడలేదంటే అతిశయోక్తిలేదు.



◆ అముద్రిత గ్రంథచింతామణిలో ఎందరో మహానుభావులు ఎన్నో గొప్ప వ్యాసాలు వ్రాశారు. వాటివిషయం ఇక్కడ ప్రస్తావించలేదు.

## 'వర్తమానతరంగిణి'లో తొలి నెల్లూరుజిల్లా లేఖ

# ..ఒక స్వర్ణయుగం?

తొలి తెలుగుపత్రిక పుట్టిన పాతికేళ్ళకుగాని నెల్లూరులో వార్తాపత్రికంటూ తలయెత్తలేదు. 'గత శతాబ్దపు టరువదియవ దశకాంతమున' దంపూరి నరసయ్య, నంబెరుమాళయ్య అనే ఇద్దరు కలెక్టరాఫీసు ఉద్యోగులు 'నెల్లూరు పయొనీర్' (Nellore Pioneer) అనే ఆంగ్ల పత్రికను ప్రారంభించినట్లు ఒంగోలు వెంకటరంగయ్యగారు రాశారు. * అంటే, 'నెల్లూరు పయొనీర్' జననం 1869 లో అయివుండవచ్చు. దంపూరి నరసయ్య కలెక్టరాఫీసులో ట్రాన్స్‌లేటర్‌గాను, నంబెరుమాళయ్య సబ్‌మేజిస్ట్రేట్‌గాను ఉండేవారు. ప్రభుత్వోద్యోగ బాధ్యతలలో వుండికూడా వారు ఆ పత్రికనెట్లా నిర్వహిస్తుండేవారో, ఆనాటి నెల్లూరు స్థితిగతులు, సుఖదుఃఖాలు, సమస్యలు, జనజీవితం వగైరాలు ఆ పత్రికలో ఎట్లా ప్రతిఫలిస్తుండేవో తెలుసుకునే అవకాశం మనకిప్పుడు లేదు. దురదృష్టమనండి, దౌర్భాగ్యమనండి– 'నెల్లూరు పయొనీర్' కడకు ఒక్కప్రతి అయినా లభ్యం కాకుండా, కీపి గురుతునైనా మిగల్చకుండా చరిత్ర గర్భంలో కరిగిపోయింది.

అయితే అప్పట్లో ఆతొలి ప్రయత్నానికి తగినంత ఆదరణ, పోషణ లభించలేదని మాత్రం చెప్పవచ్చు. అందువల్లనే కాబోలు, ఒక్క సంవత్సరం గడిచేలోగానే ఆ పత్రిక అంతరించిపోయింది.

పత్రికారంగంలో నెల్లూరు పాతికేళ్ళు వెనుకబడిందే అయినా, వార్తాపత్రికా ప్రాముఖ్యాన్ని గానీ, వార్తాప్రచురణ ప్రాధాన్యాన్నిగానీ గుర్తించడంలో ఎవరికీ తీసిపోలేదని మాత్రం చెప్పుకోవచ్చు. అందుకు ప్రబలనిదర్శనం 1842 నాటి 'వర్తమాన తరంగిణి'లో ప్రచురించబడిన నెల్లూరుకు సంబంధించిన సుదీర్ఘమైన సమాచార లేఖను ఉదహరించవచ్చు.

మొదటి తెలుగు పత్రిక యేదైనప్పటికీ, మన కిప్పుడు లభ్యమవుతున్న తొలి పత్రిక 'వర్తమాన తరంగిణి'. 1842 జూన్ 8 తేది సయ్యద్ రహంతుల్లా సాహెబ్ మద్రాసులో ప్రారంభించిన ఈ వారపత్రికకు ఏడవ సంచిక నుంచి పువ్వాడ వెంకటరావు ఎడిటర్‌గా వ్యవహరించేవారు.

4 తేది నాటి 'ఎథీనియం'లో ప్రచురింపచేశామని మాదిరాజు రామయ్య తెలియజేశాడు.

ఈ జాబు టి. వి. స్టోన్‌హౌస్ పరిపాలనాదక్షతను, జనరంజకతను తెలియజేస్తుంది. స్టోన్‌హౌసు దొర 1835 ఏప్రిల్ నుండి 1844 ఏప్రిల్ దాకా నెల్లూరు జిల్లా కలెక్టరుగా వున్నాడు. జిల్లా రెవిన్యూ పరిపాలనకు సంబంధించి స్టోన్‌హౌసు దొర అనేక సంస్కరణలు చేశాడు; అటు ప్రభుత్వా

**★★ శ్రీ పి. గోపాలకృష్ణ ★★**

'వర్తమాన తరంగిణి'ని అనాటి సమగ్ర సుందరమైన వార్తాపత్రికగా పేర్కొనవచ్చు. అందులో ఆనాటి సాంఘిక దురాచారాల పై విమర్శ, బ్రిటిష పాలకుల దురాగతాలు, క్రైస్తవ మిషనరీల మతప్రచార కార్యక్రమాలలో జరుగుతుండే అన్యాయాలు అక్రమాలు, విద్యాసంస్థలకు సంబంధించిన అనేకానేక విషయాలు, సాహిత్య విషయాలు, గజెట్ వార్తానువాదాలు, యుద్ధ వార్తలు వగైరా విశేషాలెన్నో వుండేవి.

'వర్తమానతరంగిణి' తొలి సంపుటాలను భావి తరాల వారికోసం పదిలపరచి పెట్టినవాడు సి. పి. బ్రౌన్. ఆయన పుణ్యమాఅని అవియిప్పుడు మనకొక అమూల్య సంపదగా, చారిత్రక ఖనిగా లభ్యమవుతున్నాయి. అందులోంచి సేకరించిందే ఈ నెల్లూరుజిల్లా లేఖ.

మాదిరాజు రామయ్య అనే పాఠకుడు రాసిన ఈ జాబు 1842 అక్టోబరు 20 తేది సంచికలో 'ఉత్తరములు' అనే శీర్షిక క్రింద అచ్చుఅయింది. దీన్నే ఇంగ్లీషులోకి తర్జుమా చేయించి, అక్టోబరు

నికి లాభదాయకంగానూ, రైతాంగానికి శ్రేయోదాయకంగానూపాలనసాగించారు. కుంఫిణీదొరతనం మీద తిరుగుబాటు చెయ్యడానికి ప్రయత్నించి, అధికారులను ఉడకాడించిన ఉదయగిరి జాగీర్దారు సయ్యద్ అబ్బాస్ ఆలీఖాన్ ను అణగదొక్కేశాడు.

నెల్లూరును సమర్థవంతంగా పాలించిన జిల్లా కలెక్టర్లలో స్టోన్‌హవుస్ ఒకడు. ఆయన కలెక్టరుగానే కాక, అంతకు మునుపు అసిస్టెంటుగాను, హెడ్ అసిస్టెంటుగానూ, సబ్ కలెక్టరుగాను నెల్లూరులో పనిచేశాడు. ఆయన పరిపాలనాదక్షత పట్ల ప్రభుత్వానికి అపారమైన విశ్వాసంవుండేది. ఆ నాటి రెవిన్యూపాలనలో ఆయన చేసిన మార్పులనుగూర్చి బాస్వెల్ మాన్యువల్ వివరిస్తూ యిట్లా అంటుంది●—

"Government, in reviewing the Jammabandy Report for fusli 1243, expressed a hope that the new Collector (T. V. Stonehouse) would at once make use of his

* 'సుబోధిని' వారపత్రిక : 1933 ఏప్రిల్ 20 తేది సంచిక : 'నెల్లూరు పత్రికల చరిత్ర' వ్యాసం.

● Nellore Manual: JAC Boswell: Chapter XVIII; Page 519.

great experience of Nellore and his well known abilities in recommending(......) revision of the revenue system in force"

అంతటి పాలనాదక్షుణ్ణి గూర్చి 'వర్తమాన తరంగిణి'లో ప్రచురింపబడిన జాబు చదవండి–

"మహారాజశ్రీ వర్తమాన తరంగిణి యడిటరు గారికి– అయ్యా – యీ అడుగున వ్రాయబడినటువంటిసంగతులను యింగిలీషు భాషలో తర్జుమా చేయించి యీనెల తే4ది మంగళ్వారం రోజున అథీనియం అనే న్యూసు పేపరులో బహిరంగపరచబడి యున్నది. అయినప్పటికి యీముఖ్యమయిన సమాచారము వర్తమాన తరంగిణి అనే పత్రికలోకూడా వేయించవలెనని అభిలాష కలిగి మీ ప్యాక వుత్తరం వ్రాయడమయినది. గనుక యీ సంగతి పబ్లిషు చేయించవలెనని కోరుతున్నాము.

మహారాజశ్రీ టి. వి. స్టోనుహావుసు యస్క్వయరుగారు నెల్లూరు జిల్లా ప్రిన్సిపాల్ కలక్టరుగా ప్రవేశించినది మొదలు కొని వారు జరిగిస్తూవుండే న్యాయములవల్ల కాలవర్షములు చక్కగా కురుస్తూ మెట్ట మాగాణి ములుము జరీబు వగైరా భూములు పూర్తిగా సాగుబడి అయి బాగా ఫలిస్తూ కాలం సుభిక్షముగానున్ను ప్రజలకు అతి సౌఖ్యముగానున్ను వుంటున్నదే కాని ఏ విధమైన తొందరలున్నూ సంభవించడము లేదు. ఈ స్టోనుహావుస్‌దొరవారు గవనరు మెంటుకు అనేక విధముల కిఫాయతు చెయ్యడమే కాకుండా వుదయగిరి తాలూకా జమీదారు సయ్యదు అబ్బాసు అలీఖాను వగరాజులలో కల్పుకొని హానరబిల్ కంపెనీ వారి విషయంలో ద్రోహ తలంపు తలచి అందున గురించి ప్రయత్నములు చేస్తూ వున్నందున సదరు దొరవారు బహదూరము కృషిచేసి యావచ్ఛక్తినీ వినియోగపరచి యిందున గురించిన సంగతులు కూలంకషంగానున్నూ నిష్పక్షపాతంగానున్ను విచారణ చేయించినంతలో అతను ఆ ప్రకారం జరిగిస్తూవున్నది వాస్తవముగా రుజువులోకి వచ్చినందున ఆ కైఫియత్తు యావత్తూ గౌనరుమెంటుకు తెలియచేసి ఆ జమీందారు తాలూకు తాలూకా కాయం జప్తి చేయించి అతణ్ణి చంగల్పట్టులో ఖైదులో వుంచడముకు పంపించబడినందున అక్కడ ప్రవేశించిన కొద్దికాలంలోనే కాలం చేసినాడు. ఈ స్టోనుహావుస్‌దొరగారు యిటువంటి అసాధ్యమైన కార్యం సాధించడము వల్ల యీ విషయంలో చెన్నపట్టణము బొంబాయి కలకత్తా యీమూడు గౌనర్‌మెంటులలో నిండా కీర్తి వహించడమే కాకుండా హానరబుల్ కోర్టాఫ్ డిరకుటర్లు గారి యుచటనున్ను యీ దొరవారి పేరు నిండా నమోదులోకి వచ్చినది. కాబట్టి అయ్యా యిడిటరుగారూ యీయొక్క సువర్ణమయమయినటువంటి తాత్పర్యానికున్ను ప్రబలమైన శక్తికిన్ని యేమి చెప్పవలెను. యీ జిల్లాలోవుండే రయితులు వగైరాలకు భూములు దిట్టం యేర్పరచడమును గురించియేమి జమాబంది రయితువారి పైయిస్సలా చేయడమును గురించి యేమి సరకారుకు నష్టి లేకుండానున్ను రయితులకు అన్యాయము లేకుండా రిగులేషన్లను అనుసరించి న్యాయంగా జరిగిస్తూ వున్నందువల్లనున్ను యింకా రయితులకు వకరిలో వకరికి పుట్టుతూవుండే కల్తలు నిష్పక్షపాతంగా విచారణచేస్తున్న గ్రామాదులు అబాదులోకివచ్చి రయితులు సౌఖ్యపడేలాగున చేయిస్తూవున్నందున రైతులు వగైరాలు ఈ కలకటరుగారివల్ల అన్ని విధములా సౌఖ్యపడుతున్నామనిన్ని స్వామి దయవల్ల యీయనే శాశ్వతంగా యిక్కడనే వుండవలెననిన్ని కోరివున్నారు.

పోలియిసు నిబంధనలను గురించి పూర్వం యేర్పడియుండే రిగ్యులేషన్లలో ప్రిసపట్లు వగైరా నిర్ణయములుగాక యింకా అనేక విధముల ప్రజలకు క్షేమం కలిగేలాగునన్ను దుర్మార్గులు అందరు పట్టుబడేలాగునన్ను గిరావరీహుకుములు వగైరాల మూలముగా కట్టుదిట్టములు యేర్పరచినందున వర్తకులు భారీరయితులు మొదలైన వారికి ఖూనీలు బందిపోటులు కన్నపు దొంగతనములు దారిదోపిడి యిటువంటి వుపద్రవములు అన్నీ నివారణ అయి నెమ్మదిగా వుండి వున్నారు.



గోపాలకృష్ణ

యింతేకాకుండా యీ దొరవారు నవుకరీలు యిచ్చే విషయంలో ముఖ్యంగా మేను వారిలో పేదవాండ్లకు వారివారి స్థితిని కనిపెట్టిన్ని శక్తిని విచారించిన్ని వుద్యోగములు యిస్తూ వుంటారుగాని సిపార్సులు లేవనే హేతువుచాత రిక్తులకు పనులుకాక పోవడములేదు కాబట్టి అందువల్ల విస్తారం నుంచి వుమైదువార్లు యెల్లప్పుడు యీ న్యాయప్రభువును ఆశ్రయించి కచ్చేరిలో కనిపెట్టుకొని వుంటున్నారు.

సరకారునవుకర్లు తప్పితమ్ము చేసినట్లైతే విచారించి తగయిరి చెయ్యడములో ఆయా మొకద్దమాను గురించిన సాధక బాధకములు యావత్తూ కూలంకషముగా విచారించి రుజువు అయితేనే బరతరపు చేయడముగాని లేనిపక్షమందు ఆ ప్రకారము అమలు జరిగించడము లేదు. నెల్లూరులో అనేకమంది కండ్లు కాళ్ళు లేకుండానున్ను నిండా అశక్తముగానున్నూ పేదలుగానున్నూ వుండే వాండ్లయందు యీ స్టోనుహావుసు దొరగారు పుత్రవాత్సల్యం వుంచి తన స్వంతద్రవ్యములో నుంచి వ్యయపరుస్తు యిప్పటికి తనపేరు ప్రశిద్ధంగా జ్ఞాపకంవుండేలాగున సంరక్షణ చేయిస్తు వున్నారు గనుక "అయ్యా యిడిటరుగారు" యిది యెటువంటి సహాయమో యీ కార్యము చాయడమువల్ల

వారి హృదయం యెలాగంటి పశ్చాత్తాపం కలిగినది అయినదిన్ని యోచించుమా.

వర్తకులు రయితులు పేదవాండ్లు వగయిరాలు యేమి సర్కారు నవుకర్లు యేమి రివిన్యూ పోలయిసు హాయిరు కలాలు వగయిరా విషయములలో యేసంగతిలో యీ దొరవారి యెదట ఫిర్యాదు చేసినప్పటికి భాగ్యవంతులు దరిద్రులు అనే భేదము యెంతమాత్రములేకుండానున్ను సిఫార్సులు మొదలైనవి లేకుండానున్ను నిష్పక్షపాతముగానున్ను విచారణ చేసి తీర్పులు వ్రాయడమువల్ల యే విషయములోనున్ను యెవరున్ను అప్పీలు చేసుకోవలననే అపేక్ష లేనివారుగా వుంటున్నారు.

చెన్నపట్నంలో అనేకమంది పెద్దమనుష్యులు వకటిగాచేరి ధర్మ పల్లెకూటములు విద్యలు చెప్పిస్తూవున్నారు. సరేకాని అతిశయముకాదు. అయితే నెల్లూరులో మేస్టరు స్టోనుహావుసు దొరగారు వకరే స్వంతంగా పల్లెకూటములు యేర్పరచి యింగ్లీషు భాషమున్ను నేటివుల యొక్క సంస్కృతం - తర్కం-తెనుగు-పార్షీ యివి మొదలయిన విద్యలు చెప్పిస్తు నేటివులకు బహుసౌఖ్యంకలుగచేస్తున్నారు. కాబట్టి-'అయ్యా యిడీటరు గారూ' యిటువంటి ధర్మము యే కలకటరు చేయలేదని చెప్పడమునకు సందేహము లేదు.

ఈ దొరవారు నెల్లూరుకు ఈశాన్య భాగమందు నవాబుప్యాటకుపోయే మార్గంలో నూతనముగా తన స్వంతద్రవ్యం విస్తారం ఖర్చుచేసి పేటకట్టించి కోనేరు తొవ్వించి మేస్తరు స్టోనుహావుసుపేట అని పెట్టి ॥క॥ నెల్లూరు హాయరు సూపరింటెండ్యాంటు కచ్చేరి స్థాపింపచేయడమువల్ల అనేకమంది గృహములు మొదలయినవి లేకుండావుండే వారికి యేమి వర్తకులకుయేమి సవుఖ్యము కలిగి సుఖపడుతూ ఆయనపేరు తల్చుకుంటూ వున్నారుగనుక 'అయ్యా యిడీటరు గారూ' చూడండి వక ధర్మముకంటే వక ధర్మము అతిశయించివున్నది.

ఇటీవల నెల్లూరులో వాంతిభేది [illegible]వుపద్రవమువల్ల జనులకు అత్యంతమయిని తొందరలు సంభవించి సూత్రా పరియంతంలో జరగవలసిన పద్ధతులను గురించి యేమి అవుషధములు వగయిరాలనుగురించి యేమి యావత్తు సహాయము చేసినందున ఆ వుపద్రవము తప్పిపోయి యీ దొరగారిపేరు తల్చుకుంటూనెమ్మదిగా వున్నారు.

ఈ దొరగారికి తెనుగు హిందూస్తాని వగైరా భాషలు చక్కగా రావడంవల్లరయితులు మొదలయినవాండ్లు యే సంగతిన్ని తాము స్వతహాగా మాట్లాడుకోవడముకు వకరి సహాయము యెంతమాత్రము నిమిత్తము లేదు.

కాబట్టి యీపైన వ్రాయబడిన అన్ని హేతువులవలన అనేకమంది కలకటర్లు వగయిరాలు యోగ్యులు వున్నప్పటికిన్ని యిన్ని విధముల యోగ్యత యీ స్టోనుహావుసు దొరకేగాని మరివకరికి వుండనేరదని చెప్పడముకు సందేహములేదు. గనక యీ సంగతి అనేకమందికి తెలిసి సంతోషించడముకు వ్రాయడమయినది.

గనక యీ ప్రభునయిన టీ. వి. స్టోన్ హావుసు యెస్క్వయరుగారు భగవంతుడి అనుగ్రహమువలన వారి పిల్లలు వారు యెల్లప్పటికి సంతోషముగా అభివృద్ధిగా వుండవలెననిన్ని యీ దొరగారి యొక్క దవులతు దినదినానికి అతిశయిస్తూ అనేకమంది పేదలకు సౌఖ్యం కలుగుతూ వుండవలెనని కోరుతున్నాను.

ఇంకా ఈ దొరవారి భూతదయ పశ్చాత్తాప సుగుణములు గురించిన్ని స్వతంత్ర శక్తిని గురించిన్ని న్యాయమును గురించిన్ని వ్రాయడమునకు శక్తిలేదని వ్యసనంగా వున్నది.

చిత్తగించవలెను

| | |
|---|---|
| చెన్నపట్నం | తమయొక్క వినయ |
| 1842 సం॥ | విధేయుడైన |
| అక్టోబరు 8 తేది | మాదిరాజు రామయ్య |

కలెక్టరు స్టోన్‌హావుస్ పరిపాలనలోని విశిష్టతలన్నీ ఈ జాబులో స్థూలంగా చర్చించబడ్డాయి. రైతులకు ఆయన చేసిన ఉపకారాలు, పౌరులకు కల్గించిన శాంతిభద్రతలు, న్యాయవిచారణలో సమదృష్టి, ఉద్యోగులపట్ల ఆదరణ, పేదసాదల పట్ల సానుభూతి, అంధులు అనాథుల యెడల



“పెన్నదాటితే పెరుమాళ్ళసేవ”

పెన్నా-తీరాన రంగడి గుడి గోపురం. ఈ గోపురాన్ని 1845–59 లలో యరగుడిపాటి వెంకటాచలంపంతులు నిర్మించారు. —ఫోటో: పి. బి. ఎస్. రెడ్డి.

అపారమైన దయ, కలరావంటి భయంకర వ్యాధి నుండి ప్రాణాలను కాపాడడం, సంస్కృతం, అరబ్బీ, తెలుగు, పార్సీ భాషలు నేర్పే పాఠశాలలు స్థాపించడం—ఇట్లా అన్నిటినీ పట్టి తయారుచేశాడీ శిలాఫలకం.

స్టోన్‌హౌస్ దొర పేరును నెల్లూరు చరిత్రలో చిరస్థాయిగా నిలిపేది 'స్టోన్‌హౌస్‌పేట' దాన్ని నిర్మించినవాడు స్టోన్‌హౌస్ దొర. ఆ పేటను వాసయోగ్యం చేసేందుకు పెద్ద పెద్ద వీధులు, వీధి కూడళ్ళలో తానాలు, నీటివసతికోసం పేట మధ్యన ఒక పెద్ద కోనేరు నిర్మించాడు. ఆ కోనేరుపేరు 'రంగపుష్కరిణి.' అప్పట్లో హెడ్ శిరస్తాదారుగావుండిన మధ్వపతి పురుషోత్తమరావు ప్రేరణ ప్రోత్సాహాలతో స్టోన్‌హౌస్ దొర ఆ కోనేటిని త్రవ్వించారు.

ఆ కోనేరు త్రవ్వించేనాటికి సర్వేపల్లి కాల్వ లేదు. ఉయ్యాలకాల్వ ద్వారా కోనేటికి నీరువచ్చే యేర్పాటు వుండేది. కోనేటిలో ఎక్కువగా వున్న నీళ్ళను బయటికి వదలడానికొక తూము వుండేది; కోనేటిగర్భంలో మంచి బొంతరాతితో కట్టిన పెద్ద బావి ఒకటుండేది. కోనేటికి పడమటితట్టు, ఐదు అడుగుల ఎత్తున ఒక పెద్ద రాతి దిమ్మె; దానిపైన తొమ్మిదడుగుల ఎత్తుగల రాతిస్తంభం వుండేది. ఆ స్తంభంమీద ఒక రాగిశాసనం వుండేది. అందులో కోనేటి పుట్టుపూర్వోత్తరాలన్నీ సీసమాలిక రూపంలో, అందమైన అక్షరాలతో చెక్కబడి వుండింది.

ఆ కోనేరు బాగుండిన రోజుల్లో అక్కడ రంగనాయకస్వామి తెప్పోత్సవం జరుగుతుండేదట. సర్వేపల్లికాల్వ యేర్పడ్డతర్వాత కోనేటికి క్షీణదశ కలిగినట్లుంది. ఆ కాల్వ దాలాలోతులో వుంది. దాంట్లోనుంచి కోనేటికి నీళ్ళు యెక్కేవికావు. అట్లా కొంతకాలానికి అందులో చుక్కనీళ్ళయినా లేకుండా పోయాయి; కడకది ఒక పాయిఖానాగా మారిపోయింది. కోనేటి మధ్యవున్న బావిలో ఒక పిల్లవాడు పడిచనిపోయాడట.

ఒకప్పుడెంతో వైభవంగా వుండిన కోనేరు రానురానూ అసహ్యంగా తయారైంది. చివరికి బిస్సా లక్ష్మీనరసింహం పంతులుగారు ఆ కోనేటిని శాశ్వతంగా పూడ్పించేసి, దాన్నొక పార్కుగా తయారుచేశారు; 'గాంధీపార్కు' అని నామకరణం చేశారు.

కోనేటి శాసనం వుండిన స్తంభంకూడా నేల కూలింది. ఐనా శాసనం మాత్రం చాలాకాలం ఆ స్తంభాన్నే అంటిపెట్టుకొని వుండింది. 1926 ప్రాంతంలో కాబోలు, ఎవరో పుణ్యాత్ముడు దాన్ని గూర్చి మద్రాసు ఎపిగ్రాఫి శాఖకు తెలియజేస్తే, వారు నెల్లూరువచ్చి ఆ శాసనాన్ని ఫోటో తీసుకొని వెళ్ళారు. ఐతే అది ప్రాచీన శాసనం కాదు గనుక, ప్రభుత్వంవారు దాన్నిగూర్చి పట్టించుకోలేదట. తర్వాత కొంతకాలానికి ఆ శాసనం స్తంభం నుంచి ఊడిపడి పోయింది. కడకది దిక్కులేనిదై, నడివీధిపాలై, ఏ కాల్వలో కొట్టుకపోయిందో, ఏమైపోయిందో తెలియదు కానీ, ఒంగోలు వెంకట రంగయ్యగారు 1944 నాటి 'జమీన్‌రైతు'లో శాసనపాఠాన్నిమాత్రం యథాతథంగా యిచ్చారు. □ చూడండి-

శ్రీ రంగనాథోజయతు.
శ్రీమత్సమస్త సద్గుణసమన్వితమైన
నెల్లూరు రాజధాని గల
జిల్లాకు మేస్తరు శ్రీ ⸬ టిమొతివాన్‌సిలార్ట్
స్టోన్‌హౌసనెడి ధరణియొకండు
రాజబింబము రీతి రాజిల్లప్రభువై
యనేక సంవత్సరాలేకచక్ర
మేర్పడ సాంబ్రాజ్యమేలుచు ప్రజలకు
తండ్రికీత్యధిక వత్సలతకూడి
ఇష్టసంప్రాప్తియ ఇష్టనివర్తిచేయుచు
దుష్టసంశిక్ష శిష్ట
సంరక్షణక్రియల్ సలుపుచు తానేలు
పృథ్వి కెప్పుడు ననావృష్టిదోష
బాధలులేకుండ బహున్యాయ ధర్మముల్
జరుపుచ నతి యైశ్వర్యవంతు
డై చిరాయుష్మంతుడై యశోవంతుడై
సరస భార్యాపుత్ర సౌఖ్యవంతు
డై మహా ధీమంతుడైయుండి నెల్లూరు
పురవాసులకు శుద్ధజల సమృద్ధి
శీతవాత విశేషసిద్ధియు లేమిడి చిత్తగించి
దయార్ద్ర చిత్తుడగుచు
స్వాంకితమును ప్రకాశత చందచేయు
తత్పరిలానిలంబుల సహితమైన
స్టోన్‌హౌసు పేట నిర్పుట నేపరిచె
రాజధాని కీశాన్యంబు తల్పశైల
నాథుని శ్రీరంగనాథుని యాలయ శ్రేణి
కాగ్నేయాన శ్రేయముగను
యీపేట మధ్యమందీ మహా ప్రభుపుయొక్క
పోష్యవర్గంబులో ముఖ్యుడైన
హెడ్ శిరస్తేదారు ఖితజన హారితసగోత్ర
వెంకటనరసు పౌత్రుడనగ
శేషగిరిరాయణి జ్యేష్ఠపుత్రుడు మధ్వపతి
పురుషోత్తమ పంతులతడు
శ్రీ తల్పగిరి రంగనాథుని ప్రీత్యర్థముగను
ఈపేటకు భూషణంబు
గాను యీ రంగపుష్కరణిని యేపాటుచేసె
పుణ్యఫలంబు శేఖరిల్ల
యీ యుభయధర్మములును ఆచంద్ర
సూర్యస్థాయిగా నుండునట్లుగాను
తల్పాద్రిరంగ విఠ్ఠలదన శ్రీ స్వామి
శ్రేయోభివృద్ధిని జేయుగాత

శాలివాహన శకవర్షసంఖ్య వెయ్యి
నేడునూర్లరువయారని యెన్న శుభద
శోభకృన్నామ శ్రావణ శుద్ధపౌర్ణ
మాస్యకిది పూర్ణమయ్యె ధర్మములు రెండు॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

౧౮౪౩ సం॥ ఆగస్టునెల ౧౦ తేది.

ఈ శాసనాన్నిబట్టి ఆ కోనేటి స్థలం అంతా-అంటే యిప్పటి పార్కు వగైరా ప్రాంతం-రంగనాథాలయానికి చెందిన ఆస్తి అవుతుందా?

1843 ఆగస్టు 10 తేది వేయించిన ఈ శాసనం బట్టర్‌వర్తు, వేణుగోపాలశెట్టి సంతరించి ప్రచురించిన నెల్లూరు శాసనాల గ్రంథంలో చేరలేదు.

ఈ శాసనం వేయించడానికి పదినెలల ముందు, 1842 అక్టోబరు 20తేది నాటి 'వర్తమానతరంగిణి' లోని వార్తలో కోనేటి ప్రస్తావన వుంది. దీన్నిబట్టి ఈ శాసనం కోనేరు త్రవ్వించిన తర్వాత వేయించిందిగా అనుకోవాలి.

మొత్తమ్మీద 'వర్తమాన తరంగిణి' వార్త, కోనేటి శాసనం-ఈ రెండూ నెల్లూరుజిల్లా చరిత్రలో కలెక్టరు టి. వి. స్టోన్‌హౌసు (తర్వాత ఆయనకు 'సర్' బిరుదంకూడా యిచ్చారు) పాలనాకాలాన్ని ఒక స్వర్ణయుగంగా అభివర్ణిస్తున్నాయి.

□ 'జమీన్‌రైతు' 1944 మార్చి 24 తేది సంచిక పేజీ 6.

⸬ Mr. Timothy Vansilart Stonehouse.

Phone (With Extn) : 370

# SHANTI JEWELLERY

Jewellery Merchants

CHINNA BAZAAR - NELLORE

శాంతి జ్యూయలరి - నెల్లూరు

Prop : JATEMAL

Trust Board Member,
Sri Talpagiri Ranganadha Swamy Temple, Nellore.




# SHREE JAIN SEVA SADAN

(Regd.No. 1/71)

12/426-A, GIDDANGI STREET, NELLORE.

OBJECTS:

1) To give free medical aid to the poor
2) To do poor feeding
3) To aid poor students in education
4) To help the flood and fire victims
5) All other social activities

REGULAR FEATURES OF THE PROJECT

a) Free Dispensary from 2 to 4 p, m.
b) Administering of oral polio and Triple Antigen from 12 to 1 p. m. (On all days except on Sundays)

చరిత్ర పుటలలో
చెరిగిపోని ఘట్టాలు!

# కరువు బాధల కన్నీటి గాథలు

శ్రీ ఎం. అచ్చిరెడ్డి ఎం. ఏ.

కరువుకాటకాలలో బ్రతుకులు బరువుగా బాధగా గడవడం నెల్లూరుజిల్లాకు అనాదిగా అలవాటే! హిందూరాజుల పాలనాకాలంలోకూడా నెల్లూరుజిల్లా అనేక క్షామాలకు గురి అయినట్లు బట్టర్‌వర్త్, వేణుగోపాలశెట్టి సేకరించిన నెల్లూరుజిల్లా శాసనాలవల్ల తెలుస్తూంది. మహమ్మదీయుల హయాంలోకూడా పెద్దకాటకాలుసంభవించినట్లు దాఖలాలైతే వున్నాయి కానీ, పూర్తి వివరాలులేవు. బ్రిటిషువారు ఈ దేశానికి వచ్చిన తర్వాత – అంటే క్రీ. శ. 1600 తర్వాత– సంభవించిన కరువుకాటకాలకు సంబంధించిన వివరాలుమాత్రం మనకిప్పుడు లభ్యమవుతున్నాయి.

1618–19 లో తూర్పుకోస్తాలో అటు మచిలీపట్టణంనుంచి ఇటు పులికాట్ సరస్సుదాకా గొప్ప క్షామం ఒకటి సంభవించినట్లు మోర్‌ల్యాండ్ అనే చరిత్రకారుడు వ్రాశాడు. తర్వాత 1646–51 మధ్యకాలంలో నెల్లూరు – మద్రాసు ప్రాంతాలలో మరొక మహాక్షామం సంభవించినట్లు తెలుస్తూంది. ఆ తర్వాత, 1800 కు ముందు, నాలుగైదుసార్లు పెద్ద కరువులేర్పడ్డాయని శ్రీ మలిరెడ్డి పట్టాభిరామరెడ్డి వ్రాసివున్నారు.

ఐనా 1800 తర్వాత, ఇంగ్లీషువారి పాలనకు సంబంధించిన పత్రాలలో మాత్రమే మనకు నికరమైన నిర్దుష్టమైన సమాచారం లభిస్తూంది. 1800 నుంచి 1860 దాకా నెల్లూరుజిల్లా విపరీతమైన కరువుకాటకాలకులోనైనట్లున్నూ, ఈ జిల్లానుండి వేలు, లక్షల సంఖ్యలో ప్రజలు ఇతర జిల్లాలకు, బ్రిటిషు కాలనీలకు వలసవెళ్ళిపోయినట్లు స్టేట్ ఆర్కైవ్స్‌లోని చారిత్రక పత్రాలవల్ల సమకాలికుల రచనలవల్ల తేటతెల్లమవుతూంది.

## 1806-07 నాటి దుర్భరక్షామం

1800 కి ముందే నెల్లూరు బ్రిటిషు హస్తగతమైనా, అది నిలువలేదు. కడకు 1801 లో నెల్లూరు ఈస్టిండియా కంపెనీ అధీనమయింది. మొట్టమొదటి జిల్లా కలెక్టరు జె. బి. ట్రావెర్స్ 1801 ఆగస్టు 2 తేది ఈ జిల్లాకు వచ్చాడు. ట్రావెర్సు జిల్లాలో అస్తవ్యస్తంగావున్న ఆర్థిక పరిస్థితినిచూచి, ఉరామరిక సర్వేననుసరించి భూమిశిస్తు పద్ధతిని ప్రవేశపెట్టాడు. ఆ పద్ధతివల్ల కల్గే ఫలితాలు పూర్తిగా తెలియకమునుపే, 1806-07 వ్యవసాయ సంవత్సరంలో జిల్లా క్షామానికి గురిఅయింది. ఇంగ్లీషువారి హయాంలో జిల్లాకొ ఏర్పడిన తొలికరువు అదే. అప్పటికి నెల్లూరుజిల్లా నెల్లూరు ప్రాంతం, ఒంగోలు ప్రాంతం అని రెండు ప్రాంతాలుగా వ్యవహరింపబడుతుండింది. ఆ క్షామంవల్ల ఒంగోలు ప్రాంతంలో భూమిశిస్తు 27 శాతం తగ్గిపోగా, నెల్లూరు ప్రాంతంలో హెచ్చుతక్కువ 60 శాతం తగ్గిపోయింది. మొత్తంమీద జిల్లాలో శిస్తువసూళ్ల సగంకంటే తక్కువగా వున్నట్లు కలెక్టరు వ్రాశాడు.

ఆ కరువులో ప్రజాజీవితం దుర్భరమూ, దుస్సహమూ అయింది. లెక్కకుమించిన పశువులు చనిపోయాయి; ఎందరోరైతులు, కూలీలు ఇళ్ళువాకిళ్లూ వదిలి వలసపోయారు. అప్పటి రెవిన్యూ పత్రాలను బట్టిచూస్తే, ఒంగోలు ప్రాంతంకంటే నెల్లూరు ప్రాంతం ఎక్కువగా బాధలకు గురిఅయినట్లు తెలుస్తూంది. నెల్లూరు ప్రాంతంలో ఇప్పటి నెల్లూరు, కోవూరు, గూడూరు, రాపూరు, ఆత్మకూరు, ఉదయగిరి, కావలి తాలూకాలు చేరివుండేవి; ఒంగోలు, కందుకూరు తాలూకాలు ఒంగోలు ప్రాంతంగా పరిగణింపబడుతుండేవి. అప్పట్లో కనిగిరి తాలూకా దత్తమండలంలో చేరివుండేది. వెంకటగిరి, పోలూరు (సూళ్ళూరుపేట), దర్శి, పొదిలి తాలూకాలు జమీందారీలలో వుండేవి; కాబట్టి వాటి సమాచారం అంతగా లభించడంలేదు.

ప్రజాజీవితాన్ని పిప్పిపిప్పిచేసిన ఆ క్షామమ్నుంచి జిల్లా తిరిగి కోలుకొడానికి రెండుమూడేళ్ల పట్టినట్లు ఆనాటి జిల్లా కలెక్టరు వ్రాశాడు.

## గోరుచుట్టుమీద రోకటిపోటు!

గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్టు, 1806-07 నాటి కరువునుండి జిల్లా పూర్తిగా తేరుకొనకముందే, 1811 లో మరొక కరువు సంభవించింది. అప్పటి పాలనాధికారులైన కుంపిణీవారు జిల్లాకు శిస్తు రెమిషన్ ఏమీ యిచ్చినట్లు కనబడదు. ఎండే కడుపులు, మండే కడుపులతో ఒకవైపు ప్రజలు హాహాకారాలు చేస్తుంటే, మరొకవైపు వ్యాపారులు ఆహారధాన్యాలను నిలువచేసి, అత్యధిక ధరలకు విక్రయించి, అక్రమార్జనకు పాల్పడ్డారు. ఆనాటి క్షామంవల్ల జిల్లాలో షుమారు 27 వేల స్టార్ పగోడాలు (దాదాపు లక్షా 89 వేల రూపాయలకు సమానం) శిస్తును ప్రభుత్వం నష్టపోయినట్టు జిల్లా కలెక్టరు టి. ఫ్రేజరు వ్రాశాడు. ఈ కరువు ముఖ్యంగా నెల్లూరు ప్రాంతాన్ని తీన్రాక చేసినట్లుంది. ఐతే జననష్టం వగైరాలనుగూర్చి ఖచ్చితమైన సమాచారం దొరకడంలేదు.

## గుంటూరు కరువు-
## నెల్లూరు వీథుల్లో శవాల కుప్పలు!

నెల్లూరుజిల్లా బ్రిటిషువారి పాలనక్రిందికి వచ్చిన తర్వాత మూడవసారి, 1832–34 మధ్యకాలంలో మరొక ఘోరమైన క్షామం సంభవించింది. అది

ఒక్క నెల్లూరు జిల్లాకే కాక, గుంటూరును కూడా విపరీతంగా పీడించింది. అందువల్లనే దానికి 'గుంటూరు కరువు' అనే పేరు వచ్చింది.

అప్పట్లో మిలిటరీ ఇంజనీరుగా వుండిన ఒక ఆంగ్లేయుడు ఆ కరువుకాలంలో తన అనుభవాలను వివరిస్తూ వ్రాసిన సమాచారం, మద్రాసు నుండి వెలువడుతుండిన ఒక 'జర్నల్'లో ప్రకటింపబడింది. దాన్నిబట్టి గుంటూరులోను, పరిసర ప్రాంతాలలోను దాదాపు మూడవవంతు ప్రజలు, పశువులలో సగానికి సగం నష్టమైనట్లు తెలుస్తూంది.

ఆ దుస్థితి నెల్లూరుకుకూడా తప్పలేదు. ఒక అధికారి పంపిన నివేదికననుసరించి- నెల్లూరు పుర వీధులలో ఎక్కడజూచినా శవాలు కుప్ప తిప్పలుగా పడివున్నాయి. వాటిని తప్పించుకొని వీధుల్లో నడవడం అసాధ్యంగా వుండేది. కలరా వల్ల మనుషులు కుళ్ళిన ఆకులవలె రాలిపోతే, నీరు మేత లేక పశువులు వుగ్గులు మాదిరి చచ్చాయి. ఒక్క నెల్లూరులోనే 607 మంది దిక్కూమొక్కూ లేని అనాథలయ్యారని ప్రభుత్వం అంచనా కట్టింది. పేదాసాదా కరువు చేతపట్టుకొని, తండోపతండాలుగా కాలినడకన మద్రాసు చేరుకున్నారు. ఈ వలస ముఖ్యంగా నెల్లూరు దక్షిణప్రాంతం నుంచి ఎక్కువగా వుండింది.

1832-33 లో శిస్తువసూళ్ళు సాధారణ సంవత్సరాలలో వసూళ్ళకంటె 50 శాతం తక్కువ. మరుసటి సంవత్సరంకూడా శిస్తువసూళ్ళు 65 శాతం దాటలేదు. 1836-37 లోను, 1842 లోను వర్షాలు లేక కాటకాలు సంభవించాయి; కానీ వాటిని పెద్ద కరువులుగా చెప్పుకోడానికి ఆధారాలులేవు. తిండి గింజల ధరలుమాత్రం కొంచెం పెరిగినట్లు తెలుస్తూంది.

## మంచిరోజులు వచ్చాయి!

1842 నుండి హెచ్చుతక్కువ ముప్పయిమూడేళ్ల పాటు నెల్లూరుజిల్లా కరువు రక్కసిబారిన పడలేదు. అప్పట్లోనే- 1850-64 మధ్యకాలంలో- నెల్లూరు వద్ద, పెన్నానదిమీద ఆనకట్ట నిర్మింపబడింది. దాని పుణ్యమా అని జిల్లాలో- ముఖ్యంగా నెల్లూరు, గూడూరు తాలూకాలలో (అప్పటికింకా కోవూరు తాలూకా యేర్పడలేదు)- వల్లపు వ్యవసాయం బాగా వృద్ధి చెందింది. ఈ ప్రాంతాలలోని చిన్న చిన్న చెరువులకుకూడా నీటి సరఫరా ఖరారు అయింది. 1830-70 మధ్య మద్రాసు ప్రభుత్వం కొత్తగా శిస్తులు విధించింది; ఉన్న రేట్లను పెంచింది. 1860-62 లలో చెంగల్పట్టు నుండి శ్రీహరికోట ప్రాంతాన్ని, దత్తమండలంనుండి కనిగిరి ప్రాంతాన్ని వేరుచేసి, నెల్లూరు జిల్లాలో చేర్చారు. 18-2-74 లలో జిల్లాలో కొత్త సెటిల్‌మెంట్ (Rundall Settlement) ను, వరుసగా నెల్లూరు, ఒంగోలు ప్రాంతాలలో ప్రవేశ పెట్టారు. కనిగిరి తాలూకాను ఒంగోలు ప్రాంతంలో కలిపారు. ఈ స్వల్పవ్యవధిలోనే జిల్లాలో వ్యవసాయం చాలావరకు అభివృద్ధి చెందింది.

## ధాతుకరువు

నెల్లూరు ఆనకట్ట ఫలితాలు జిల్లాకు పూర్తిగా అందకమునుపే, 1876-77 లో ప్రబలిన ధాతు కరువుకు జిల్లా గురిఅయింది. ఈ మహా క్షామం (The Great Madras Famine 1876-78) గూర్చి ప్రభుత్వపు రికార్డులేకాకుండా, ఇతరుల రచనలుకూడా విరివిగా లభిస్తున్నాయి. ప్రభుత్వపు రికార్డుల తర్వాత చెప్పుకోదగినవి ముఖ్యంగా ఆనాటి క్రైస్తవ మిషనరీల రచనలు, 'మద్రాసు మెయిలు' దినపత్రికలోని వార్తావిశేషాలు. వీటన్నిటిద్వారా, అంతకు మునుపు క్షామాలలో తెలియని అనేక అంశాలు ఈ ధాతుకరువు కాలంలో క్షుణ్ణంగా లెక్కవేయబడినవి.

1875లోనే ధాతుకరువు సూచనలు కొంతవరకు కన్పించాయి. నైరుతి ఋతుపవనాలంతగా వర్షించలేదు. ఆ ప్రభావం అప్పటికి దత్తమండలం (రాయలసీమ) పైన వున్నంతగా నెల్లూరుమీద లేదు. ఐతే ఈశాన్యఋతుపవనాలు మాత్రం 1875 చివరిభాగంలో అతిస్వల్పంగా వర్షించినట్లు, 1876 జనవరిలో నెల్లూరుజిల్లా కలెక్టరు మద్రాసు ప్రభుత్వానికి పంపిన నివేదికలో పేర్కొన్నాడు. ఆ వేసవిలో ఎండలు మండిపోయాయి. జూన్ జూలైలలో మంచి వర్షాలు లేకపోవడంచేత, ఆగస్టులో కరువుపనులు ప్రారంభించడానికి ప్రభుత్వ నిధులనుండి 10 వేలరూపాయలు కలెక్టరు మంజూరుచేశాడు. నెల్లూరు కలెక్టరు షార్పు (Sharp) అక్టోబరులో కనిగిరి ప్రాంతంలో పర్యటించి, వర్షాభావంవల్ల ప్రజలు చాలా దీనావస్థలో వున్నారని, త్రాగునీరు ఆహారం అత్యవసరం అని ప్రభుత్వానికి నివేదించాడు. దాదాపు జిల్లా పడమర తాలూకా లన్నింటిలోనూ ఇదేపరిస్థితి వున్నట్లు చెప్పవచ్చు. అయితే తూర్పుప్రాంతం-



ఎం. అచ్చిరెడ్డి

అంటే ఒంగోలు మొదలుకొని సూళ్ళూరుపేట (పోలూరు) దాకా- అప్పటికి పెద్దగా దెబ్బతినలేదు. కలెక్టరు మరొక నివేదికలో, ఉదయగిరి తాలూకాలో పైర్లు మంచి ఫలితాలివ్వకపోవడంవల్ల వ్యవసాయ కూలీలు కడుదీనావస్థలో వున్నట్లు, పట్టణాలలోని ముస్లిములలో నిరుద్యోగం ప్రబలంగా వున్నట్లు తెలియజేశాడు.

జిల్లా అంతటా ధాన్యం, పప్పుదినుసుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. 1875 డిసెంబరులో మణుగు బియ్యం ఖరీదు రు 2-7-0 లు వుండేది. అదే మణుగుబియ్యం 1876 డిసెంబరులో రు 5-14-0 లయ్యింది. జిల్లాలో దక్షిణాది ప్రాంతాలవారు మద్రాసుకు, ఉత్తరాదివారు కృష్ణాగోదావరి జిల్లాలకు (గుంటూరు ప్రాంతం కృష్ణాజిల్లాలో ఒకభాగంగా వుండేది) తండోపతండాలుగా వలస పోయారని తెలుస్తూంది. పరిశీలన చేయగా, ఒంగోలు దర్శి తాలూకాలనుండి కొందరు తమ ఆవులు, గొర్రెలను మందలుగా తోలుకొని వెళ్ళినట్లు కన్పిస్తూంది.

ఈ పరిస్థితులలో జిల్లాలోని అన్ని ప్రభుత్వ తాలూకాలలో విస్తారంగా కరువుపనులు ప్రారంభింపబడ్డాయి. జమీందారీ తాలూకాలైన దర్శి, పొదిలి, వెంకటగిరి, సూళ్ళూరుపేట, (పోలూరు) లలోగూడ కొంతవరకు ప్రభుత్వం, కొన్నిచోట్ల జమీందార్లు కరువుపనులు పురమాయించారు. 1876 డిసెంబరు ఆఖరువారంలో జిల్లాలో ఉరామరికగా 49 వేల మంది కరువుపనులలో చేరివుండినారు. ఒక్క కందుకూరు తాలూకాలోనే వారిసంఖ్య 11,500 అట; అందులో సగంకంటె ఎక్కువగా స్త్రీలు, పిల్లలు వుండినారు.

క్రొత్తకోడ్లు వెయ్యడం, పాతవి మరమ్మతు

చెయ్యడం, చెరువుల త్రవ్వడం, చెరువుకట్టలు బాగుపరచడం, కాలువల త్రవ్వకం వగైరా పనులెన్నో చేస్తుండేవారు. అన్నిట్లోనూ ముఖ్యమైంది— సముద్రతీరం వెంబడి బకింగ్‌హామ్ కాలువ త్రవ్వకం. ఆ కాల్వత్రవ్వ, జిల్లాలోని మిగతా అన్ని పనులలా ఈ జిల్లావాసుల సంక్షేమానికి ఉద్దేశించినదే. కృష్ణాజిల్లా (ఇప్పటి గుంటూరుజిల్లా) లోని కొంవట్నంనుండి మద్రాసువరకు గల ఈ బకింగ్‌హామ్ కాల్వ త్రవ్వకంపనిలో సగానికిపైగా దత్తమండలాల్లో బాగా దెబ్బతిన్న ప్రాంతాల కూలీజనానికి ఉద్దేశింపబడింది. పెన్నకు ఉత్తరాన కొంతమేరమాత్రమే నెల్లూరుజిల్లా వాసులకు కేటాయించారు. ఈ కాల్వపనులకు దత్తమండలంలోని బళ్ళారిజిల్లా (అప్పటికి అనంతపురంజిల్లా లేదు) నుంచి కూలీలు ఎక్కువగా వచ్చారు. ఇటువంటి వలసను ప్రభుత్వం అనేక విధాలుగా ప్రోత్సహించింది; వారికి ఉచితంగా దారిఖర్చులుకూడా యిచ్చింది.

మరుసటేడు–1877లో — ఈ కరువు రక్కసి కరాళనృత్యం పతాకస్థాయిని చేరుకొని, 'ధాతుకరువు' (Great Famine) గా చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయింది. ఆసంవత్సరం వర్షాలు బాగా తగ్గిపోయాయి. 1876లో పంటలు బాగా దెబ్బతినడంవల్ల రైతులవద్ద ధాన్యం ఏమీ మిగలలేదు. కొద్దిమంది వర్తకులుమాత్రం దాచిపుంచిన ధాన్యాన్ని అధికధరలకు విక్రయిస్తుండినారు. మార్కెటులో బియ్యం రు 7 లకు పైగా అమ్ముతుండింది. కరువుపనులమీద పనివారి ఒత్తిడి హెచ్చింది. మరికొన్ని రోడ్లు, కట్టడాలు కరువు పనులక్రింద ప్రారంభింపబడ్డాయి. దత్తమండలాలనుంచి వచ్చినవారుకాక నెల్లూరుజిల్లాలో కరువు పనులమీద జీవిస్తుండిన వారిసంఖ్య దాదాపు 70 వేలదాకా వుండింది. దీన్నిబట్టి జిల్లాలో దాదాపు 5 శాతం జనం కరువుపనులమీద, ఉచితభోజనశాలల్లోను బ్రతుకుతుండేవారని తెలుస్తూంది. మద్రాసు రాష్ట్రంలో దత్తమండలాల తర్వాత అధికసంఖ్య ఇదే. ఇతర జిల్లాలకు, బర్మాకు, నైజాం ప్రాంతాలకు వలసవెళ్ళినవార్నిగూర్చి ఖచ్చితమైన సమాచారం ఏదీలేదు. మద్రాసు నగరంలో తెరవబడిన ఉచితభోజనశాలల్లో నెల్లూరీయులెంతమంది వుండేవారోకూడా తెలియదు.

క్షామం తర్వాత తిరిగివచ్చినవారురాగా, 1881 నాటికి ఇతర జిల్లాలలోవున్న నెల్లూరీయుల సంఖ్య జనాభా లెక్కలనుబట్టి తెలుస్తూంది. ఆ విధంగా స్థిరపడిన నెల్లూరీయుల సంఖ్య అన్నిటికన్నా కృష్ణా (గుంటూరుతో కలిసి) జిల్లాలో ఎక్కువగా వుండేది. 1881 లో కృష్ణాజిల్లాలో నెల్లూరీయుల సంఖ్య- 33,502. వారిలో సగానికిసగం స్త్రీలు గనుక, వారందరూ శాశ్వతంగా వలసవెళ్ళినవారని చెప్పవచ్చు. అశాశ్వత వలస అయితే సాధారణంగా పురుషుల సంఖ్య ఎక్కువగా వుంటుంది. 1881 నాటికి మద్రాసు నగరంలో అటువంటి నెల్లూరీయులు 8050 మంది మాత్రమే వున్నారని లెక్కతేల్చారు. అయితే కృష్ణాజిల్లాకు, మద్రాసుకు వెళ్ళిన మొత్తం నెల్లూరీయుల సంఖ్యకానీ, తిరిగివచ్చినవారిసంఖ్యకానీ తెలియడంలేదు.

ఈ ధాతుకరువులో బర్మాకు వలసపోయిన నెల్లూరీయుల సంఖ్యకూడా తక్కువగా యేమీలేదు. ఈ వలసను ప్రభుత్వంకూడా ప్రోత్సహిస్తుండేది; బర్మాలో ఉచితంగా భూమి యిస్తామని జిల్లా రాజపత్రా(District Gazatte)ల్లో ప్రకటించారు.

ముందు కరువులకు సంబంధించి మనకు లభ్యం కానివి, 1876–78లో ప్రభుత్వ నివేదికలలో పొందుపరచబడినవి, కొన్ని ముఖ్యమైన పరిశీలన అంశాలు వున్నాయి. ధాతుకరువులో అమలులో వున్న పనివిధానాలు, కూలిరేట్లు వగైరాలు చూద్దాం-

## ధాతుకరువు : పని విధానాలు

కరువుపనులు–ముఖ్యంగా బకింగ్‌హామ్ కాల్వ పని–మూడువిధాలుగా సాగింది. (1) కంట్రాక్టు (2) గ్యాంగ్ (Gang) (3) పనినిబట్టి కూలి.

కంట్రాక్టు పద్ధతిలో కొన్ని ఫర్లాంగుల - లేదా దాదాపు ఒకమైలు-పొడవు కాల్వ కంట్రాక్టర్లకివ్వబడేది. వారిక్రింద పనిచేసే కూలీలకు కూలిడబ్బు ధాన్యరూపంలో యిచ్చేవారు. మంచి శక్తి సామర్థ్యాలు కలిగి, బాగా దిట్టంగా పనిచెయ్యగల్గినవారు ఎక్కువగా ఈ కంట్రాక్టర్ల క్రింద వుండేవారు. కాబట్టి వీరిలో సగటుమనిషి పనికానీ, కూలీరేటుకానీ, మిగతా రెండు పద్ధతులలో పనిచేసేవారికంటే ఎక్కువగా వుండేదని చెప్పవచ్చు.

రెండవది - గ్యాంగుపద్ధతి. ఇందులో 10మంది నుంచి 50 మందిదాకా ఒక గ్యాంగ్‌గా చేరేవారు. కంట్రాక్టరు మాదిర్నే వీరుకూడా కొంతభాగం కాల్వను పనికి తీసికొనేవారు. అయితే వైశ్ళ ఫర్లాంగులు కాదు; కొన్ని గజాలుమాత్రమే–ఒక్కరోజు పనికి సరిపోయేటంత. ప్రతిగ్యాంగుకూ ఒక మేస్త్రి ఉండేవాడు. అతనిద్వారా మిగతావారందరికీ దిన కూలీలు అందచేయబడుతుండేవి.

ఇక మూడవ పద్ధతిక్రింద బలహీనులు, సోమరులు మాత్రమే చేర్తుండేవారు. ఈ పద్ధతిలో ప్రభుత్వాధికారులే స్వయంగా కూలీలచేత పనులు చేయించి, కూలీ చెల్లించేవారు. ప్రతి ఒక్కరిచేత వారు చేయగల్గినంతపని చేయించి, దినభత్యానికి సరిపోయే కూలీ యిస్తుండేవారు. వాళ్ళలో చాలామంది కనీసపు పనికూడా చేసేవారుకాదు.

ఈపద్ధతులన్నీ సక్రమంగా అమలుజరపడానికి తాసిల్దారు హోదా కల్గిన ఉద్యోగులను సూపర్‌వైజర్లుగా నియమించేవారు. దత్తమండలాలనుండి వలసవచ్చిన కూలీల యోగక్షేమాలను చూడ్డానికి డెప్యూటీ తాసిల్దారు హోదాగల్గిన ఉద్యోగులు ప్రత్యేకంగా ఆయాప్రాంతాలనుండి వచ్చినట్లు తెలుస్తూంది.

## డబ్బు బదులు ధాన్యం

కూలి చెల్లింపు పద్ధతి, కూలిరేట్ల విషయంలో అంతకుమునుపు ఏ కరువురోజుల్లోనూ లేని కొన్ని సూత్రాలను ధాతుకరువుకాలంలో ప్రభుత్వం ఏర్పరచుకోవలసి వచ్చింది. ఎంత జాగ్రత్తగా వ్యవహరించినా, కొన్నిచోట్ల ఆబందర అవకతవకలు తప్పలేదు.

తొలుత నగదురూపంలో కూలి చెల్లిస్తుండేవారు; కానీ మార్కెట్లో ధాన్యంధరలు చుక్కలను నిక్కిచూడ్డంతో, డబ్బుబదులు ధాన్యమే యివ్వవలసివచ్చింది. మొదట కొన్నిచోట్ల కొద్దికొద్దిగా మాత్రమే ఈ ధాన్యంకూలీ పద్ధతిని ప్రవేశపెట్టినా తర్వాత తర్వాత అన్నిచోట్లా అన్నిపనులకూ ఈ పద్ధతే అమలులోకి వచ్చింది. ఆ విధంగా ధాన్యం కూలీ తీసుకొంటుండిన కూలీలు మొత్తంమీద 75 శాతానికి పైగానే వుండేవారు.

## ప్రభుత్వపు కూలిరేట్లు

మొట్టమొదట 1876లో కరువుపనులు ప్రారంభదశలో ప్రభుత్వం మూడవపద్ధతికింద పనివారికి భత్యపు కూలీరేట్లను ఏర్పాటుచేసింది. అవి యిట్లా ఉండేవి-

మగవారికి ఒక్కొక్కరికి 2 పొన్న బియ్యం 6 పై

ఆడవారికి ఒక్కొక్కరికి 1½ పౌన్ల బియ్యం 4 పై.
పిల్లకాయలకు ,, 1 పౌను బియ్యం 3 పై.

–ఇది మూడవపద్ధతి కూలీల భత్యాలు. అంటే దిగతా రెండుపద్ధతుల్క్రింద పనిచేసే కూలీల రేట్లు యింతకంటే హెచ్చుగా వుండేవన్నమాట. దీన్నిబట్టి మనకర్థమయ్యేది–మొదటి రెండు పద్ధతులలో (కంట్రాక్టు, గ్యాంగు) చేరే కూలీలకు పని బాగా ఎక్కువగా వుండడమేగాక, వారి కుటుంబాలలో మరికొందరి పోషణభారంకూడా వారిమీదవుండేది. మూడవరకం కూలీలకుమాత్రం ఈబరువు అంతగా వుండేదికాదు. ఎందువల్లనంటే, పనిచేయగల్గిన స్త్రీలు, పిల్లలకుకూడా కూలి, పనిచేయలేనివారికి వారితిండికి సరిపోయేంత 'ఉచిత రేషను' యివ్వబడుతుండేది.

## టెంపుల్ కూలిరేట్లు

కానీ పై కూలీరేట్లు ఎంతోకాలం అమలుజరగలేదు 1877 ఫిబ్రవరి ప్రాంతాలలో సర్ రిచర్డ్ టెంపుల్ (Sir Richard Temple) అనే ప్రత్యేక అధికారిని ప్రభుత్వం క్షామప్రాంత పరిస్థితి సమీక్షార్థం దక్షిణదేశానికి పంపింది. ఆయన ఫిబ్రవరి చివరివారంలోనే నెల్లూరుజిల్లాకు వచ్చాడు. ఆయన మద్రాసు ప్రభుత్వానికి అందజేసిన తన నివేదికలో బకింగ్‌హామ్ కాల్వపనికి చాలినంత మంది పనివాళ్ళు చేరలేదని; లెక్కల ప్రకారం 90 వేల మందికి పని కల్పించే అవకాశాలున్నా, అందులో ఇంచుమించు మూడోవంతుమాత్రమే అక్కడ పని చేస్తుండినారని; పనివాళ్ళు బలంగా ఆరోగ్యంగా వున్నారని; అందుకు కారణం వారికి ప్రభుత్వం హెచ్చుకూలీలివ్వడమేనని పేర్కొన్నాడు. అంతేకాదు; కూలీరేట్లు బాగా తగ్గించి ఎంతోడబ్బు పొదుపు చెయ్యవచ్చునని కూడా ఆయన సూచించాడు. ఆయన తలఒకటికి నిర్ణయించిన కూలీరేట్లు యివి:

మగవారికి 1 పౌను బియ్యం, 6 పైసలు
ఆడవారికి 1 పౌను బియ్యం, 3 పైసలు
పిల్లలకు ½ పౌను బియ్యం, 3 పైసలు

ఈ టెంపుల్ రేట్లను అప్పటికి అమలులో వున్న రేట్లతో పోల్చిచూస్తే, డబ్బు విషయం అటుంచి, ధాన్యం కూలీలలో బాగా తగ్గుదల కనిపిస్తుంది. ఆడవాళ్ళ కూలీలలో అరపౌను బియ్యం తగ్గించారు; మగవారికీ, పిల్లకాయలకు సరిగ్గా సగం కూలీ తగ్గించేశారు. ఆడవారికి డబ్బుకూలీ ఒక పైసామాత్రం తగ్గింది.

## టెంపుల్ రేట్లపై విమర్శలు

టెంపుల్ సిఫారసుచేసిన రేట్లు వెంటనే మద్రాసు రాష్ట్రమంతటా అమలులోకి వచ్చాయి. అయితే అవి ఎవర్నీ తృప్తిపరచలేకపోయాయి. ఈ కొత్త రేట్లు తమ కనీసభత్యాలకైనా చాలవని కూలీలు వాపోయారు. ఈ కూలిరేట్లను ప్రభుత్వాధికారులు కూడా విమర్శించారు. అనాటి శానిటరీ కమీషనరు డాక్టరు కార్నిష్ (Dr. Cornish) టెంపుల్ రేట్లతో పనివాళ్ళు తమబొందిలో ప్రాణాలు నిలుపుకోడానికికూడా చాలనట్లున్నాయని అన్నాడు. భార్య, భర్త, ముగ్గురు పిల్లకాయలువుండే సాధారణ కుటుంబానికి, ఏపనీ చెయ్యకపోతే రోజుకు ఐదుపౌన్లు, పనిచేస్తుంటే 7 పౌన్లు ధాన్యం అవసరమవుతుందని డాక్టర్ కార్నిష్ నిరూపించాడు. కాబట్టి సగటుమనిషి కనీసపు కూలీరేటు రోజుకు 1½ పౌన్ల ధాన్యం, దాంతో కొంతడబ్బు యివ్వాలని ఆయన సిఫారసుచేశారు. అంతేకాదు– అడబ్బు ఒకపౌన్ను క్రొవ్వునిచ్చే పదార్థాలను, రెండు ఔన్సుల పప్పుపదార్థాలను, తగుపాటిగా మసాలా ద్రవ్యాలను కొనుక్కోడానికి సరిపోయేట్టు వుండాలనికూడా ఆయన సూచించాడు. టెంపుల్ నిర్ణయించిన రేట్లేయిస్తే, కూలీలు పనిచేయగల స్థితిలో వుండలేరని స్పష్టం చేశాడు.

## మరొక డాక్టరు విమర్శ

అప్పటి మద్రాసు ప్రభుత్వపు సర్జన్ జనరల్–డాక్టర్ రాస్ (Dr. Ross) కరువుపనులు ఆధారంగా బ్రతికే పనివారిమీద చాలా ప్రయోగాలు జరిపాడు. కడకు ఆయన తేల్చింది– టెంపుల్ రేట్లతో కూలీజనం ఆరోగ్యంగా వుండడం అసాధ్యం అని. ఆయన 1877 మార్చి ఏప్రిల్ నెలల్లో పనివారి బరువులు కొలిచి, వారి సగటుబరువు క్రమంగా తగ్గిపోతూందని, అనారోగ్యం పెరిగిపోతూందని; అందుకు కారణం, చాలీచాలని కూలీరేట్లని ప్రభుత్వానికి నివేదించాడు.

అయితే ప్రభుత్వం ఈ విమర్శను సులభంగా అంగీకరించలేదు. కరువువల్ల పశువులు విపరీతంగా చనిపోతున్నాయని, తక్కువ కులాలకు చెందిన పనివారు వాటిమాంసం తింటున్నారని, అందువల్ల డాక్టర్ రాస్ పరిశీలన చాలామంది విషయంలో సరికాదని జిల్లా కలెక్టరు ప్రభుత్వానికి జవాబు వ్రాశాడు. కలరా వగైరావ్యాధులు చచ్చిన పశువుల మాంసం తినడంవల్ల ప్రబలినాయేకానీ, కూలీరేట్లు తక్కువ కావడంవల్ల కాదని వాదించిన ప్రభుత్వోద్యోగులు కూడా లేకపోలేదు.

ఈ వాదప్రతివాదాలింతటితో ఆగలేదు. 1877లో బకింగ్‌హామ్ - చాందోస్‌రాజు (Duke of Buckingham and Chandos) తన పర్యటనలో నెల్లూరు జిల్లానుకూడా సందర్శించి, కరువుపనుల్లో పనిచేసేవార్ని చూచాడు. చూచి ఆయన వ్యాఖ్యానించాడుగదా– టెంపుల్ కూలీరేట్లు చాలా తక్కువగా వున్నాయన్నాడు; చాలీచాలని భత్యాలవల్ల కూలీజనం పరిస్థితి దీనంగా హీనంగా వుందన్నాడు. వారు పాములను, బల్లులను పోలినవాటిని (ఉడుములా?) కూడా తిని బ్రతుకులీడుస్తున్నారని; పగలంతా కష్టించి పని చెయ్యడం, రాత్రిపూట వాటికోసం దగ్గర్లో వున్న అడవుల్లో తిరగడం– ఇట్లా బ్రతుకుతున్నారని అన్నాడు.

## కట్టకడపటికి సవరింపు!

టెంపుల్ కూలీరేట్లమీద జరిగిన వాదప్రతివాదనలు భారతప్రభుత్వ దృష్టికి పోయాయి. చివరకు తాను నిర్ణయించిన రేట్లు చాలాతక్కువని; కూలీలు వాళ్ళ కుటుంబాలు ఆరోగ్యంగా వుండాలంటే ఆ కూలి చాలదని టెంపుల్ ఒప్పుకొన్నాడు. తర్వాత కూలీరేట్లు కొద్దిగా పెంచడానికి మద్రాసుప్రభుత్వం అంగీకరించింది. నెల్లూరుజిల్లాలో సగటు మనిషి ధాన్యపుకూలీ రోజుకు ఒకటిన్నర పౌన్లదాకా పెంచినట్లు తెలుస్తూంది. ఆ సవరించిన రేట్లు 1877 వేసవి తర్వాతగానీ అన్నిచోట్లా అమల్లోకి రాలేదు.

## ధాతుకరువు ఫలితాలు- పదేళ్ళలో జనాభా తగ్గింది!

మొత్తమ్మీద ధాతుకరువు అనబడే 1876-78 నాటి మద్రాసు మహాక్షామం నెల్లూరు జిల్లాను మూడేళ్ళపాటు పీల్చి పిప్పిచేసిపారేసింది. దాని ప్రభావంనుంచి పూర్తిగా కోలుకోడానికి నాలగైదేళ్ళు పట్టింది. 1880 దాకా ఈకరువు ప్రభావం, భయాందోళనలు ప్రజల్లో ప్రబలంగా వుండేవి. ఈకరువువల్ల వేలాదిజనం–ముఖ్యంగా సన్నజనం, కూలీలు–మరణించడమో, వలసపోవడమో జరిగింది. 1871 జనాభాలెక్కలతో 1881 జనసంఖ్యను పోల్చి చూస్తే, దాదాపు 12 శాతం తగ్గిపోయింది.

అంటే పెరగాల్సిన జనసంఖ్య తరిగిపోయిందన్న మాట! సెన్సస్ ప్రారంభించిన నాటి నుండి ఈ నాటివరకూ–అంటే 1871 నుండి 1971 దాకా లెక్కలు చూసే, నెల్లూరు జిల్లాలో జనాభా తగ్గడం అన్నది ఆ దశాబ్దిలో తప్ప మరెప్పుడూ జరగలేదు.

నెల్లూరుజిల్లాను వణికించిన కరువు కాటకాల కథలివి. చరిత్రపుటలలో చెరిగిపోని ఈ దౌర్భాగ్య ఘట్టాలవెనక ఎన్నికన్నీళ్లు, ఎన్నికడగండ్లు దాగి వున్నాయో చెప్పలేము. ఎన్ని వర్గాల సంసారాలు ఆ కరువు రక్కసికి బలిఅయి, నామరూపావశేషాలైనా లేకుండా పోయాయో, ఎన్ని నిండు కుటుంబాలు ఆ క్షామాగ్నికి కట్టెలైనా ఆహుతయి పోయాయో ఊహించలేము.

ఈ కరువులవల్ల ఆర్థిక పరిణామాలేకాదు; ఎన్నో సామాజిక పరిణామాలుకూడా ఏర్పడ్డాయి. వాటినిగూర్చి సమగ్రంగా పరిశోధించ వలసిన బాధ్యత చరిత్రకారులమీద ఉంది.

ఈ వ్యాసానికి ఉపకరించిన కొన్ని గ్రంథాలు:

1) M. Pattabhirama Reddy Some Features of Nellore Mandalam in the 17th Century

2) M. Pattabhirama Reddy East India Company in Andhra, with Special Reference to Agrarian System 1760-1820

3) Govt. of Madras: Proceedings of the Board of Revenue; 1800–1881

4) Famine Reports 1879-81: Govt of India

5) Papulation Census Report: Govt. of India

6) Govt. of Madras: Selections from the Records of Nellore Collectorate, Nellore 1876

7) J. A. C. Boswell: A Manual of Nellore District, Madras 1873

8) Rundall Settlement Reports 1870-72

9) M. Atchi Reddy: Agrarain History of Nellore Dt. : A Study of Selected Aspects (un published Ph. D. thesis submitted to the University of Delhi 1976)

10) V. Shanmugasundaram: The Great Famine of 1876-78 (un published Ph.D. Thesis. University of Madras 1964)

11) Dharmakumar: Land and Caste in South in India. Cambridge 1965

12) The Madras Mail: 1850-80

---

# నెల్లూరు సీమ

—శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

శ్రీశైలమల్లేశు సిగలోని సిరిమల్లె
విరిరేకవోని వాక్సరణి గలిగి
సింహాచలేంద్ర నృసింహు వక్షమునుండి
మంచిగందమువోని మనసు గలిగి
భద్రగిరిప్రభు పాద గోదావరీ
నదివోని శుభజీవనమ్ము గలిగి
గరుడాద్రిమందిరు కస్తూరికాపుండ్ర
కమువోని సురభిళఖ్యాతి గలిగి

పొలుపు బలు పొందిన తెలుంగు పుడమితల్లి
కూతులం దెల్ల గారాలకూచి యగుచు
నచ్చముగ నమ్మగుణముల నతిశయిల్లు
మేటి నెల్లూరుపురి యను సీటుకత్తె.

నెల్లిధాన్యంబు కొల్లగా నేలనాల్గు
చెఱగుల ఫలించుకతమున సిద్ధ మయ్యె
వరఁగ నెల్లూ రనెడుపేరు పాకనాటి
ధర్మ సామ్రాజ్యరమకు ముత్యాలపేరు.

చాళుక్య పల్లవ చోళాది నృపతుల
కులకుగద్దెలు కుదుర్కొన్నచోటు
సురభారతికిలేని సొంపులు పెంపులు
తెనుగుకబ్బము కూర్చుకొనినచోటు
మగటిమి పురికొల్పి మగల పోరికిఁ బంపు
పడఁతుల కుగ్గుఁబా లిడినచోటు
నెఱజాణ లన్నట్టి యరుదైన బిరుదమ్ము
ధరియించు దంటలు వరలుచోటు

పిడుప జిడజిడ నేతు లుట్టెడు పిషాణి
వంట నీరార దండిగా పండుచోటు
ఉత్తరపు పెన్నయొడ్డున నొప్పుగులుకు
విజయశోహారి విక్రమ సింహనగరి.

పేరిమి నప్పురమ్ము మును
విక్రమసింహవిభుండు గట్టి వి
స్ఫారయశమ్ముతోడ పరిపాలన
సల్పెఁ గాదు; ప్రాంతకాం
తారములెల్ల సింహసముదగ్రము
లౌటను గాదు ప్రోలికా
పేరు ఘటిల్లుటల్; ప్రజలు
విశ్రుత విక్రమసింహు లౌటనే.

వేంగినాటను వెలనాట వెలసియున్న
గౌతమికి కృష్ణవేణికి గారవంపుఁ
జెలియలై పాకనాటికి కొలువునిచ్చు
పావన పినాకినీ మెచ్చ బ్రహ్మవశమె?

సుప్రదక్షిణనామ విశ్రుతిని గన్న
పెన్నజలకమ్ము పాపమ్ము పిలుకుమాన్పు
బ్రహ్మరాక్షసపీడలఁ బాఱదోలు
కుష్ఠరుజ పుట్టుచెడఁ గూల్చి కుశల మొసఁగు.

శరనిధి మెట్టిన యిల్లుగ
పుకమున్మరుచేతివిల్లు పుట్టినయిలుగా
వరలు పినాకిని నెల్లురు
పురమండలజనుల పుట్టుభోగులఁ జేయున్.

మున్నూటరువ్వది గుళ్ళతో నెసఁగుచున్
ముంగిళ్ళ ఛాత్రాళితో
విన్నాణమ్ముగ వేదముల్ చదువు
పృథ్వీదేవతాపాళికిన్
మన్నిలై రహియించు పంటకుల
మాన్యశ్రేణికిన్ వాసమై
వన్నెంగాంచిన సింహపత్తనము
గొప్పం జెప్పగా నేటికిన్?

ఎచటి భక్తవరేణ్యు లెల్లను హరిహరా
ద్వైత సిద్ధాంత ప్రవర్తిపరులు
ఎచటి పండితవర్యు లెల్లను శాస్త్ర
యార్థ తాత్పర్య రహస్యవిదులు
ఎచటి వీరోత్తంసు లెల్లను యుద్ధవం
చక కథా నవరసా స్వాద రతులు
ఎచటి రాణ్ణీతిజ్ఞు లెల్ల రుద్యోగమ్ము
సొంతమ్ము కంఠస్థ మైనవారు

ఎచట వీరుహా రనిగాక యెల్లజనులు
తిక్కమఖి భారతమ్మను తెనుఁగు తోఁట
నిచ్చలు విహార మొనరింతు రిచ్చతోడ
అట్టి నెల్లూరు పొగడంగ నలవి యగునె?

సాగరసంభవమ్ములగు శౌక్తిక
మౌక్తిక విద్రుమమ్ములన్
రాగులు జొన్నలుం బలెను
రాసులు రాసులు వోసి దూరదే
శాగతులైన వర్తకుల కమ్మెడు
సింహపురీ వరమ్ములో
బాగుర! లచ్చి కాపురము సల్పెడు
నిక్కడ గల్గి నిత్యమున్

కాముండు మోపెట్టు కార్ముకమ్ముల పోల్కి
కడువంపు సొంపైన కన్నుబొమలు
వాఁడు సంధించు క్రొవ్వాఁడి తూపులరూపు
చుఱుకైన క్రీఁగంటి చూపుగములు

వాఁడు పాడించు జ్యావల్లుల కైవడి
నిక్క పెక్కులుగల నీలిజడలు
వాఁడు స్వారియొనర్చు వాజి వల్కుల రీతి
వాఁపించు నర్మసంభాషణములు

ఏమి వట్రువటిగిగుబ్బ లేమి మోవు
లేమి మోము లేమినడుము లేమి ముక్కు
లేమి చెక్కులు నెల్లారు సీమలోని
అక్కపక్షియు నూర్వశి కనఁగఁజెల్లి

సోగ కనుంగవలఁ జెలుకుఁ
జూపులు నర్తన మాడుచుండ లీ
లాగతి సంధ్యలఁ గుసుమ
లావిగ లమ్ముచు పూవుపెత్తుఁలఁ
వీఁగరు; కస్తూరి విపణి
వీధులలో నడయాడ నౌనె? యా
రాగవతి నితంబములు
రమ్యకుచంబులు రాయుచుండగఁ

ఊరికి తూర్పువంక లవ
ణోదధి చెల్లెలికట్టదాక ము
క్కారులు పండు కండగల
కయ్యలు; తమ్ములపాకు తోఁటలున్;
నారికడంపు తోఁపులు;
వనప్రియ కూటములైన చూతభూ
మీరుహవాటముల్ సొబగు
మీరును భాగ్యరమాస్పదమ్ములై

కైలాసాచలవాస! శంకర! శివా!
కాత్యాయనీ వల్లభా!
నీలగ్రీవ! హరా! జటాజినధరా!
నీవే సదా మమ్ములన్
పాలింపన్ శరణంచు మ్రొక్కులిడు
సద్భక్తౌఘ సంబాధమై
మూలస్థాన మహేశ్వరాయతన
మొప్పున్ దక్షిణాశాతటిఁ.

అర్ణోరాశికి తూఁర్పై
కర్ణసుఖగఖవిహంగ కలనిస్వనమై
స్వర్ణాఁచెలువు కనులకు
పూర్ణానందమ్ముఁగూర్చు పురికి ప్రతిదిఁ.

మార్గశీర్షమునందు మంచినూని యుతౌడ
అభ్యంజనస్నాన మాడువాఁడు
కుంచంబు తలగడ కుంభీనసేంద్రుండు
మంచంబుగా పవ్వళించువాఁడు
నాభిపంకజమందు వలువ అంఘ్రులచెంత
శ్రీదేవి భూదేవి చెఁగువాఁడు
ముక్కోటివేఁగుజామున భక్తకోటికి
ద్వారదర్శన మిచ్చి తనుపువాఁడు

సొలపుఁజూపుల పెన్నక్కఁ జూచువాఁడు
భువనమోహన పృథుసుధామూర్తి సౌఖ్య
దాయకుఁడు తల్పగిరి రంగనాయకుండు
పట్టణోత్తరదిశయందు ప్రభవిల్లు

నిరవద్యంబగు వేదఘోష నడుమన్
క్షీరాభిషేకంబు దు
ర్ధర దోశ్చండ పరాక్రముండు మధురా
రజౌ జటావర్మ సుం
దరపాండ్యుం డెట గైకొనెన్ మును;
స్వభక్తవ్రాత రక్షాసమా
దర రంగేశ్వరు దివ్యసన్నిధిఁ
సందర్శించినం జాలదే?

జిలుఁగగు కంచిపట్టు మడి
చేరులు రవ్వలకమ్మలున్ మొగ
మ్ముల తిరుచూర్ణరేఖలు
పువ్వులసజ్జలు నిమ్మపండు చా
యల మనుమేను లొప్ప మనసారగ
రంగనిగొల్వ సంజలఁ
దులదుల వచ్చు వైష్ణవ
వధూటుల పోఁడిమిఁజూడ వేడుకౌ.



కొలువయి యుండ రంగపతి
గోఁటిగ చిత్తరిపేళ మండపిఁ
తొలకరి క్రొమ్మెఱుఁగు సయి
దోడులు రంగుగ రామతీర్థపుఁ
వెలచేఁవల్ విలాసములు
విభ్రమముల్ నవహావభావముల్
వెలయఁగ సల్పునాట్య మొక
వేయి కనుల్ పడయుఁ కనుంగొనవన్.

రక్తి జంపిల్ల ఇరుగాళశక్తియాత్ర
పరశురాముని కథఁబాడ పంబవారు
కాలియందెలు గజ్జెలు గల్లు రనఁగ
తాఁడవంబాడు మాతంగి తరమె పొగడ?

కనులంజూశెశ నరాను పెట్టు? కనివఁ
గయ్యాళిగంపైన దు
ర్మనముం బట్టుట దుష్కరంబగు లోహో!
మాతంగికా దద్దిరా!
ఘనదైతేయ నిలింప నిర్మథిత
రంగత్తుంగ భంగాబ్ధిలో
జననం బొందిన ప్రేమదీవియగు
సాక్షా దిందిరా దేవియే!

పరమేశ్వరుఁడుగొల్ల పద్మనాభుఁడు గొల్ల
పరమేష్ఠిగొల్ల బాపండుగొల్ల
పల్లద్రావినవార లెల్లరు గొల్లలే
గొల్లజాతికి మించు కులము కల్ల
అంచు గ్రామము తూర్పుటంచున విలసిల్లు
గుడిలోని గంగకు కోరిమ్రొక్కి
వైశాఖపూర్ణిమ వాసరమ్మునఁ బాగు
జాతరలో కొమ్ము జంపురవళి

వీరణము తిత్తిమ్రోఁతలు విస్తరిల్ల
కొమ్మువారలు పూజరి గొల్లవారు
ఖడ్గతిక్కన రణవీరగాథ సెప్ప
నెత్తురుడుకెక్కుఁ; రోమముల్ నిక్కపొడుచు.

# నెల్లూరు సేద్యం: నాడు-నేడు

నూరేళ్ళనాటి వ్యవసాయం, ఆనాటి పంటలు, పనిముట్లు, అప్పటి సేద్యపు పద్ధతులు, రైతులు, వారి స్థితిగతులు, నమ్మకాలు—ఇవన్నీ పరిశీలిస్తే నాటికీ నేటికీ ఎంత మార్పు—ఎంతటి విప్లవాత్మకమైన మార్పు—అని ఆశ్చర్యం కల్గుతుంది. బహుశా 1863లో మద్రాసు ప్రభుత్వం వ్యవసాయరంగం మీద దృష్టి సారించడమే ఈ మార్పుకు శ్రీకారం చుట్టడమేమో! అప్పట్లో వ్యవసాయాన్ని నవీన పద్ధతులకు మరలించడానికై కొంత ప్రయత్నం జరిగింది. ఇంగ్లండు నుంచి ఆధునిక వ్యవసాయ పరికరాలు తెప్పించి, సైదాపేటలో 350 ఎకరాలు ప్రత్యేకంగా సాగుచేశారు. అయితే స్థానిక పరిస్థితులపట్ల సంపూర్ణావగాహన లోపించడంవల్ల, ప్రయోగాత్మకంగా వ్యవసాయాన్ని సాగించడానికి తగిన సాంకేతిక పరిజ్ఞానం కల్గినవారు లేకపోవడంవల్ల ఆ ప్రయత్నం విఫలమైంది; 1871లో విరమించబడిందికూడా! తర్వాత సైదాపేటలోనే 1876 లోనే వ్యవసాయ కళాశాల స్థాపించబడింది. తర్వాత 1906లో ఆ కళాశాలను కోయంబత్తూరుకు మార్చారు. వ్యవసాయాన్ని శాస్త్రీయ దృక్పథంతో అర్థంచేసుకోడానికి, ఆచరించడానికి అది ఎంతో ఉపకరించింది.

'నెల్లు' అంటే తమిళంలో వడ్లు అని, నెల్లూరు వడ్లకు ప్రసిద్ధిచెందిన ప్రాంతంగనుక దీనికాపేరు వచ్చిందని ఒక నానుడివుంది. 'నెల్లు' నుంచి 'నెల్లూరు' వచ్చిందనడం ఒక చమత్కారమే అయినా, అందులో కొంత వాస్తవమూ లేకపోలేదు. నెల్లూరు అనేపేరును సార్థకంచేసేవి మొలగొలుకులు ధాన్యం. అయితే ఈ మొలగొలుకులు అతిప్రాచీనమైన పంటకాకపోవడం, నూరేళ్ళ యివతలివంటే కావడం గమనార్హం.

నెల్లూరుజిల్లాలో వందేళ్ళక్రితం— అంటే 1870 ప్రాంతాలలో- రెండు అదున్లు ఉండేవి. 1) పునాస, లేక ముదురు (జూన్-మార్చి), 2) పైరు (జనవరి-ఏప్రిల్). మొదటి అదునులో నైరుతి ఋతుపవనం వల్ల, రెండవ అదనులో ఈశాన్య ఋతుపవనం వల్ల పంటలు పండిస్తుండేవారు. అప్పటికీ యిప్పటికీ ఎంత తేడా వుందో చూడండి! ఇప్పుడు వరి ముఖ్యంగా మూడుకార్లలో సాగుచేయబడుతూంది. ఎడగారు (మే, జూన్ – ఆగస్టు, సెప్టెంబరు), మొదటికారు-లేక మొలగొలుకులకారు—ఖరీఫ్(ఆగస్టు, సెప్టెంబరు – డిసెంబరు, జనవరి), ఆఖరుగా మూడవకారు—రబీ (జనవరి, ఫిబ్రవరి— ఏప్రిల్, మే). ఇతర పంటలకు రెండు అదన్లు మాత్రమే ఉన్నాయి.

శ్రీ డి. వి. ఎస్. రాఘవేంద్రరావు, శ్రీ జి. వెంకటరావు

## పైర్లు, పంటలు-నాడు, నేడు

వంద సంవత్సరాల క్రితం (1870-71) నెల్లూరుజిల్లాలో పునాస లేక ముదురు అదునులో (జూన్-మార్చి) సాగుచేయబడుతుండిన వరి రకాలివి: పిషాణం, పెద్దసన్నవరి, వడసన్నవరి, తిరువన్నగవరి, మొసానం, కాళింగసాంబవ, ఈశ్వర కొర్రు; పైరు సీజనులో (జనవరి-ఏప్రెల్) పెద్దకేసరి, పొట్టికేసరి, పొట్టినల్లవరి సాగుచేసేవారు.

ఈనాడు, అంటే 1976-77లో మొదటి పంట సీజనులో సన్న మొలగొలుకులు, బుడ్డ మొలగొలుకులు, కర్ర మొలగొలుకులు, బల్క్ హెచ్ 9, కొత్త మొలగొలుకులు (9672, 9674); రెండవసీజనులో దొంగనంబర్లు, ఐ ఇ టి 2508; ఎడగారుకు దొంగ నంబర్లు, 2508 సాగుచేస్తున్నారు. కొన్నిచోట్ల ఎడగారు తర్వాత మొలగొలుకు వేయకుండా, నవంబరులో ఐ ఆర్ 20 నారుపోసి వేస్తున్నారు. ఐ ఆర్ 8 మెట్టకాలాకాల్లో సాగవుతున్నది. వరిలో యివిగాక యింకా అనేకరకాలు వ్యాప్తిలోకి వచ్చాయి. కాని చెదురుమదురుగా అతి తక్కువ విస్తీర్ణంలో, ప్రయోగాత్మకంగా సాగుచేయబడుతున్న రకాలు కాబట్టి, వాటిపేర్లు యిక్కడ వుదహరించడంలేదు.

జొన్నకు సంబంధించి పూర్వం పునాస అదునులో పెద్దజొన్న సాగుచేసేవారు; ఇప్పుడు అధికదిగుబడినిచ్చే సి. ఎస్. హెచ్. 1, సి. ఎస్. హెచ్. 5, స్వర్ణ జొన్నరకాలు సాగుచేస్తున్నారు. పూర్వం పైరు సీజనులో పైరుజొన్న వేసేవారు. ఇప్పుడు జొన్న రెండవ పంటగా డి. 340, 168 వేస్తున్నారు.

పూర్వం సజ్జ పునాసలో ముదురులో సాగుచేసేవారు. ఇప్పుడు ఎడగారు, రెండవకారుగా సజ్జ సాగుచేస్తున్నారు. పూర్వం ఒకరకమే వుండేది. ఇప్పుడు నాటురకంతోబాటు, హైబ్రిడ్ రకాలు అధికపంటనిచ్చే విజయకాంపోజిట్ రకాలున్నాయి. ప్రస్తుతం అత్యధిక సంఖ్యాకులు హైబ్రిడ్ రకాలనే సాగుచేస్తున్నారు.

రాగికి సంబంధించి 1870–71లో పునాసలో వెల్లిరాగి లేక బిమిడ్ అనేరకం వేసేవారు. ఇప్పుడు ఎడగారులో గోదావరి అనేరకం; రెండవ పంటగా కళ్యాణి, శారద రకాలు వేస్తున్నారు.

పూర్వం పత్తి పునాసలో వేసేవారు. ఇప్పుడు మొదటిపంటకు వరలక్ష్మి, ఎం. సి. యు. 5. రెండవ పంటకు కృష్ణ వగైరాలు వేస్తున్నారు.

పూర్వం మిరప పునాసలో వేసేవారు; ఇప్పుడు మొదటి, రెండవ పంటలుగా జి 3, జి 5 వేస్తున్నారు. ఈ విధంగా పూర్వంలేని రకాలు వేరుశనగలో టి. ఎం. వి. 2 అని; నువ్వులలో టి.ఎం.వి.1. టి.ఎం.వి. 3 అని; తమలపాకులలో సాదా, బంగ్లా అని; అరటిలో అమృతపాణి, బస్‌రాయ్, బొంగ్లా బొంత అని; ముంతమామిడిలో జి 2 మామిడిఅని; మల్లెపూలలో బొడ్డుమల్లె, రెక్కమల్లె, గుండుమల్లె అని ఇప్పుడు సాగుచేయబడుతున్నాయి. మంచి నిమ్మ, గజనిమ్మ రకాలు అప్పుడూ వుండినాయి. కాని ఇప్పుడు నిమ్మలో కాగజినిమ్మ అని, గజనిమ్మలో సాత్‌గుడి అని సాగుచేయబడుతున్నాయి.

నాటి నేటి పంటల విస్తీర్ణం, దిగుబడుల వివరాలను తెలియజేసే పట్టీ చూడండి—

## పంటల విస్తీర్ణం : దిగుబడి

| పంట | నాడు (1870-71) మొత్తం విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం దిగుబడి పుట్లలో | ఎకరా దిగుబడి తూముల్లో | నేడు (1975-76) మొత్తం విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం దిగుబడి పుట్లలో | ఎకరా దిగుబడి తూముల్లో |
|---|---|---|---|---|---|---|
| వరి | 2,35,052 | 1,78,526 | 15½ | 4,92,000 | 4,07,500 | 19 |
| జొన్న | 3,63,887 | 67,430 | 4½ | 1,32,000 | 4,47,200 | 6½ |
| సజ్జ | 69,811 | 11,674 | 5½ | 48,000 | 28,640 | 11½ |
| రాగి | 41 089 | 27,517 | 9½ | 31,200 | 22,370 | 14 |
| ప్రత్తి | 12,616 | 1,262 | 2 | 2.400 | 224 | 2 |
| మిరప | 3,876 | 1,938 | 2 | 19,200 | 7454 | 7½ |
| పొగాకు | 2,930 | 1,467 | 2 | 33,600 | 12,430 | 7½ |
| వేరుశనగ | — | — | — | 52,800 | 28,570 | 10 |
| నువ్వులు | 205 | 11 | 1 | 4,800 | 1243 | 2½ |
| తమలపాకులు | 11 | 2200 గంపలు | 200 గంపలు | 7,680 | 1,38,24,000 గంపలు | 1800 గంపలు |
| నిమ్మ, గజనిమ్మ | — | — | — | 8,162 | 2448600000 కాయలు | 300000 కాయలు |
| అరటి | — | — | — | 1,334 | 10,67,200 గెలలు | 800 గెలలు |
| మల్లెలు | — | — | — | 701 | 43,00000 లీటర్లు | 6000 లీటర్లు |
| కీడి | — | — | — | 682 | — | — |

(ఒక పుట్టి 850 కిలోగ్రాములు. ఒక తూము 42 1/2 కిలోగ్రాములు. విస్తీర్ణం దిగుబడి మొత్తం పంటలకు కలిపి యివ్వబడింది.)

### వ్యవసాయ పనిముట్లు

1870-71 లో నాగలి, గొర్రు, గుంటక, జడ్డిగం, దిండు, పండ్లమాను, నల్లమాను, గడ్డపార, చెలగపార, కొడవలి, పావడం, దోకుడప్పర అనేపేర్లతో వ్యవసాయ పనిముట్లు వుండేవి.

ఈనాడూ యివన్నీ వున్నాయి. అయితే వ్యవసాయం క్రమంగా యాంత్రీకరణం అవుతున్నది. ట్రాక్టరు, ప్లవర్ టిల్లర్, డిస్కుపవ్, కల్టివేటర్, కేజ్‌వీల్ (సింగిల్, డబుల్), పడ్లర్, ఇనప నాగలి అదనంగా వచ్చాయి.

ఆరోజుల్లో వర్షమే ముఖ్యాధారం; భూ జల సంపదను సద్వినియోగపరచుకోవడం అనేది లేని అమాయకపురోజులవి. అదే ఈనాడు నెల్లూరుజిల్లాలో 11, 159 ఫిల్టర్ పాయింట్లు, 17800 బావులు, 11, 713 ఎలక్ట్రిక్ మోటార్లు, 10, 396 ఆయిలు ఇంజన్లు వున్నాయంటే ఈ నూరేళ్ళలో ఎంత ప్రగతిసాధించామో ఊహించుకోవచ్చు.

### విత్తనాలు : ఎరువులు

అప్పట్లో పంటదిగుబడి అంతంతమాత్రంగా వుండేదంటే అందుకు విత్తనాలు, ఎరువులుకూడా కారణమే. విత్తనాలవిషయంలో శాస్త్రీయమైనదృష్టి ఆనాడు ఎక్కడుండేది? ఎరువులు ఆనాడు పరిమితమేకదా? పశువులఎరువు, పాటిమన్ను, చెరువు మట్టి తప్ప చెప్పుకోదగిన ఎరువులంటూ వుండేవికావు. ఈనాడు ఆ ఎరువులుకాక, యింకా కంపోస్టు, సేంద్రియపుఎరువులు, రసాయనికపు ఎరువులు విస్తారంగా వాడుకలోవున్నాయి. ఇప్పుడు నెల్లూరు రైతాంగం సాలుసరి వాడుతుండే రసాయనికపుఎరువుల వివరాలు చూడండి–

| ఎరువులు | 1971-72 | 72-73 | 73-74 | 74-75 | 75-76 |
|---|---|---|---|---|---|
| | (మెట్రిక్ టన్నులలో) | | | | |
| నత్రజని ఎరువులు(N) | 8514 | 7081 | 7811 | 7184 | 10159 |
| భాస్వరపు ఎరువులు(P) | 3396 | 3257 | 3472 | 3151 | 2028 |
| పొటాష్ ఎరువులు(K) | 277 | 1040 | 1802 | 2022 | 944 |

### సస్యరక్షణ

వందేళ్ళనాడు రైతులు తక్కువ దిగుబడినిచ్చే రకాలు వేస్తుండేవారు. రసాయనికపు ఎరువులెట్లాంటివో ఎరిగినవారు కాదు; పశువుల ఎరువు కూడా తగినంతగా లభ్యమయ్యేదికాదు. అందువల్ల పురుగులు తెగుళ్ళు పంటలను ఎక్కువగా ఆశించేవి కావు. ఎక్కడైనా పురుగులు తెగుళ్ళు ఆశిస్తే, అవి గాలిపాటువల్ల సోకిందనుకొనేవారు; గ్రామదేవతల ఆగ్రహంఅని నమ్మి జాతరలు గీతరలు జరిపేవారు. ఐతే కొంతమంది రైతులు పొగాకు కషాయం, మరికొందరు వేపకషాయం లేదా పైరత్రం కషాయం చల్లేవారు.

ఇప్పుడు అధికదిగుబడిరకాలు వేయడం, వాటికి తగినంత సేంద్రియపుఎరువులు, నత్రజని ఎరువులు వాడడం, మొక్కలు దగ్గరదగ్గరగా వుండడం, గాలిపారక మొక్కలమధ్య తేమ ఎక్కువకావడం, మొక్కలు బలంగా వుండడంవల్ల పంటలకు అనేక రకాలైన పురుగులు తెగుళ్ళు ఆశిస్తున్నాయి. వాటిని నివారించడానికి అనేకరకాలైన మందులు వాడుతున్నారు. ఒకప్పుడు ఈ మందులు సక్రమంగా తెలియకపోవటంవల్ల, పురుగులను తెగుళ్ళను అరి

కట్టడం కష్టసాధ్యంగా ఉండేది. ఐతే ఇప్పుడు వాతావరణ పరిస్థితుల ననుసరించి ఏయే ప్రాంతాల్లో ఏయేపంటకు ఏయేమందులు చల్లాల్సింది ముందుగానే పత్రికలద్వారా, రేడియో ద్వారా తెలియజేస్తున్నారు. అనలహాలను పాటించీ, కొత్తగావచ్చిన పవర్ స్ప్రేయర్లు, డస్టర్లు వగైరాలతో, రైతులు సకాలంలో పురుగులు తెగుళ్లను అరికట్టగలుగుతున్నారు. ప్రస్తుతం నెల్లూరు జిల్లాలో అందుబాటులోవున్న సస్యరక్షణ పరికరాలు ఇవీ–

మొలగొలుకు), ఇదిగాక రెండవ పంటకు సి.ఐ. 20 (దొంగమొలకొల్లు) విడుదల చేశారు.

ఈ పరిశోధనాస్థానాన్ని 1961 లో నెల్లూరికి మార్చారు. తర్వాత బల్క్‌హెడ్ 9 రకాన్ని విడుదల చేశారు. ఆరకం యిప్పుడు జిల్లాలో 90 శాతం విస్తీర్ణంలో పండించబడుతూంది. ఐతే పైన తెల్పిన రకాలకు అగ్గితెగులు సోకి పంట దిగుబడి తగ్గడం వల్ల, అగ్గితెగులుకు తట్టుకుని అధికదిగుబడినిచ్చే

పరికరాలుఉన్న ప్రదేశాలు

| పరికరం | వ్యవసాయ డిపో | కోఆపరేటివ్ సంస్థలు | పంచాయితీ సంస్థలు | పంచాయితీ సమితులు | సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ | రైతులు | మొత్తం పరికరాలు |
|---|---|---|---|---|---|---|---|
| పవర్ స్ప్రేయర్లు | 129 | 15 | 16 | 34 | — | 60 | 254 |
| స్ప్రేయర్లు | 460 | 49 | 609 | 846 | 20 | 1120 | 3180 |
| పవర్ డస్టర్లు | 1 | — | — | — | — | — | 1 |
| డస్టర్లు | 69 | 9 | — | 143 | — | 24 | 245 |
| మొత్తం | 657 | 73 | 705 | 1023 | 70 | 1204 | 3682 |

## వ్యవసాయపరిశోధన

ప్రకృతిసిద్ధంగా లభించే వనరులను ఆధునిక సాంకేతిక విజ్ఞానంతో మేళవించి వ్యవసాయాన్ని కొనసాగించినప్పుడే అభివృద్ధి అనేది సాధ్యమవుతుంది. వ్యవసాయంలో క్రొత్తక్రొత్త పరిశోధనలు, ప్రయోగాలు చేయడం, వాటిఫలితాలను ఎప్పటికప్పుడు రైతాంగానికి అందజేయడం ముఖ్యం. అందుకే ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం ప్రతి ప్రాంతంలోనూ పరిశోధనాస్థానాలు నెలకొల్పి, ప్రాంతీయ సమస్యలను పరిష్కరిస్తూ, అధికోత్పత్తిని సాధించడానికి కృషి చేస్తూంది. నెల్లూరుజిల్లాలో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా నెల్లూరులో ఒక ప్రాంతీయ వరి పరిశోధనాస్థానం, పొదలకూరులో చిరుధాన్యాల పరిశోధనాస్థానం, కావలిలో పొగాకు పరిశోధనాస్థానం, చింతలదేవిలో పశుగణాభివృద్ధి కేంద్రం నెలకొల్పబడ్డాయి.

నెల్లూరు– ప్రాంతీయ వరి పరిశోధనాస్థానం తొలుత 1937లో బుచ్చిరెడ్డిపాళెంలో స్థాపించబడింది. ఈ పరిశోధనాస్థానంలో మొదటి ప్రాంతీయ వరిరకాలను అభివృద్ధిచేసి ఏడురకాలను విడుదలచేశారు. అవి–బి. సి. పి. 1 (సన్న మొలగొలుకులు), బి. సి. పి. 2 (బుడ్డమొలగొలుకులు), బి.సి.పి. 3 (ఆత్రగడ్డ), బి. సి. పి. 4 (పిషాణం), బి. సి. పి. 5 (సన్నవడ్లు), బి. సి. పి. 6 (కర్ర

కొత్తమొలగొలుకులు సృష్టించడానికి 1965 నుంచి పరిశోధన సాగుతూంది. ఆ కృషి ఫలితంగా బల్క్‌హెడ్ 9 అనే మొలగొలుకు రకాన్ని, అగ్గితెగులుకు పూర్తిగా తట్టుకొనగల్గి మలేషియారకం 'మిల్లిక్ కురింగ్'తో సంకరపరచి, రెండు కొత్త రకాలను (9672, 9674) సృష్టించి రైతులకు అందజేశారు. అగ్గితెగులుకు తట్టుకొని, అధికదిగుబడినిచ్చే ఈ రకాలు 1976–77లో నెల్లూరు జిల్లా రైతాంగం 75 వేల ఎకరాలలో సాగుచేశారు. ప్రతిచోటా బల్క్‌హెడ్ 9 కంటే అధికదిగుబడి నిచ్చినట్టు తెలిసింది.

దేశ విదేశాలనుండి వచ్చిన కొన్నివేల వరిరకాలను ఇక్కడ పరీక్షించి, వాటిలో అగ్గితెగులు వగైరా చీడపీడలకు పూర్తిగా తట్టుకొని అధిక దిగుబడులనిచ్చే 4 రకాలతో మన మొలగొలుకును సంకరపరచి, పైరకాలకంటే మేలైన వాటిని సృష్టించడానికి నిర్విరామంగా కృషిజరుగుతూంది.

నెల్లూరులో నవంబరు ఆఖరువారంనుండి ఫిబ్రవరి నెలాఖరుదాకా అగ్గితెగులు అభివృద్ధికావడానికి అనువైన వాతావరణ పరిస్థితులున్నట్లు పరిశోధనలో తేలింది. దేశం మొత్తంమీద అగ్గితెగులు ఇంత ఉధృతంగా సోకేప్రదేశం మరొకటిలేదు. నెల్లూరు పరిశోధనాస్థానంలో అగ్గితెగులును అరికట్టేమందులు అనేకం పరీక్షించబడ్డాయి. వాటిలో బెన్‌లేట్, ఫాస్ఫెల్, హినోసాన్ తెగులును నివా-



కోవూరుతాలూకా చెలాయపాలెంలో
35 తలల అరుదైన తాటిచెట్టు
-ఫోటో శ్రీ ఎ. జగదీశ్

రిస్తున్నాయి. అగ్గితెగులు ప్రమాదాన్ని వాతావరణాన్నిబట్టి ముందుగా తెలుసుకొని రైతులను హెచ్చరించేందుకుకూడా ప్రయోగాలు సాగుతున్నాయి.

పొదలకూరు చిరుధాన్య పరిశోధనాస్థానం 1965 లో స్థాపింపబడింది. అక్కడ చీడపీడలకు తట్టుకొని నిల్చి అధిక దిగుబడినిచ్చే చిరుధాన్యాలను సృష్టించడానికై పరిశోధనలు జరుగుతున్నాయి. జొన్నలో డి. 340, 148 అనే కొత్త అధికదిగుబడి రకాలను సృష్టించారు. 'వరద' అనే అధికదిగుబడి వరిగరకాన్నికూడా సృష్టించారు.

1970 లో కావలిలో పొగాకు పరిశోధనాస్థానం ఏర్పాటు చేయబడింది. నెల్లూరుజిల్లా భూములు పొగాకు పంటకు ప్రశస్తమైనవిగా ఆ పరిశోధనాస్థానంలో కనుగొనబడింది. ఇప్పుడు జిల్లాలో పొగాకు విస్తారంగా పండించబడుతూంది; ఏటేటా విస్తీర్ణం పెరుగుతూవుంది కూడా. పొగాకులో అధిక దిగుబడి సాధించడానికి వివిధ రకాలైన యాజమాన్యపు పద్ధతులమీద అక్కడ పరిశోధన సాగుతూంది.

చింతలదేవి పశుగణాభివృద్ధి కేంద్రంలో మేలు రకం పశువులను సృష్టించేందుకు కృషి జరుగుతూంది.

మొత్తంమీద నెల్లూరుజిల్లా వ్యవసాయరంగం దినదినాభివృద్ధి చెందడమేగాక కొత్తపుంతలు తొక్కుతూ ముందుకు సాగుతూంది. ★

# మెకంజీ సేకరించిన ఒక నెల్లూరు కథ?

నెల్లూరు అనే పదానికి అర్థమేమైనా వుందా? అర్థంపర్థంలేని వట్టి అక్షరగుచ్ఛమేనా అది? ఊర్ల పేర్లు అనేవి ఊరకే ఆకాశంలోంచి ఊడిపడ్డవి కావుగదా. ''గ్రామనామాలను వివరించినవాడే సర్వజ్ఞుడు''– అని కీ.శే. వేదం వేంకటరాయశాస్త్రి వూరకే అన్నాడా? ఆ సర్వజ్ఞత్వం మనలో వుండాలే గానీ ఒక్కో వూరు పేరు వెనుక ఎంతో అంతరార్థం గోచరిస్తుంది.

నెల్లూరు అంటే నెల్లు+ఊరు అని పదవిభజన చేసి, నెల్లు అంటే ద్రావిడభాషల్లో వరి అనే అర్థం గనుక వరిపండేవూరు నెల్లూరు అనే తాత్పర్యం చెప్తారు నామవేత్తలు. నెల్లి అంటే ఉసిరికచెట్టు అనే అర్థంచూపి ఒక మిడీవియల్ సెమిమైథలాజికల్ కథనుచెప్పి తాత్పర్యాలు లాగేవారుకూడా లేక పోలేదు.

నెల్లూరు చరిత్రకు సంబంధించిన కథవొకటి నా ఇటీవలి ఔత్సాహిక పరిశోధనలో కనపడ్డది. ఈ కథ వెనుకవుండే కథాకమామీషు కావాలంటే బోలెడంత వుంది. అయితే ఆ తీరికా వోపికా ప్రస్తుతం నాలోలేవు. నెల్లూరుకు సంబంధించి నెల్లూరు పూర్లకు సంబంధించి మెకంజీ మహానుభావుడు సేకరించిన కైఫీయత్తులు వుండడానికేమో వందలాది పేజీలున్నాయి. మనకు లేనిదల్లా ఇవన్నీ చూచి నిగ్గుతేల్చి చెప్పగలిగిన స్వామ్యమే. నేను ఇప్పటివరకు చూడగల్గింది కొన్నిపదుల పేజీలు మాత్రమే. వెంకటగిరి ఊర్లకు సంబంధించిన కైఫీయత్తులు, దానపత్రాలు వగైరా మతలబులు గురించి మెకంజీ మరాఠా గుమాస్తా నారాయణరావు రిపోర్టులు కొన్నిచూశాను. వీటిల్లో మననెల్లూరు సంబంధించిన చరిత్రశకలాలు చాలానే వున్నాయి. ఇటీవలే స్వర్గస్థులైన నేలటూరి వెంకటరమణయ్య పేరు మీద చలామణిలోవున్న 'వెలుగోటివారి వంశావళి', 'హైదరు చరిత్ర' అనే రచనలు మెకంజీ (పొ॥గా)

---

**Descriptive and Historical Sketches**



OF

CITIES AND PLACES

IN THE

**DEKKAN,**

TO WHICH IS PREFIXED,

*AN INTRODUCTION,*

CONTAINING A BRIEF DESCRIPTION OF

THE SOUTHERN PENINSULA,

AND

**A succinct History of its ancient Rulers:**

THE WHOLE BEING INTENDED TO SERVE AS A BOOK OF REFERENCE TO

*A MAP OF ANCIENT DEKKAN.*

DEDICATED, WITH PERMISSION,

TO

THE HON'BLE SIR CHAS. EDWARD GREY, Kt.

*Chief Justice of the Supreme Court of Judicature in Bengal.*

BY

CAVELLY VENKATA RAMASWAMI,

*Head Translator and Pundit in the Literary and Antiquarian Department.*

**Calcutta:**

SOLD BY MESSRS. W. THACKER AND CO. ST. ANDREW'S LIBRARY.

1828.

కావలి వెంకటరామస్వామి 1828 లో ప్రచురించిన 'డిస్క్రిప్టివ్ అండ్ హిస్టారికల్ స్కెచెస్ ఆఫ్ సిటీస్ అండ్ ప్లేసెస్ ఇన్ ది దక్కన్' ముఖపత్రం.

పునఃసేకరణ :

బంగోరె



బం గో రె

సేకరణల్లో నుంచి 'దొంగిలించి', వాళ్ళ పేర్లు చెప్ప కుండా ప్రకటించుకొన్నట్టివే! ఈ మెకంజీ సార స్వతంలోని చాలాభాండికలు ఇంకా అసూర్యంపశ్య లుగానే పడివున్నాయి. ఇందుక్కారణం మన సోకాల్డ్ చరిత్రకారుల్లో కరుడుగట్టివున్న అజ్ఞానం.

నా చెదురుమదురు పరిశోధనలో కనవచ్చ నెల్లూరు కథను వదిలి చాలాదూరమే కాలావంక్ర మతుం చేసాను. అక్కడాలు. ఈ కథ కావలి వెంకట రామస్వామి 1828 లో కలకత్తాలో ముద్రించిన దక్కన్ నగరాలకు సంబంధించిన ఒక ఆంగ్ల గ్రంథంలోది. ఈ దక్కన్ నగరాలచరిత్ర గ్రంథం వచ్చిన ఒక సంవత్సరం తర్వాత ఇదే కావలి వెంకటరామస్వామి ఇదే మూసలో దక్కన్ కవుల చరిత్ర అనే మరో ఆంగ్ల గ్రంథాన్ని ప్రకటించాడు.

ఈ కథవున్న గ్రంథం కలకత్తా నేషనల్ లైబ్రరీలో శిథిలావస్థలో వుంది. నేనుచూచిన మరే పెద్ద చిన్న గ్రంథాలయంలోనూ దీనికాపీ కాన రాలేదు. కనుక ఇదిదాలా రేర్ బుక్ గానే భావించ వలసివస్తున్నది. బం గో రె దీనికి మైక్రోఫిల్మ్ కాపీ ఒకటి తీసుకొచ్చాడు. ఇది ప్రస్తుతం నేను పని చేస్తున్న శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని సి. పి. బ్రౌన్ ప్రాజెక్టులో వున్నది. ఈ మైక్రో ఫిల్మ్‌లోంచి టైటిల్ పేజీని, నెల్లూరు కథాభాగాన్ని ఫోటో ముద్రణ చేయించి ఆ పేజీలను యథా తథంగా ముద్రిస్తున్నాను. చదవండి. చదివి మీమీ నిర్ణయాలకు మీరుగానేరాండి. మధ్యనేనెవర్ని?

ఒక్క విషయం మాత్రం చెప్పి ముగిస్తాను. ఈ కథలో ప్రస్తావనకొచ్చిన బావి, ఇప్పుడు మనం అనుకొనే వేమాలసెట్టి బావేనా? ఎవరీ వేమాల సెట్టి? ఈ నెల్లూరు కథానాయకుడైన వేసాలమారు (వేసలమరు) వేమాలసెట్టిగా మారాడా? సి. పి. బ్రౌన్ మనకు మిగిల్చిపోయిన డిక్షనరీ నోట్సు సంపుటాల్లో 'సెట్టి' కానరాదు. 'వేమ' అనే పదం ప్రక్కన ఆయన సొంత అక్షరాలతో వ్రాసిపెట్టు కున్న నోట్సులో నెల్లూరులో వున్న వేమాల బావి అనిమాత్రమేవుంది. మధ్యలో ఈ సెట్టి ఎట్లా వచ్చాడు? కన్యకాపరమేశ్వరి పూజలు ఎట్లా వచ్చాయి? ఈ ప్రశ్నలను భావి చరిత్రకారులకు వదిలిపెడుతూ ప్రస్తుతానికి శలవు. చదవండి ఇంగ్లీ షులోవున్న అకథనూ, అనువాదాన్నీ:

**NELLORE.**

A town in the Karnatic, situated about a furlong to the eastward of the river Penna. The present town was founded near the old one by Vesalamaru, a thatcher and vender of hut-roofs, under the following remarkable circumstances: —The country round Nellore, though under the dominion of the Golconda princes, was at the time in a state of anarchy and confusion, there being no legal authorities to redress grievances, or to correct abuses. When Vesalamaru, therefore, brought his commodities for sale, the inhabitants plundered him of his goods, without paying any thing at all for them; and the place being devoid of any local officer to take cognizance of offences, Vesalamaru found no one to give heed to his complaints. After he had suffered repeated losses in this way, he resor ted to an expedient, boldly conceived, to procure the administration of justice in his native country; and the event proved that the end justified the means. Being a hale, lusty fellow, he took a stout cudgel, and daily stationed himself at a well near old Nellore, and levied a toll from every one that came to draw water, that he could overpower; and as this was the only place that the inhabitants could procure water to drink, Vesalamaru amassed considerable wealth; and urged by the best of motives, was determined to bring himself to the notice of the king of Golconda, which he effected in this manner. The water of the aforesaid well was of such excellent quality, that it was served at the tables of the princes of Golconda, and the servants of the palace used to come at stated times to draw for it. Vesalamaru had hitherto allowed them to do so unmolested, until having rea-

## నెల్లూరు

పెన్నానదికి తూర్పుదిశగా దాదాపు ఫర్లాంగు దూరంలో, కర్నాటక రాజ్యంలోని ఒక పట్టణం. విడవలినేతగాడూ అమ్మకందారూ అయిన వేసాల మారు అనేవ్యక్తి కొన్ని చిత్రమైన పరిస్థితులలో, పాతపట్టణం సమీపాన్నే ఇప్పటి పట్టణాన్ని నిర్మిం చాడు. నెల్లూరు పరిసర ప్రదేశం గోల్కొండ రాజ్యంలో చేరిందే అయినా, ప్రజల బాధలు తీర్చే నాథుడుకానీ, వారితప్పులు సరిదిద్దే అధికారికానీ లేక, ఆ కాలంలో అరాచకంగా గందరగోళంగా ఉండేది. వేసాలమారు తనసరుకును అమ్మకానికి తెచ్చినప్పుడు స్థానికులు వాటికి మూల్యమే చెల్లించ కుండా, దోచుకొన్నారు. అది నేరవిచారణ జరిపే స్థానికాధికారులెవరూలేని ప్రాంతం కావడంవల్ల, వేసాలమారు గోడు వినేవారే లేక పోయారు. ఈతడావిధంగా మాటిమాటికి నష్టానికి గురిఅయి,

కరతకు తన వ్యవస్థలంలో న్యాయపరిపాలన జరగ దానికొక సాహసోపేతమైన క్రొత్తమార్గాన్ని అను సరించాడు. అతడనుసరించినమార్గాన్ని లక్ష్యసిద్ధి సమర్థించిందని ఆ సంఘటన నిరూపించింది. అతడు మొండి దిట్టమైన మనిషి కావడంవల్ల, ప్రతిరోజూ పాతపట్టణం సమీపానవున్న బావివద్ద పెద్దకొరడా పుచ్చుకొని నిలబడి, నీళ్ళకువచ్చివాళ్ళలో తాను లోబరచుకోగలవారందరినుండీ సుంకం వసూలు చేసేవాడు. అక్కడి ప్రజలకు అనేక్కకే మంది నిజబావి కావడంచేత, వేసాలమారు పెద్దమొత్తాన్నే ఆర్జించాడు. తనసంగతి గోల్కొండ ప్రభువు దృష్టికి రావాలనే సదుద్దేశంతో అతనీ విధంగా చేశాడు. ఆబావి నీరు ఎంతో బాగుండేది గనుక, గోల్కొండ రాజులుకూడా ఆ జలాన్నే త్రాగేవారు. ఆ నీరు తీసుకపోవడానికి రాజసేవకులు నిర్ణీత వేళల్లో వస్తుండేవారు. వేసాలమారు అంతులేని సంపద నార్జించి, రాజసముఖానికి వెళ్ళాలనేకోరిక కల్గేదాకా, వారిని ఏమీ పీడించకుండా, నీళ్ళు తీసుకపోనిచ్చాడు. రాజసేవకులు నీళ్లకు వచ్చినపుడు అతడు తనదండాన్ని ఝళిపిస్తూ, ఆ బావి తన సొత్తు అని, ఈ ప్రపంచంలోని ఏఇతరరాజూ సుంకం చెల్లించకుండా నీళ్ళుతీసుకపోరాదని అన్నాడు, అను కొన్నట్లే, వేసాలమారును రాజసేవకులు లోబరచుకొని, బంధించి గోల్కొండకు తీసుకవెళ్ళారు. అక్కడ రాజు ప్రశ్నించినప్పుడు అతడీ క్రింది విధంగా ప్రసంగించాడు. ''ఓ మహాప్రభో! మీ రాజ్యం కలకాలం వర్థిల్లుగాక! మీ ఘనతవహించిన రాజ్యాంతన్నీ న్యాయపరిపాలనాదక్షులైన అధికారుల క్రిందవుండగా, నా స్వదేశంలోమాత్రం అరాచకాన్ని అశాంతిని దోపిడీని నిరోధించే న్యాయాధికారి ఒక్కరూలేరు. అత్యంతశక్తివంతుడవైన ఓ ప్రభూ! ఆక్రమాలను విచారించి సంజాయిషీ అడిగేవాళ్ళే లేకనే ధైర్యంతో గుండెబలిసిన బాట్లయిన దోపిడీగాళ్ళు విడవలి నేతగాణ్ణయిన ఈ పేదవాడి సరుకులు దోచుకునేవారు. గత్యంతరంలేక, నేను ఆ కాలపరిస్థితులను అవకాశంగా తీసుకొని, నెల్లూరుబావికి ఒంటరిగా నీళ్ళకువచ్చే ఆ నీతిమాలినవారిమీద సుంకం విధించాను. నా దేశస్థితిని తమదృష్టికితేవాలనే ఆశతో, మీ సముఖానికిరావాలనే కోరికతో మీ సేవకులనుసైతం ఎదిర్చాను. మహాప్రభో! ఇప్పుడు నాకోరికనెరవేరింది. దండుగలుగా వసూలుచేసిన మూడు లక్షల హున్నులు తమరు ఆజ్ఞాపించినవెంటనే తమపాదాల ముందు సమర్పించుకొంటాను''. వేసాలమారు నడవడికకు గోల్కొండరాజు సంతోషించి, అతడు పట్టణ ప్రజలనుండి దండుగ వసూళ్ళద్వారా ఆర్జించిన ధనాన్ని అతడికి బహూకరించాడని; దేశాన్ని పాలించేందుకు, ప్రజలను క్రమబద్ధులను చేసేందుకు తగిన అధికారులను నియమించాడని చెప్పుకొంటారు. వేసాలమారు తాను సంపాదించిన సంపదతో, పాతపట్టణ ప్రాంత సమీపంలో కొత్తనెల్లూరు పట్నాన్ని నిర్మించాడు. 1801లో బ్రిటిష్ సైనికుల రక్షణ యేర్పాటు అయ్యేవరకు నెల్లూరు కోటశిథిలావస్థలో వుండేది. పట్టణంలో రెండు పెద్దవీధులున్నాయి; అందులో ఒకదానిలో బజారు, ఇంకొకదానిలో ప్రభుత్వభవనాలు, కులీనుల గృహాలు ఉన్నాయి. ఇవిగాక కొన్ని ఇరుకు గొందులున్నాయి; దక్షిణ ద్వారంనుండి ఉపవనం మీదుగా రంగనాయకపేటకు వెళ్ళే మార్గంఉంది. ఆ మార్గానికిరువైపులా బ్రాహ్మణుల నివాసంకోసం కోటూరి నరసయ్యఅనే రెవిన్యూ అధికారి బారుగా ఇళ్ళుకట్టించాడు. ఈ ప్రదేశంలో ఆదిశేషువుపై మేనువాల్చిన రంగనాథుని విగ్రహంకల్గిన ఆలయం ఉంది. ఆ గోపురకుడ్యాలమీద అనేక శాసనాలు చెక్కబడివున్నాయి. నవాబుపేటలోని వర్తకులు విరామమెరుగకుండా పెద్దయెత్తున ప్రత్తివర్తకంచేస్తున్నారు. ఈ పట్టణప్రజలు ఇజారి అనే ఒకరకం ముతకగుడ్డను ఉత్పత్తి చేస్తున్నారు; అందులో అధికభాగం ఎగుమతిచేస్తున్నారు. 1787 లో ఈ పట్టణానికి సమీపాన అద్భుతమైన రోమకబంగారు

( 34 )

lis. great riches, and desirous of being brought to the presence of the king; when the royal domestics came for water, he began to flourish about his stick, and told them the well was his property, and no *other* king on the earth should have the water without paying the tribute. As it may be supposed, Vesalamaru was soon overpowered, and carried bound to Golconda; and being interrogated by the king made the following speech. "Oh glorious monarch! may your prosperous reign continue long, and your mighty actions be recorded. While the rest of your Majesty's happy dominions is governed by officers that compel a due observance of the laws, my native country has not a single magistrate to prevent lawless plunder and acts against the peace: thus it was, Oh mighty potentate! that I a poor thatcher and vender of hut-roofs, had my goods pillaged continually by a fearless rabble, who were not in dread of being called to an account for their misdeeds. Having no alternative, I took advantage of the times, and circumstance, and levied an impost on my unjust countrymen, when they came singly to the well of Nellore; and being ambitious to make the state of my country known to your royal person, I attacked your servants, in order to be brought to your Majesty's presence—and lo! here I have attained what I desired. I have, O gracious king! three lacs of Hons, the fruits of my extortions, ready to lay at your Majesty's feet when you command me." It is said, that the king of Golconda was well pleased at the conduct of Vesalamaru, and presented him with the money he had acquired from his townsfolks, and appointed proper officers to rule the country, and keep the inhabitants in order. Vesalamaru laid out the riches he procured in building the new town of Nellore, near the site of the old one. The fort of Nellore was in ruins till it was garrisoned by British troops in 1801. The town consists of two long streets, in one of which is the market, and in the other the public buildings and houses of respectable people: besides these, there are some narrow lanes, and a road leading from the southern gate through an avenue to Ranga Naik Pettah, with two rows of houses built for the accommodation of Bramins, by a revenue officer named

( 35 )

Koturi Narasia. In this place is a temple of Ranga naik, with an image of Raganauth, reclining on a couch formed by a coiled snake. There are many inscriptions engraved on the walls of the pagoda. A large quantity of cotton is continually sold by the dealers in the Nawab Pettah, and the natives of this town manufacture the Coast cloths called Izaree, extensive investments of which are exported. In 1787, a labourer discovered near this town, some Roman coins of the purest gold: many were melted down, but between 30 and 40 pieces were fortunately saved: they were mostly Trajan's, Adrian's, or Faustina's.

---

*List of the Kings and Fouzdars who ruled over Nellore.*

Mukantiswer,
Ranadhira,
Manodhira,
Nanda Raja,
Jayana Raja,
Chola Raja,
Ambhoja Raja,
Pratapa Rudra,
Manava Sidiraja,
Talavareddi,
Tikkanaik,
Mana Gopala,
Dandinajana,
Somadeva,
Kampila Naida,
Vasala Muri,
Podili Lingappa,
Velugoti Yachama Naidu,
Juleep Takallikhan,
Mutuf Subedar,
Satullakhan,
Anavardi Khan,
Suiagi Sha,
Abdullaha Khan,
Barakutulla Khan,

r 2

( 36 )

Mahommud Kamel,
Najabulla Khan,
Kagitulla Khan,
Mahommud Malik Asalam,
Nasaradowla,
Nurumahommud Khan,
Kutubudi Khan,
Nugulapati Venkata Raio,
Bolla Venkat Royulu,
Nurumahommud Khan;
Nasar Mahommud Khan.

నాణాలు కొన్ని ఒక కూలివాడికి దొరికాయి. వాటిలో చాలావరకూ కరిగించివేయబడ్డాయికానీ, అదృష్టవశాత్తు షుమారు 30, 40 నాణాలు రక్షింప బడ్డాయి. అవి ఎక్కువగా ట్రోజన్, డ్రెయిన్, ఫాస్టినాలకు సంబంధించినవి.

## నెల్లూరును పాలించిన రాజులు ఫౌజుదార్లు

ముకంటీశ్వర్,
రణధీర,
మనోధీర,
నందరాజ,
జయనరాజ,
చోళరాజ,
అంభోజరాజ,
ప్రతాపరుద్ర,
మనవసిదిరాజ,
తాళవరెడ్డి,
తిక్కనాయక్,
మానగోపాల,
దండినజన,
సోమదేవ,
కంపిలనాయిడ,
వాసలమూరి,
పొదిలిలింగప్ప,
వెలుగోటి యాచమనాయుడు,
జూలీప్ తకల్లీఖాన్,
ముతుఫ్ సుబేదార్,
సతుల్లాఖాన్,
అనవర్దిఖాన్,
సుయగిషా,
అబ్దుల్లాఖాన్,
బరకుతుల్లాఖాన్,
మహామద్ కమాల్,
నజబుల్లాఖాన్,
కగితుల్లాఖాన్,
మహామద్ మాలిక్ అస్లాం,
నసరదౌలా,
నూరుమహామద్‌ఖాన్,
కుతుబుదీఖాన్,
నాగులపాటి వెంకటరావు,
బొల్లా వెంకటరాయులు,
నూరుమహమ్మద్‌ఖాన్,
నాజర్ మహమ్మద్‌ఖాన్.

★

ఉత్తర దక్షిణ సంప్రదాయ వారధి—

# నెల్లూరు శిల్ప పెన్నిధి

శ్రీ ఇంగువ కార్తికేయశర్మ

ఆంధ్రదేశంలో నెల్లూరుమండలం ఒక ప్రత్యేకతను సంతరించుకొనివుంది. చరిత్ర పూర్వయుగంనుండికూడా గోదావరి-కృష్ణాతీర సంస్కృతులకు చేరువుగావుంటూ, అటు దక్షిణప్రాంత సంప్రదాయాల మేలును కలయిక చేసుకొని విలక్షణమయింది.

ఇటీవరలో-అంటే 19 శతాబ్ది చివరిభాగంలో-బ్రూస్ ఫూట్, డాక్టర్ ఫ్రాంక్ పి. మాన్లే పండితులు నెల్లూరు జిల్లాలో అనేక రాతియుగపు పరికరాలను కనుగొని, ప్రాచీన మానవుని సంస్కృతి జీవనరీతులనుగూర్చి తెలియజెప్పారు. ఆనాటి మానవుని ఉనికిని, పరిసరాలను, నైసర్గిక పరిస్థితిని చక్కగా సమన్వయపరచి సమగ్రంగా పరిశోధించే వుద్దేశంతో ఇటీవల డాక్టరు బెనర్జీ, శ్రీ టి. ఎస్. ఆర్. మూర్తి నెల్లూరు జిల్లాలో-ముఖ్యంగా ఆత్మకూరు, గూడూరు, రాపూరు, సూళ్ళూరుపేట, ఉదయగిరి, బిట్రగుంట, కావలి, కోవూరు ప్రాంతాలలో-పర్యవేక్షణ జరిపారు. ఆ పరిశోధనల ఫలితంగా పాతరాతి యుగపు మానవుని జీవిత విధానం, అతడు వాడిన ఆయుధసామగ్రి విస్తారంగా లభ్యమయింది. చిట్టేడు, గూడలి కొండలు, విరదవాడ భూపతయ్య కొండల నడుమ మధ్యరాతియుగపు పనిముట్లు విరివిగా లభించాయి. కనిగిరి కొండల్లో నూతన శిలాయుగానికి చెందినగొడ్డళ్ళు, బాడిశెలు, నివసించడానికనువుగా మలచిన గుహలు, రాతిమరుగులు ఇటీవలనే కనుక్కోబడ్డాయి. నాణ్యమైన చిన్నరాతి రంపాలు, కత్తులు కూడా ఎక్కువగా దొరికాయి. ఈ కాలంలో (క్రీ. పూ. 2500) తొలిసారి ఆంధ్రుడు పొలాన్ని సాగుచేసి, పశువులను పాలించి, సామూహిక జీవితానికి పునాదులు వేశాడు. జంతువులను పట్టి జీవించేవాడు కూడా. ఇనుప యుగానికి చెందిన బృహత్ శిలాసమాధులు (మెగలిత్) నెల్లూరు-ఆత్మకూరు మార్గంలో, దర్శి పొదలి-కందుకూరు తాలూకాలలో కనబడ్డాయి.

ఈ ప్రాక్ చరిత్రావశేషాలేగాక కొన్ని ముఖ్యమైన చరిత్రకాలపు విశేషాలనుగూడా వివరిస్తాను.

కందుకూరు తాలూకా మాలెకొండలో అత్యంత ప్రాచీనమైన మునులగుహలు ఉన్నాయి. అక్కడి పెద్దగుహను 'పార్వతీగుహ' అని స్థానికులు పిలుస్తారు. ఉత్తరాన అశోకునికాలపు జైన-బౌద్ధ గుహలను పోలివుండడంవల్ల ఈ రాతికోనలు గుహలు బౌద్ధ భిక్షువులకు అర్హతులకు వర్షపక్షవాసాలకై మార్గమధ్యన ఏర్పాటు చేయబడినవన్నమాట. ఈ 'పార్వతీగుహ' నొసటన ఒకశాసనం ఉంది—

''అరవాహల కులస నందసేఠీ పుతస
సిరివీర సేఠినో దాన.... ''

ఈ బ్రాహ్మీశాసనానికి తెనుగుసేత—

''ఈ దానము అరవాల కులమునకు చెందిన నందశ్రేష్ఠికుమారుడు (శ్రీవీరశ్రేష్ఠి) గావించినది''

దీనినిబట్టి బౌద్ధ జైన మతాలను శ్రేష్ఠి ప్రముఖులు ఎక్కువగా ప్రోత్సహిస్తుండేవారని తెలుస్తూంది. ఈ గుహను చేయించినవాడు అరవల కులం వాడు. అంటే అరవవారన్నమాట. ఈపదం నిశ్చయంగా తెలుగుశబ్దం. దక్షిణాది 'అరవల'—లేక అరవవాళ్ళు—నుద్దేశించి మనం చెప్పేపరిభాష. ఈ తీరానికి దక్షిణంగా (అంటే పెన్నకు దక్షిణాన) కాంచీపుర సమీపాన 'అరవర్ నాయ్'అనే తెగ వుండేదని టాలెమీ (క్రీ. శ. 2వ శతాబ్ది) పేర్కొని వున్నాడు. ఈ పేరు బహుశ వాడుకలో తెలుగుపదం నుంచి అతడు గ్రహించినాడని చెప్పవచ్చు. ఈ అరవవారు నివసించిన చోటునుండి ఈ నామం కులనామమై వాడుకలోకి వచ్చింది.

ఏది ఎట్లున్నా క్రీ. పూ. 2-3 శతాబ్దినాటికే నెల్లూరు ప్రాంతంలోకూడా తెలుగుపదాల శాసనాలు వున్నవనడానికిది ఒక తార్కాణం. బౌద్ధ-జైన సంస్కృతులు ప్రాచీన భాషలను మరుగుపరచి పైశాచి, ప్రాకృతాలను మాత్రం పైకి తెచ్చాయి. క్రీ. పూ. 3వ శతాబ్ది నుండి క్రీ. శ. 4-5వ శతాబ్దిదాకా కూడా ఎక్కడో కొన్ని పేర్లు, పదాలుతప్ప, శాసనాలలో తెలుగు కానరాదు.

ఈ మాలకొండ గుహలలో శిల్పం కనబడదు. అవి కేవలం మార్గమధ్యాన వున్న ఆరామస్థలాలు మాత్రమే—క్రీస్తు పూర్వం నాటివి.

నెల్లూరుకు దగ్గరలో, కోవూరు తాలూకా పడుగుపాడు గ్రామంలో ఒక పురాతనమైన దిబ్బవుంది. అక్కడొకచోట శాతవాహన చక్రవర్తుల నాణాలు లభించాయి. అవి సత్తువి. శాతవాహనరాజు-వాశిష్ఠీపుత్ర శాతకర్ణి (క్రీ. శ. 116-145), యజ్ఞశ్రీ (క్రీ 162-191) ల అంకాలతో వున్నాయి. శాతవాహనకాలంనాటి ఇటుకలు, మట్టిపాత్రలుకూడా ఇక్కడ లభ్యమవుతున్నాయి.

గూడూరు తాలూకాలోని బుద్ధపాడు అనే గ్రామంలోకూడా పురాతన వస్తుస్థలం వుంది. అక్కడ క్రీ. శ. 1-వ శతాబ్దినాటి కట్టడాల అవశేషాలు, మట్టిపాత్రలు దొరుకుతున్నాయి. బౌద్ధమత వ్యాప్తివల్ల ఆగ్రామానికి 'బుద్ధపాడు' అనే నామాంతరం ఏర్పడింది.

గండవరం — రాజుపాళెం మధ్యనవున్న పెద్దపాడు అనే చేలలో పాటిమట్టిదిబ్బలున్నాయి. అది శ్రీ ఇంగువ రాఘవశాస్త్రి మాగాణి. ఆ స్థలాన్ని పరిశీలించగా, క్రీ. పూ. 2 వ శతాబ్దికి చెందిన ఎరుపు-నలుపు రంగుమట్టి పాత్రలు, ఇటుకలు,



చిత్రం 1: రామతీర్థంలోని రామలింగేశ్వరాలయం క్రీ. శ. 9-10 శతాబ్దినాటి ఈ పురాతనాలయానికి ఇటీవల సిమెంటు పూతలుపూసి స్వరూపమే మార్చేశారు.

క్రీ. శ. 1-2 వ శతాబ్ది రోమ్ నగరంలో లభ్యమైన 'రౌలెటెడ్' (Rouletted) అనే మట్టిపాత్రలు దొరికాయి. అట్లాగే రామతీర్థంలోని రామలింగేశ్వరాలయ పరిసరాల్లోకూడా. రామతీర్థంలో ఇది వరకు త్రవ్వకాలుచేయగా, చాలా ఇటుకకట్టడాలు, మృత్తికాభాండాలు, బౌద్ధ సంప్రదాయం వున్నట్లు తెలియవచ్చింది. ఇప్పుడున్న రామలింగేశ్వరాలయం క్రీ. శ. 9-10 శతాబ్దిలో తూర్పు చాళుక్యులు నిర్మించింది. కానీ చిత్రమేమిటంటే, గర్భాలయంలోని లింగం తెల్లని దాచేపల్లి సున్నంతో చేయబడి వుంది. పంచారామక్షేత్రాలైన ద్రాక్షారామం, అమరావతిలలో ఎట్లా అయితే బౌద్ధస్థలాలలో శివలింగ ప్రతిష్ఠ జరిగిందో, అట్లాగే ఈ రామతీర్థంలోకూడా జరిగింది. దేవాలయ స్వరూపం గజపృష్ఠాకారం. చేజర్ల నాగార్జున కొండలలోవలె చైత్య గృహాలను పోలివుంది. ఇప్పుడు ఈ దేవాలయానికి సిమెంటు పూతవేసి, స్వరూపమే మార్చివేశారు (చిత్రం 1) సముద్రతీరాన వుండడంవల్ల ప్రాచీనంగా ఈస్థలం కోస్తాప్రాంత బౌద్ధారామక్షేత్రాలతో ఎక్కువ బాంధవ్యం కలిగివుండిందనడంలో సందేహంలేదు.

సాతవాహన-ఇక్ష్వాకు కాలంనాటి పట్టణాలు మనకు అమరావతి, ధరణికోట, నాగార్జున కొండల్లో లభ్యమయ్యాయి. గుంటూరుకు దక్షిణంగా, ఒంగోలు-మార్కాపురం మధ్య ఇటీవల చందవరం (సింగరికొండ)లో పెద్ద బౌద్ధారామం, నగర శిథిలాలు వెలుగులోకి వచ్చాయి. నెల్లూరికి దక్షిణాన మనకిట్లాంటివి ఇంతదాకా దొరకలేదు. ఇటీవల నాయుడుపేటకు 30 కి. మీ. ల దూరంలో వున్న పుదూరు గ్రామంలో నేను ప్రాచీన స్థలాన్వేషణ చేశాను. ఆ గ్రామానికి పడమటికట్టు, షుమారు ఒక్క కిలోమీటరులో 60 ఎకరాల విస్తీర్ణం కల్గిన ఎత్తయినపాటిమట్టి దిబ్బలున్నాయి. ఎత్తయిన చతురస్రాకారపు ప్రాంతం చుట్టూ కోట గోడలు, కందకం ఉన్నాయి. శిథిలమై పోయిన ఇటుక కట్టడాలు పెక్కుచోట్ల కానవచ్చాయి. ఆ ఇటుకలు 21×10×3½ అంగుళాలు కల్గివున్నాయి. సాతవాహన ఇక్ష్వాకు కాలం నాటివిగా కనబడుతున్నాయి. ఆ స్థలాన్ని మరింత నిశితంగా పరిశోధిస్తే, మరుగునబడిన ఎన్నో చారిత్రక విశేషాలు తప్పక లభిస్తాయి. ఈ అవశేషాలనుబట్టి, క్రీ. పూ. 2-3 శతాబ్ది మొదలు క్రీ. శ. 4-5 వ శతాబ్దివరకు నెల్లూరు జిల్లాలో బౌద్ధ జైన స్థావరాలున్నాయని తెలియవస్తూంది. ప్రాచీన చారిత్రక స్థలాలను నగరాలను మరింత సమగ్రంగా పరిశీలించి, పరిశోధించాల్సిన అవసరం ఎంతైనావుంది. ఇటీవల కాంచీపురం, కావేరి పూంపట్టణంత్రవ్వకాలలో, అమరావతి, నాగార్జున కొండలలో లభ్యమైన పాలరాతి శిల్పాలు, బౌద్ధగృహాలు క్రీ. శ. 2-3 శతాబ్దివి లభించాయి. ఈ సంస్కృతిని ఆ కాలంలో దక్షిణాదికి చేరవేయడంలో నెల్లూరుజిల్లా ప్రముఖపాత్ర నిర్వహించిందనడంలో ఏమాత్రం సందేహంలేదుకానీ, వివరాలు తెలుసుకోవలసిన అవశ్యకతమాత్రం వుంది.

నెల్లూరు జిల్లాలోని (ఇప్పుడు ప్రకాశంజిల్లా) మరొక ముఖ్య ప్రదేశం-భైరవకోన. మన కోస్తా ప్రాంతంలోని చారిత్రకగుహాలయాల్లోనూ అత్యంత సుందర ప్రకృతి మధ్యవుంది భైరవకోనలోని త్రిమూర్తి గుహా సముదాయం. ఈ పర్వతాలు అంబవరం, కొత్తపల్లి గ్రామాలకు చెందినవి. కనిగిరి నుండి దర్శిగుంటపేట మీదుగా 35 కి. మీ. బస్సులో ప్రయాణం చేయాలి.

ఈ శిలావాస్తు శిల్పాలు రెండు అంతస్తులలో, మొత్తం ఎనిమిది దేవాయతనాలుగా కూర్చబడ్డాయి. ఇవి క్రీ. శ. 7-8 శతాబ్దాలలో తూర్పు చాళుక్యులు నిర్మించినవిగా చెప్పవచ్చు. పెక్కు చిన్న శాసనాలు-శైవాచార్యులపేర్లను, చేయించిన భక్తులపేర్లు జ్ఞాపకచిహ్నాలుగా-ఈ ప్రదేశం యొక్క పవిత్రతను ఖ్యాతిని చాటిచెప్తున్నాయి.

ఇక శిల్పరీతిని పరిశీలిస్తే ఆకాలపు పెక్కు శైలుల సమ్మిశ్రమైనట్లు గోచరిస్తుంది. అటు పల్లవులు, ఇటు విష్ణుకుండినులు, చాళుక్యులు రీతులు కనబడుతున్నాయి.

ముఖ్యగుహల కెదురుగా ఒక పెద్ద ఎత్తైన



చిత్రం 2: భైరవకోనలో చండికేశ్వరుడు

తాండవశివ ప్రతిమ (దశభుజాలు). ఆ ప్రక్కనే హరిహరుడు—ఎంతో సహజంగా చెక్కారు. ఇవి మహాబలిపురంలోని శిల్పాలకి ఏ విధంగానూ తీసిపోవు. ఈ హరిహరతత్వం నెల్లూరు సీమలో తర్వాత ప్రసిద్ధమైందికదా! చిన్నచిన్న కోష్ఠాలను మించిన వినాయక, చండికేశ్వరుల ప్రతిమలు, ముద్దుగా బుద్ధిమంతులుగా కూర్చున్న బాలురవలె చూడముచ్చటగా ఉన్నాయి. (చూడు చిత్రం 2)

ఇక ద్వారపాలకులు గదాధరులై దృఢకాయులతో నిలువెత్తున, కొమ్ముల తలపాగాగల్గి ఠీవిగా వ్యాళిగుహ ప్రాంగణంలో ద్వారానికిరువైపులా సజీవంగా నిల్చివున్నట్లు కన్పిస్తారు. ఈ ద్వారపాలకుల కుడివైపున బ్రహ్మ ఎడమవైపున మహావిష్ణువు కోష్ఠాలలో వున్నారు. శక్తులవలె ఈ ఇరువురు దేవతలు సర్వేశ్వరుని గుడిలో చేర్చబడడం త్రైమూర్తుల ప్రాముఖ్యాన్ని చాటడమే! మధ్యగావున్న ముఖ్య గుహాలయంలోని త్రిముఖమూర్తి చెక్కడాన్ని సూచిస్తాను (3 చిత్రం). ఈగుహ చతురస్రం; మధ్యన నల్లని లింగం రాతి పీఠంపై అమర్చబడివుంది. వెనుకగోడపై అర్థశిల్పంగా చెక్కబడిన – కేవలం వక్షంవరకా చూపబడిన– త్రిముఖ శివుని చాలా శక్తివంతమైన దేవతగా ఆరాధిస్తున్నారు. శైలినిబట్టిచూస్తే ఈ వ్యాళిను క్రీ. శ. 9–10 శతాబ్దాలకి చెందిందిగా తోస్తుంది. మిగతా దేవతామూర్తులు వాస్తువుల కన్నా తర్వాత గావించబడినవి. శిల్పంతీరు నిశితంగా పరిశీలిస్తే, బొంబాయివద్దవున్న 'ఎలిఫెంటా' లోని మహాదేవునిగుహాలోవున్న రాష్ట్రకూటరాజుల నిర్మాణా



కార్తికేయశర్మ

నికి సామీప్యం కల్పిస్తుంది. కానీ ఎలిఫెంటాలోని చెక్కడం చాలా పెద్దది; పూర్తిగా అర్ధశిల్పం. ఇక్కడ ఇంచుమించు రేఖాచిత్రంగా కొద్దిగా తొలచబడింది. కాని ముఖాలశైలిలో రెండూ ఒకటిగానే వుండడం గమనార్హం. పండితులైన స్టెల్లా క్రామ్రిష్, గోపీనాధరావుగారలు ఈ శిల్పాన్ని 'మహేశ్వరుడు'గా తలచి. మూడుముఖాల శివుని తత్పురుష, అఘోర, వామదేవులుగా భావించారు.

కానీ అట్లాకాదని తోస్తూంది. మూడవచిత్రం చూడండి ఎదురుగా వున్న ముఖం నేత్రం గల్గి, గంగను జటాజూటంలో వుంచి, సౌమ్యమూర్తి శివునిగా రూపొందించబడింది. కుడివైపు ముఖం అఘోరుడు (రౌద్రస్వరూపం). ఎడమప్రక్క ముఖం స్త్రీ సమ్మోహనరూపం-అద్దంలో చూచుకొంటున్న ఉమ. అనగా శక్తిస్వరూపిణి. ఈ విధంగా ఈ చిత్రం ఉమామహేశ్వరుల శక్తిస్వరూపాలను విపులీకరిస్తుంది. అమ్మవారులేని లోటును ఈ చిత్రం గోడ వెనుకగా చెక్కి పూరించారు. ప్రజలు ఈ గుహాలయాలను దుర్గ–భైరవకోనలుగా కొలుచుట ఎంత సమంజసమో ఇప్పుడు పూర్తిగా అర్థమవతూంది.

ఇటువంటి శిల్పపెన్నిధి ఎంతోవుంది నెల్లూరు జిల్లాలో. దాన్ని గుర్తించి, భద్రపరచుకోవడం అందరి బాధ్యత.



చిత్రం 3: భైరవకోనలో దుర్గ–భైరవకోన



# నెల్లూరు నుడులు-నానుడులు

శ్రీ బండి నాగరాజు

నెల్లూరు మాండలికాల్ని గురించి వర్ణించే ముందు మాండలిక పదాలన్నిరూప స్వభావాల్ని పరిమితుల్ని మరికొన్ని శాస్త్రీయ అంశాల్నిగూర్చి లఘువుగా ముచ్చటించుకోవడం బాగుంటుంది. ఈనాడు మాండలికాలపరిధి చాలావరకు చెరిగిపోయివుంది. అది శుభ పరిణామమే. అందుకు కారణం పత్రికలు, సినిమాలు, రేడియో ప్రసంగాలు, తదితర ఉపన్యాసాలు కూడాను. కొన్ని మండలాలవాళ్ళు ఉద్యోగరీత్యా ఇతర మండలాలకు వెళ్ళడం వాళ్ళ మాండలికం అక్కడి వాళ్ళ నాకర్షించి ప్రచారం పొందడం తరచు జరుగుతున్నది. అంటే మాండలికాల అంతర్యం తగ్గి సాన్నిహిత్యం పెరుగుతున్నది. ఇది భాషకు పుష్టిని తుష్టిని కలిగించగల్గుతుంది.

మొదటమొదట 'వ్యావహారికం' ఉభయ గోదావరి ప్రాంతాలనుంచి రంగాని కెక్కడంవల్ల, మంచి ఊపుకూడా పుంజుకోవడంవల్ల తదితర ప్రాంతీయాలు చాలావరకు వాడుకనుంచి తొలగిపొయ్యాయి. 'అలా', 'ఇలా' వంటివి మన మాండలికాలు కావు. అట్టు, ఇట్టు అని మనం వాడుతాము. అటుమొంటి, ఆమోస్తురు, తోపాటు, నీళ్లసాయ వంటి మాటలు దరిదాపు తొలగిపొయ్యాయని చెప్పవచ్చు. ఈ ప్రమాదం జరక్కుండా మన శబ్ద సంచయాన్ని, అర్థసంపదను, యాసను, వాడుకను కాపాడుకోవడం మనవిధి. మన ప్రాంతీయపు పలుకుబడిలోవుండే వ్యాకరణంగాని, వాక్య నిర్మాణంగాని ఇతర మండలాల వారితో కొంత విభేదిస్తుంది. కనుక మాండలికం యొక్క పరిధి శబ్ద, అర్థాలకుమాత్రమేగాక అది వాడేతీరు, యాస, వ్యాకరణం, వాక్యనిర్మాణం తదితర అంశాలపై కూడా ఆధారపడి వుంటున్నది.

వచ్చితివా?- వచ్చారా?- వచ్చినావా?- వచ్చివా?- వద్చా?

ఇట్లా ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కరూపం వాడుకలో వుంటున్నది.

నువ్వు వద్చా? నాకు వద్చా?

పై 'వద్చా' అనే మాటను రెండువిధాలుగా పలుకుతున్నాము. మొదటి దకారం తాలవ్యోచ్చారణ కలది. రెండోది దంత్యం. ఇక 'యాస' గురించి వివరణ లక్షణబద్ధంగాచేసి చూపడం శాస్త్రీయంగా అసాధ్యం కాదుగాని, సామాన్యమార్గంలో తెలివిడి చెయ్యడం కష్టమే. International Phonetic Script ద్వారా 'యాస' ను రికార్డు చెయ్యవచ్చు. ప్రస్తుత వ్యాసపరిధిలో అది సాధ్యపడదు.

మన నెల్లూరు మాండలికాలకు సంబంధించి నేను చెయ్యవేసినంతవరకుతప్ప అంతకుమించి పటిష్టంగా కృషి యింతవరకు జరగలేదన్నది గర్వోక్తి కాదు. నా స్వల్పకృషికి దోహదంచేసినవాళ్ళతో పాటు అంతరాయాలు కల్పించి ఆక్షేపణలు చెయ్యబూనుకున్నవాళ్ళూ లేకపోలేదు. ఎందరో మహానుభావులు...

ఇక్కడ కొన్ని మన "నెల్లూరు నుడులు-నానుడులు" స్థాలీపులాక న్యాయంగా స్వీకరించి గచ్ఛద్ వ్యాఖ్యగా కొన్నిసంగతులు మనవిచేస్తాను.

1. అద్దోనం. అధ్వానము = అమార్గము-నుంచి అధ్వాన్నముగామారి యీ వాడుకరూపం వచ్చింది. మార్గంలేని ప్రదేశం అంటే పాడుచోటు అని అర్థపరిణామం ఏర్పడింది. అద్దోనపుకొంప అంటాము. 'అద్దోనం చెతుకమద్యం' అని నానుడి. చతుష్మధ్యం—అంటే నాలుగుప్రక్కలా దారివుండే చోటు భద్రతలేనిదని. అద్దోనాన వుంటుందా, ఒకరవ్వ కనిపెట్టుండయ్యా.

2. అమ్మిడి. (రూపాంతరం) అమ్మిడ. వెంబడి అనే గ్రాంథికరూపంనుంచి భ్రష్టమయింది. వెన్ను - బడి = వెన్నుబడి, వెనుబడి, వెన్‌బడి, వెంబడి - రూపనిష్పత్తి. బడి = అనుసరించి. ఆవటి గాలివాన్నిబడిపొయ్యేతలికే తొందరగా వచ్చేసింది. వెంబడి, ఎంబడయింది. ఎంబడి-ఎమ్మడి-అమ్మిడి-ఇట్లా రూపనిష్పత్తి. వెంబడిపోవు = వెంటబడిపోవు, అనుసరించిపోవు, దగ్గరగా వుండిపోవు, తోడుగాపోవు-ఇట్లా అర్థపరిణామం జరిగి అమ్మిడ అంటే దగ్గర అనే అర్థం వచ్చింది. ఇట్లొచ్చి నాయమ్మిడి గూసోరాదా.

3. అరిచేతిగీకలు మూసేవేళ. అరచేతిలో గీకలు కనబడనంత కనుచీకటి ఏర్పడేవేళ. సూర్యాస్తమయానంతరవేళ అరిచేతిగీకలు మూసే యాళ్టికే కన్నుగొరికినాడు.

4. అగబాగాలు. (రూ) అగబోగాలు. "అగబాగాలు అంకమ్మశివాలు" అని నానుడి. రచ్చా రాయిడి అని అర్థం. అగము = గలభా. భోగము అంటే గొప్పను అనుభవించుట. గొప్పను ప్రదర్శించే గలభా అని అభిప్రాయం. చివరకు పై విధంగా అర్థపరిణామం ఏర్పడింది. ఏంది మీ లొంపిలో రాత్రంతా అగబాగాలుగా వుండె.

5. ఆడగూతురు. సాధారణ స్త్రీ అని అర్థం. రెండు పదాలూ ఒకే అర్థం ఇస్తున్నా యిది ఊతపదం. ఆడగూతురిమీద చెయ్యి జేసుకోనాటికి నీకేం అధికారం? పాపం ఆడగూతురు అంతే అన్నది పోనీండ్రా. (అందరికి కూతురువంటి ఆడది అని అభిప్రాయం).

6. ఉగ. ఊహ- ఉహ- ఉగ- రూపనిష్పత్తి. ఊహతెలిసే వయస్సు- అని అర్థం.

ఎగుడు దిగుడులు లేని సుగమమౌ బ్రతుకంటె
ఉగ దాలరి చరిత ఒదవ దెందులకు
సుగము లేదుర తెలుగువాడ.

7. ఉడికిన గొర్రిపేగు తెంపలేడు. చిన్న సులభమైన పనికూడా చెయ్యలేని అసమర్థుడు- అన్న అభిప్రాయంలో వాడే నానుడి. నువ్వొరే, ఉడికిన గొర్రిపేగు తెంపలేవు, నన్నేం జెయ్యగలవు?

8. ఉద్ద. ఉద్దా. మొత్తం అని అర్థం. ఉద్దా ఉద్దాలుగా నూక్కోపొయ్యారు. ఉద్ద మొత్తం– అనేది ఊతపదం (అదకూతురు మాదిరి) ఉద్దా ముగ్గురు అంటే చానా కొద్దిమంది అని అభిప్రాయం. "మొత్తం (వట్టినవాళ్ళు) అందరూ కలిసి ముగ్గురు" అని భావం. నలుగురూ అంటే అందరూ అని; ముగ్గురు అంటే కొద్దిమంది అని అర్థం. ఉద్దాముగ్గురుండే యింట్లోనే చెయ్యలేక పోతే పెద్దిళ్ళల్లో ఏం జెయ్యగలవు?

9. ఎగనాం పెట్టు. ఎగునామము పెట్టు నుంచి వచ్చింది. ఎగునామము పెట్టుట అంటే ఎదుటి వాడికి నిలువునామము పెట్టుట అని అభిప్రాయం. వైష్ణవులు మాయచేసేవాళ్ళని భావించి చెప్పే నానుడి. ఎగగొట్టు అని అర్థవిపరిణామం. బడికి సరే ఎగనాం బెడితివి, పిలగాణ్ణన్నా ఆడిపిచ్చుకో గూడదా? (పంగనామాలుబెట్టు- అదే నానుడి గూడా యిట్టాంటిదే.)

10. ఎచ్చలకారి. హెచ్చు - ఎచ్చు - ఎచ్చులు; ఎచ్చులు (గొప్పలు) చెప్పుకొనేవాడు లేక ప్రదర్శించేవాడు. ఎచ్చులకారి (రూ) ఎచ్చలకారి. మతుబర్థంలో కారి ప్రత్యయం వచ్చింది. జంబాలుకారి (అరవంలోగూడా) సైత్యకారి, షావుకారి మొ. ఈ దొట్టి ఎచ్చలకారి వచ్చిమీకవకాయే, నేనేవోఁ అనుకున్నాగాని. ఎచ్చుల-లోని మధ్య ఉకారం పరిసర ప్రభావంతో అకారంగా మారడం భాషా తత్వశాస్త్రం ప్రకారం సహజమే.

11. ఏలవ యెత్తుకొను. ఏల = శృంగారపు పాట. ఏల నుంచి ఏలవవచ్చింది. బూతులు తిట్టడం మొదలు పెట్టుట అని అర్థం. నామీద ఒకటే ఏల వెత్తుకొని కూసోనుండాదయ్యా.

12. ఐ. ఔరా–ఆశ్చర్యార్థకం వంటిది; ఐరా-నుంచి వచ్చింది. ఐ! బలే చిత్రంగా వుండాదే!

13. ఒడిబాల (చీర). ఒడిబ్రాలు – నుంచి వచ్చింది. బ్రాలు = బియ్యము. చీరపెట్టి ఒడిలో బియ్యం వగైరా మంగళద్రవ్యాలు ఉంచి పంపే తతంగం. పెళ్ళిలో ఒడిబాల దగ్గర పెళ్ళికొడుకోళ్లు అలిగిపోయినారు.

14. ఒప్పనాసి. ఒప్పనితనం. ఇటువంటిదే పీనాసి. ఒప్పనాసిది. ఒప్పనాసివాడు మొ. వాడుకలు.

15. ఓహోరుమంటే. ఓహోరే అంటే, మహా ఎక్కువ అంటే–అన్నమాట. ఓహోరుమంటే వది వోట్లు రావచ్చు. ఓహోరుమని లెక్కేస్తే వెయ్యుండేను.

16. కడముంత. మట్టిముంత. దూరంగావుంచి పైపనికుపయోగించే మట్టిచెంబు. తక్కువతరగతి వాళ్ళకు అంబలినీళ్ళు మొ. ఇచ్చేటందుకు; కాళ్ళు కడుక్కునేటందుకు ఉపయోగించేది. కడముంతతో గూడ నీళ్ళీడు, బంకడు.

17. కాలా చెయ్యా కూడేసుకొను. కావలసిన కనీసవసతులు ఏర్పరచుకొను. కాలూచెయ్యి కూడేసుకొని ఒకరవ్వ అట్టుండేటప్పటికే ఈ మీందమేకువచ్చి తగులుకొనె!

18. కూట్నీళ్ళకు అడుగు–అమ్ముకొను. చానా తక్కువ వెలకు అడుగు అమ్ముకొను. ఎటూ అమ్ముకోవలసొస్తదని కూట్నీళ్ళ కడగతుండారు. (కూడు+నీళ్ళు = కూటినీళ్ళు, కూట్నీళ్ళు- చద్దినీళ్ళు అని అభిప్రాయం.)

19. గాటాలుతిను-పడు. రకరకాల కష్టాలు అనుభవించు అని అర్థం. బాగా గాటాల్దిన్నావోణ్ణి నాకిదొక లెక్కా జమా?

20. గుదులుపడు. రహస్యంగా సన్నిహితంగా ఆలోచన తెగక మాట్లాడుకొను. ఏందో వాళ్ళల్లో వాళ్ళు గుదులుపడతున్నారు, మనకేం తెలుసు లోఅంతరం?

21. చాటభారతం. చేటసైజులో అచ్చవుతూ వుండిన (పూర్వీకం పుస్తకాలన్నీ పెద్దసైజులో అచ్చయ్యేవి) భారతం. పెద్ద బొక్కు. చాట భారతం అంటే కంపరామాయణం మాదిరి విస్తరించిచెప్పి విసుగుబుట్టించే విషయం, వర్ణన అన్నమాట. నీ చాటభారతం నాదెగ్గిర జదవబాకపో నేఁ న్లేను.

22. చాదవ. చెద్దము = పని-నుంచివచ్చింది. చెద్దమువు, చైదవు, చాదవ–రూప నిష్పత్తి. సరైన పనికాదని అర్థం. ఏందీ చాదవ, యిట్నేనా చేసేది?

23. చాల్తి. (రూ.) శాల్తి. ఛలోక్తి నుంచి వచ్చింది. ఎగతాళిగా అనేమాట అని అర్థం. నాతో గన చాల్తిబడబాక చెంపబగలద్ది చెప్తుండా.

24. చాష్టాల. చేష్టలు–నుంచి వచ్చింది. పరిహాసించదగ్గపనులని అభిప్రాయం. నువ్వా నీచేష్టాలు నాకేం పట్టుకోడంలా.

25. చెకలు. (రూ.) శకలు. చెకండాలు, చెకణ్ణాలు అనిగూడా వాడుక. పరిహాస ప్రసంగాలు,



నరసింహకొండ మీద లక్ష్మీనరసింహస్వామి ఆలయదృశ్యం —ఫోటో: పి. బి. ఎస్. రెడ్డి.

ప్రవర్తనలు—అర్థం. స్త్రీలందరూ బలె చెకలు బడతుంటారె.

26. తడుబ్బాత. తడుపు+పాత. పాత అంటే గుడ్డ అని అర్థం. (గుడ్డపాత అనేది ఊతపదం) స్నానం చేసేటప్పుడు మొలకు కట్టుకొని లేదా గోచీపెట్టుకొని తడుపుకొనే గుడ్డ అని వ్యుత్పత్తి. అంటే గోచిఅని వాడుక. దణ్ణాన తడుబ్బాతగుడ్డ వుంది తెత్తరా.

27. తలగుడ్డ పడిపోవు. అవమానం కలుగు. అంతలోకే తలగుడ్డ బడిపోదులేవయ్యా.

28. తాంబాళం తాంబూలము—నుంచి వచ్చింది. తాంబూలంపెట్టుకునే పెద్దతట్ట అనిఅర్థం. తాంబాళ తట్ట అనిగూడా అంటారు. పక్కింటోళ్ళ తాంబాళం అడిగిరా, పాకం బట్టుకోని యిచ్చేస్తాం(వ)ని చెప్పు.

29. తుట్టమారా. పూర్తిగా అని అర్థం. తుట్ట మారా పంచెడుపైందాకా కనుక్కోలేకపోతివే, నువ్వు చెరసనాబత్తుడివని తెలిసిగూడా.

30 తూర్పారబట్టు (రూ) తూర్పానబట్టు. గింజలు చెత్త వేరుపరిచేటట్టు గాలికి పట్టు అని అర్థం. నిష్కారణంగా కఠిన విమర్శచేయు అని అభిప్రాయం. నువ్వు జేసిందేదంతా తూర్పానబట్టా నుండు.

31. తూర్పురేకలు మైలవిడుచు. తూర్పుదిక్కున సూర్యకాంతిరేఖలు వెడల్పుగా కనిపిస్తూ చీకటి (మైల) ని తొలగించడమని అభిప్రాయం. నేను ఊళ్ళోకొచ్చినాను అప్పుడే తూరుపు రేకలు మైలిడస్తుండాయి.

32. తైక్కమంటే. (1) ఏమన్నా, (2) మాటి మాటికి- అని అర్థాలు. తైక్కమంటే తన్నడాని కొస్తావేంది పైపెకి.

33. దరువు. ఇష్టారాజ్యమైన పద్ధతి అనే అర్థంలో వాడుక. మంచి దరువు గనుక్కున్నావు గదరా. ఏం మళ్ళీ దరువు మార్చేసినాడే? (ఇక్కడ పద్ధతి అని అభిప్రాయం.)

34. దళమెత్తుకొను. మందీ మార్బలంతో కూడి వ్యతిరేకించివచ్చు. నా మింద దళమెత్తుకొని వుండాడు నేనేంజేసినాననో?

35. దళమేసి పుట్టు. పూర్వజన్మంలో దళం (పత్రి) మొ. పూజాద్రవ్యాలతో దేవుణ్ణి పూజించి అదృష్టంతో పుట్టు. దానికేం నాయినా దళమేసి పుట్టింది, ఏంజేసినా చెల్లోతైపోద్ది.

36. నిమి నిమాలు. బొటాబొటీగా సరిపడేవి అని అభిప్రాయం. తిక్కటుకిటూటికి నిమినిమాలుగా వచ్చింది నువ్విచ్చింది.

37. నీళ్ళు నములు. ఏమి చెప్పలేక తటపటాయించు—అని వాడుక. ఏమన్నా అడిగితే నీళ్ళు నముల్తారెందుకు, కరుగ్గా చెప్పెయ్యరాదా?

38. పుణ్యపుత్రురాలు. ఏమీ పట్టించుకోకుండా సాగినమ్మ వున్నట్టుండే మనిషి అనిఅభిప్రాయం. అంతరగడ జరగతావుంటే పుణ్యపుత్రురాలు గూచో న్నట్టు పలకొద్దా బాశేలి?

39. పునుకుడు. పురుషుడికి ఏకవ్యాణపువాడుక అసమర్థుడన్న అర్థచ్ఛాయలో ప్రయోగం అ పునుకుడు జెప్పాడంటా యీ పుస్కుడు జేసుకోనొచ్చాడు. పుస్కి అనిగూడా వాడుక. హీనపరిచి తిరస్కరించేటప్పుడు వుపయోగిస్తాము. పోరా పుస్కి, నీదేంది?

40. పెశద్దరం. పెడ—అర్థం తీసే మనస్తత్వం అని అభిప్రాయం. అటువంటివాడు పెశద్దరపోడు. ఎంతజెప్పినా నీ పెడద్దరం నీదేనా, పెశద్రానికి పెద్దరోగానికి మొందులేదంట.

41. పెంకుదీయు. లాభంలేదనిచెప్పు, ఆశ వదులుకొను— అనే అర్థచ్ఛాయల్లో వాడుక. పెద రెడ్డి పెంకుదీసినాడంట్నే యిహాన బొయ్యి యేట్లో దూకండి.

42. పైటాళ, పైటికూడు, పైటేషం. పగలు యొక్క ఔపవిభక్తికరూపం పగటి. గ-హ-అ-య అక్షరాలు పరస్పరం ఆదేశంకావడం ఉచ్చారణలో గమనిస్తాము. పగటి, పహటి, పఅటి, పయటి, పయిటి, పైటి- ఇట్లా రూపనిష్పత్తి సాధ్యం. వేళ, వేషం- వీటిలో ఆదివాల్లు లోపించడం కద్దు. పైటి+వేళ = పైటేళ- ఇందులో మధ్యాచ్చు 'ఐ-అ' లకు మధ్యస్థంగా పలికినప్పుడు పైటాళ అవుతున్నది. ఇక్కడ పగలు అనేమాటకు సాయంకాలం 3 గంటల ప్రాంతమని సామాన్యార్థం. పైటికూడు సాధారణంగా సాయంత్రం టిఫిన్ టైములో తినే అన్నం. (రూపవిభక్తికి ఇవి తగిన ఉదాహరణలు) పైటేషగాళ్ళేరా, అయ్యోరు గాదుగనె!

43. పోరాసి. ఓర్చుకోలేని, ఒప్పలేని- అని అర్థం. వాడిది అమిత పోరాశిబుద్ధి.

44. బల్లంపీట. పూర్వకాలపు పెద్దబెంచి. పెద్దబల్ల అనిగూడా అంటారు. బల్లపీటమధ్య అనుస్వారం రావడం విశేషం. బల్లంపీటమింద బంగడి బరిశె పెడ్తిరే మణికి గూకునేదెట్ట?

45. బాసేలి. (రూ.) బాశేలి. భాగ్యశాలినుంచి వచ్చింది. మధ్యాచ్చు అ-ఏల మధ్యస్థం. మామూలు స్త్రీ అని అర్థం. ఎశరీ బాశేల, గుర్తుబట్టలేకుండానే?

46. బైశాట్లు. బైసిమాలిన పనులు, అవమానకరమైన పనులు-అని అర్థం. ఎందుకొచ్చిన బైశాట్లురా!

47. బొడ్డుపైక. ఊరు నడిబొడ్డునవుండే చలిక (రచ్చబండ) చలిక, చయిక, సయిక, పైక- రూపనిష్పత్తి.

48. ముక్కణాం. (రూ.) ముక్కనాం. ముక్కు మునుంగా-అనే నానుడినుంచి ఏర్పడిన భ్రష్ట రూపం. ముక్కుదాకా అని అర్థం. ముక్కణాంగా దిని మునుగుదన్ని పొండుకుంటే దొమ్మరాక?

49. లట్టాలుగొట్టు/పడు. నిష్కారణంగా తిరుగు, అనవసర శ్రమపడు— అని అభిప్రాయాలు. లట్టాలుగొట్టుకుంటూ తిరక్కపోతే ఏదన్నా పనిబాటా చూసుకోరాదా?

50. వక్కాకు. తాంబూలం అని అర్థం. (వక్క+ఆకు) వక్కాకు మార్చుకున్న పాళ్ళే పెళ్ళయినట్టా, పీటలమింద పెళ్ళిళ్ళంటివి యెగిరిపోతుండాయి.

51. శాస్త్రం. (రూ.) శాస్తరం. కథ అని అర్థం. ఒరే పిలకాయల్లారా నేనొకశాస్త్రం జెప్తా వినండ్రా. పొడుపుకథ అనిగూడా అర్థాంతరం. ముందు నేనేశిన శాస్త్రం యిప్పు. తర్వాత నీదానికి నేంజెప్తా.

52. సన్ననూలోడుకు. సన్ననూలు వడకు- మంచి వాడుకపడింది. సన్నబడి తేలిపోతూవుండడమన్న అర్థచ్ఛాయలో ప్రయోగం. ఏం పిల్లా సన్ననూలొడకతుండావే, లావెక్కతానని తిండి మానేస్తుండావా?

ఇక్కడ కొన్నిపదాలనుమాత్రం ఎత్తుకొని క్లుప్తంగా పరిచయంచేశాను. ఎక్కువగా రూపనిష్పత్తి, వ్యుత్పత్తి, ప్రయోగసరళి సూచించాను. శాస్త్రీయంగా ఇంకా ఎన్నోఅంశాలు గుర్తించవలసివుంది. 

# నెల్లూరుజిల్లాలో పారిశ్రామికావకాశాలు

ఏ ప్రాంతపు ఆర్థికపుష్టికైనా ప్రధాన దిక్సూచి దాని పారిశ్రామిక ప్రగతి. ప్రతిసంవత్సరం కళాశాలల నుంచి వేనకువేలు విద్యార్థులు ఈ ప్రపంచంలో అడుగుపెట్టడంతో నిరుద్యోగం అన్నది అటు ప్రభుత్వానికీ ఇటు సమాజానికి ఒక పెద్ద సవాలుగా పరిణమించింది. కాబట్టి వీలైనంత ఎక్కువమందికి ఉద్యోగావకాశాలు కల్పించడం సమాజ బాధ్యత అయింది. ఆ లక్ష్యాన్ని త్వరగా సాధించాలంటే, విరివిగా పరిశ్రమలు స్థాపించడం ఒక్కటేమార్గం.

వ్యవసాయానికి—అందులోనూ ముఖ్యంగా ధాన్యోత్పత్తికి - దేశవ్యాప్తంగా ప్రఖ్యాతిచెందిన ప్రాంతం నెల్లూరుజిల్లా అంతేకాదు; వివిధరంగాలలో చొరవ ఉత్సాహం కల్గినవారికికూడా ఈ

శ్రీ పి. ఓబుల్‌రెడ్డి

జిల్లాలో కొదవలేదు. సాహిత్యరంగంలో కానివ్వండి కళారంగంలో కానివ్వండి, లేదా పరిశ్రమల్లోనో-పరిపాలనలోనో కానివ్వండి. ఎందరో నిష్ణాతులను దేశానికి అందించిన ఖ్యాతిగల్గిన ప్రాంతమిది. పారిశ్రామికవేత్తలుకూడా ఈ జిల్లాలో చాలామందే వున్నారు.

ఇంతవరకూ నేలను నమ్ముకొని, వ్యవసాయంలోనే నిమగ్నులైవుండిన అనేకమంది, ఇటీవల భూపరిమితుల దృష్ట్యా, ఇప్పుడిప్పుడే వ్యవసాయేతర రంగాలపై దృష్టి లగ్నంచేస్తున్నారు. వ్యవసాయం తర్వాత చెప్పుకోదగింది, మంచి రాబడి నిచ్చేదీ పారిశ్రామికరంగమే.

కాబట్టి చిన్న, పెద్ద పరిశ్రమలను స్థాపించడానికి ఉత్సాహం కనబరిచేవారిని బాగా ప్రోత్స



జిల్లాలో పెద్దపరిశ్రమ నిప్పో డ్రైసెల్స్ ఫ్యాక్టరీ

హించాలి; వారికి తగిన ప్రాతిపదిక నేర్పరచి, అనుకూల వాతావరణాన్ని కల్పించాలి. పరిశ్రమలు స్థాపించడానికి నెల్లూరుజిల్లాలో అంతులేని సహజ సంపద వుంది. తూర్పున పొడవైన సముద్రతీర ప్రాంతం వుంది. అక్కడ ఉప్పుకు సంబంధించిన పరిశ్రమలుకానీ, మత్స్య పరిశ్రమలుకానీ బాగా వృద్ధిచేయవచ్చు. దక్షిణప్రాంతం మైకాపరిశ్రమకు దేశఖ్యాతి నార్జించింది. ఆ పరిశ్రమను యింకా పెంపొందించడానికి అవకాశాలున్నాయి. ఇటు పెన్న వుంది; ఇసుకను వినియోగించుకొని గాజు పరిశ్రమలు స్థాపించవచ్చు. పశ్చిమాన మందిరకం తెల్లసున్నం లభిస్తుంది; దాన్ని సద్వినియోగం చేసుకోవచ్చు.

ఇన్ని అవకాశాలు, వనరులు కల్గివుండికూడా ఇంకా నెల్లూరుజిల్లా పారిశ్రామికంగా వెనుకబడే వుందంటే ఆశ్చర్యం, విచారం కల్గుతుంది. నెల్లూర్లో యిప్పుడున్న చెప్పుకోదగిన పరిశ్రమలు యివి— ఒకటి ఇండోనేషనల్ లిమిటెడ్. ఇది ఒసాకా (జపాన్)లోని మట్సుషిటా ఎలెక్ట్రిక్ ఇండస్ట్రియల్ కంపెనీ లిమిటెడ్ వారి సహకారంతో ఎలెక్ట్రిక్ డ్రైసెల్ బ్యాటరీలు ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీ. మరొకటి నెల్లూరు కో ఆపరేటివ్ స్పిన్నింగ్ మిల్లు. చేపలు రొయ్యలు వగైరాలను ఎగుమతిచేసే కొత్త వ్యాపారసంస్థ జగా సీ ఫుడ్స్, పొగాకు వ్యాపారం చేస్తున్న ఈస్టిండియా టొబాకో కంపెనీ కూడా పేర్కొనదగినవే. ఇవిగాక 'ఇండస్ట్రియల్ ఎస్టేట్' లోను, ఇతరత్రాను కొన్ని మధ్యతరహాపరిశ్రమలు, లఘుపరిశ్రమలు పైకివస్తున్నాయి.

భారీపరిశ్రమలను ఎక్కువగా ఈ ప్రాంతానికి రాబట్టాలంటే అందుకు అనువైన వాతావరణాన్ని సృష్టించాలి. మద్రాసు నగర పారిశ్రామిక వాతావరణప్రభావం నెల్లూరుమీద ఎక్కువగావుంటుంది. గనుక, ఇక్కడికి పరిశ్రమలు వ్యాప్తికావడంకానీ, పారిశ్రామికవేత్తలను ఆకర్షించడంకానీ సులువే.

రాష్ట్ర సరిహద్దుల్లోవున్న తడ వంటి ప్రదేశాల్లో లఘుపరిశ్రమలకు తగిన ప్రాతిపదిక నేర్పరచవలసిందిగా నేను ప్రభుత్వానికి సూచించాను. ఆంధ్రప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తికి కొరతలేదుగనుక మద్రాసుకు చెందిన పారిశ్రామికవేత్తలు చాలా మంది ఇక్కడ పరిశ్రమలు స్థాపించడానికి ముందుకు వస్తారు. అది జిల్లా పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేయగలదని నా విశ్వాసం.

ఇక్కడొక మాటచెప్పాలి. ఏపరిశ్రమయినా ఒడిదుడుకులు లేకుండాను, ప్రతిభావంతంగాను నిర్వహింపబడాలంటే కార్మికుల సహకారం ముఖ్యావసరం. నెల్లూరులో కొత్తగా ఎదిగివస్తున్న పరిశ్రమలలో కార్మికనాయకులమని చెప్పుకొనేవారి జోక్యం జాస్తిగా ఉంటున్నది. ఇది నాస్వీయానుభవం. కాబట్టి కనీసం ఐదేళ్ళదాకా అయినా కొత్త పరిశ్రమలకు పారిశ్రామికచట్టాలు అన్వయించకుండాచేయడం మంచిదనిపిస్తూంది. ఆవిధంగానైనా కార్మికుల సమస్య పరిశ్రమలకులేకుండా పోతుందేమో! ఏపరిశ్రమ అయినా తన కార్మికులకు న్యాయసమ్మతమైన వేతనాలిచ్చి, వారి శ్రేయస్సును రక్షించి, వారిని తృప్తిపరచాలన్నది అందరూ అంగీకరించే సూత్రమే. ఐతే దానికి కొన్ని పరిమితులున్నాయి. పరిశ్రమ స్తోమత, స్థానికంగా జీతనాతాల పద్ధతి—వీటిమీదకూడా ఆధారపడి వుంటుంది.



పి. ఓబులురెడ్డి

పారిశ్రామికాభివృద్ధికి కొన్ని ప్రాథమికావసరాలున్నాయి. అవి—మంచిస్థలం, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా వగైరాలు. వీటిని సమకూర్చడంలో స్థానిక ప్రభుత్వోద్యోగుల సహాయ సహకారాలు అవసరం.

సంప్రదాయబద్ధంగా వ్యవసాయ ప్రాంతమైన నెల్లూరును పారిశ్రామిక ప్రాంతంగా మార్చాలంటే పారిశ్రామికంగా వెనుకబడిన ప్రాంతాలకు యిచ్చే ప్రోత్సాహం, రాయితీలు దీనికి యివ్వాలి.

పరిశ్రమ శైశవావస్థలో వున్నప్పుడు కొన్ని పన్నులు మినహాయిస్తే అవి ఏపుగా పెరగడానికి అవకాశం వుంటుంది. ఈ రోజుల్లో పరిశ్రమ ఉత్పత్తిదశకు రాకముందే పంచాయతీ, మునిసిపల్ పన్నులు కట్టమంటూ ఉద్యోగులు ప్రత్యక్షమవుతున్నారు. అసలు పెట్టుబడి, ముడిసరుకు, యంత్రాలు సమకూర్చుకోడానికి ఇబ్బందిపడే చిన్న పారిశ్రామికుడు, ఉత్పత్తి ప్రారంభంకాకముందే పన్నులు చెల్లించాల్సివస్తే, అతని పరిస్థితి ఎట్లా వుంటుందో వూహించుకోవచ్చు. కాబట్టి బోనసు' గ్యాట్యుటీలలో మాదిర్నే, ఈ పన్నులలోకూడా కనీసం ఐదేళ్ళదాకా మినహాయింపు యివ్వడం అవసరం.

అన్నివైపులనుండి సహాయం, సహకారం, ప్రోత్సాహం, మద్దతు లభిస్తే, నెల్లూరుజిల్లా పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందడానికి అవకాశం వుందని నా నమ్మకం. ఆవిధంగా నెల్లూరు జిల్లా అభివృద్ధిని సాధించిననాడు నిరుద్యోగసమస్య చాలావరకు పరిష్కరించబడగలదు. ★



పెన్నతీరాన జొన్నవాడ కామాక్షమ్మ దేవాలయం. ఫోటో: పి. జి. ఎస్. రెడ్డి.

Phone : 977

# United X-Ray Clinic & Diagnostic Centre

**16/118. Trunk Road - NELLORE-1 (A P)**

## 100 M. A. Screen Plant With Screening Facility
## Microbiology Section Attached

## యునైటెడ్ ఎక్స్‌రే క్లినిక్ & డయాగ్నొస్టిక్ సెంటర్

ట్రంకురోడ్డు (కో-ఆపరేటివ్ బ్యాంకు ఎదురుగా) నెల్లూరు-1

*With the best Compliments from:*

**Dr. P. Madhusudana Sastry** M.S., F.I.C.S.
**Dr. J. Eswaraiah** G.C.I.M.
**Dr. A. V. S. Ramamurthy** L. I. M.

---

పవిత్ర సముద్రతీరగ్రామమైన మైపాడులో వేంచేసియుండు

## శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ ప్రసన్న విశ్వేశ్వరస్వామిని
## సాక్షిగణపతి, వల్లిదేవసేనాసమేత శ్రీ సుబ్రహ్మణ్యస్వామి

వార్లను దర్శించి తరించవలసిందిగా భక్తకోటిని కోరుచున్నాము.

**ఈ క్షేత్రము నెల్లూరుకు 14 మైళ్ళదూరం మాత్రమే**

— ధర్మకర్తలమండలి —

శ్రీ పట్నం పేరారెడ్డి, శ్రీ కొండూరు ఆదిశేషారెడ్డి, శ్రీ అయితా చెంచుసుబ్బయ్య
శ్రీ గజ్జల దినకర్‌రెడ్డి, శ్రీమతి గండవరం అనసూయమ్మ.

ఎ. ఎల్. నరసింహయ్య
కార్యనిర్వహణాధికారి.

శ్రీ చలంచర్ల రాఘవరెడ్డి
అధ్యక్షుడు.

పాఠకులందరికి మా హృదయపూర్వకమైన

# ఉగాది శుభాకాంక్షలు



భారత్ వారి
సూపర్ డీలక్స్
మల్టీఛానల్
టెలివిజన్

టెలివిస్టావారి ఎలైట్ (సాలిడ్ స్టేట్) మల్టీఛానల్ టెలివిజన్



మీ యింట్లో టెలివిజన్
అమర్చుకొనడానికి
మాతో సంప్రదించండి.

# ఎ. బి. టెలివిజన్

ఫోన్ నెం: 935

ఎ.9, అరబిందోనగర్ (జిల్లాకోర్టు ఎదురుగా) నెల్లూరు-524003.

"భారత్", "టెలివిస్టా"వారి టెలివిజన్లకు అనుమతిపొందిన డీలర్లు

(PERFECTION IS OUR PHILOSOPHY - ELECTRONICS IS OUR BUSINESS.)

*COVER PRINTED AT ORR JAY PROCESS, MADRAS-2.*